*Issued on 10—10—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

# OFFICIAL REPORT

*THURSDAY, the 29th SEPTEMBER 1955.*

VOLUME IX — No. 3.

CONTENTS



**Printed By Jyothi Press, Tenali**
**For the Superintendent, Government Press,**
**Andhra State, Kurnool.**

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

Thursday, the 29th September, 1955.

The House met in the Assembly Chamber, Kurnool, at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshmi Narasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

*Gazetted Officers in the Hindu Religious and Charitable Endowment Board Department.*

530—

* 153 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) the number of Harijans out of the 11 Gazetted Officers in the Hindu Religious and Charitable Endowment Board Department now working ;

(b) the number of clerks in this Department.

(c) the number of Harijans out of clause (b) in the State now ; and

(d) whether there are proposals to reconstitute Tirupati Devasthanam Board in this year ?

The Hon. Sri K. CHANDRAMOULI.

(a) There are no Harijan Gazetted Officers in the Hindu Religious and Charitable Endowment (Administration Department.

(b) 89 ;

(c) 1 ;

(d) The matter is under consideration.

SRI S. VEMAYYA :—అస్పృశ్యతా నివారణ ప్రభుత్వ విధానముకదా! ఆ శాఖలో ఎక్కువమంది హరిజనులను వెయ్యడానికి పూనుకొంటుందా? తిరుపతి దేవస్థానం బోర్డును reconstitute చేసేవిషయం under consideration అని చెప్పారు. ఎంతకాలంలో ప్రభుత్వం ఒక నిర్ణయానికి వస్తుందో తెలుసుకోవచ్చునా?

THE HON. SRI K. CHANDRAMOULI :—హరిజనుల విషయములో సీట్లరిజర్వేషను ఉంది. ఇప్పటికి ఆంధ్ర State వచ్చిన తరువాత Assistant Commissioner గా ఒక Harijan ను వేసుకోవడం జరిగింది. Clerks విషయంలో మాత్రం Service Commission వారు ఏదో డిపార్టుమెంటుకు ఎంతెంతమంది కావాలో వారే కేటాయిస్తారు. మొత్తం percentage మాత్రం ఉంటుంది. తొందరలోనే పూర్తిచేస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇంతవరకు Gazetted Officer లు లేకుండా ఉండడానికి కారణము ఏమిటి?

THE HON. SRI K. CHANDRAMOULI:—ఇప్పుడు ఏమిచెప్పలేము. ఆంధ్ర State వచ్చినతరువాత ఒక్క ఆఫీసరును వేసినాము. ఆ ఒక్క ఆఫీసరు హరిజనును వేసినాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఎందువల్ల appoint చెయ్యలేదు?

THE HON. SRI K. CHANDRAMOULI :—లేదని చెప్పను. Service Commission వస్తుంది. వారు ఎందుకు వెయ్యలేదో నేను ఎలాగ చెప్పగలను?

SRI S. BRAHMAYYA :—ఈ పదకొండుమంది Gazetted Officers లో Harijans లేరన్నారు. మహమ్మదీయులు ఎవరైనా ఉన్నారా?

Mr. SPEAKER :—No. Muslims cannot be appointed under the Act.

[29th September 1955

SRI B. SANKARAYYA :—కొన్ని సంవత్సరాలతరబడి వెళ్ళిన కాగితాలకు జవాబులే లేవు. Efficiency జాస్తి చెయ్యడానికి చర్యలు తీసుకుంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అది నేను ఒప్పుకొనను.

SRI R. B. RAMAKRISHNA RAJU :—Supervisors classలో ఎంతమంది మహమ్మదీయులు ఉన్నారండి?

THE HON. SRI K. CHANDRAMOULI : —ఇది Supervisors కు సంబంధించినది కాదు.

SRI V. VISWESWARA RAO :— Hindu Religious and Charitable Endowment Act క్రింద కమస్తాలుగా ఎక్కువ దైవభక్తి కలిగిన వారిని, తెలిసినవారిని appoint చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆలోచించుతాము. హిందువులలో హరిజనులకు వెనుకబడిన జాతులకు reservation ఉంది.

SRI P. SUNDARAYYA :—ప్రభుత్వం అస్పృశ్యతా నివారణకోసము, Communal G. O. ప్రవేశపెట్టిందని మంత్రిగారు చెప్పారు. మొత్తము దామాషాను G. O. ప్రకారం ఇస్తున్నారు. ఒక డిపార్టుమెంటులో తక్కువగా ఉన్నారని చెప్పారు. ఈ విషయం పదే పదే అంటున్నారు. ఏఏ Department లో మొత్తం హరిజనులు ఏఏ తరంగా ఉన్నారో తెలియచేస్తే ప్రభుత్వవిధానముమీద సమగ్రమైన చర్చతీసుకుని వచ్చేదానికి information తయారు చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరేప్రశ్న వేస్తే వివరములు చెప్పడానికి అభ్యంతరములేదు. ఏఏ Department లో ఎంతమంది హరిజనులు ఉన్నారో చెప్పగలను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—తిరుపతిదేవస్థానం బోర్డు constitute కా లేదన్నారు. దానిని ఏ విధముగా constitute చెయ్యబోతున్నారు? ఇదివరకు M. L. A. లు ఉండేవారు, ఇప్పుడు ఉంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆలోచనలో ఉన్నదని చెప్పాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—హరిజనులంటే దేవునిబిడ్డలు, ఇది దేవస్థానాలను సంబంధించింది కాబట్టి హరిజనులకు ప్రాతినిధ్యం ఎక్కువగా ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇస్తున్నారు. ఇకముందు కూడా ఇస్తారు.

Sri L. LAKSHMANA DAS :—Religious Endowment Board లు మతానికి సంబంధించినవి. దానిని ఎక్కువగా ఆచరణలో పెట్టవలసిన వారు ఆడవాళ్లు కాబట్టి వారికి ఎక్కువ ఉద్యోగాలు ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరే ప్రశ్న.

SRI P. BAPIAH :—దేవస్థానం గుమస్తాలు దేవస్థానం Building లో ఉండడానికి provision ఉన్నాదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—అసలు provision లేదు. ఏదైనా ఉంటే exceptional cases లో పరిస్థితులనుబట్టి permission ఇస్తే ఇవ్వవచ్చును.

Sri S. RANGANATHA MUDALIAR :—Is there any proposal, Sir, to give Archaka training to Harijans ?

The Hon. Sri K. CHANDRAMOULI :—That is a separate question.

SRI V. VISWESWARA RAO .—Tirupati Devastanam Board reconstitution గురించి ఆలోచిస్తాము అన్నారు. హరిజనులకు ఎక్కువ ప్రాతినిధ్యము ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—హరిజనులకు ఒక స్థానం reservation ఉన్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఇంకా ఎక్కువఇచ్చి ఉదారస్వభావం ప్రకటిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—వీలుకాదు.

SRI S. VEMAYYA :—Tirupati Devasthanam Board పునర్నిర్మాణము ఎంతకాలంపడుతుంది.

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆలోచనలో ఉంది. సాధ్యమైనంత త్వరలో చేస్తాము.

*Collection of "X-ray" charges.*

531—

* 259 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether the Government are collecting "X-Ray" charges from the poor patients in the State Hospitals ; and

(b) if so, the amount collected from them for the year 1954 ?

THE Hon. SRI K. VENKATA RAO—

(a) The answer is in the negative.

(b) Does not arise.

*Motor Vehicles exempted from the payment of tax.*

532—

* 1005 Q.—Sri S. VEMAYYA: Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the number of motor vehicles exempted from the payment of tax leviable under Madras Motor Vehicle Taxation Act, 1931 ?

The Hon. SRI D. SANAJIVAYYA—

137 Motor vehicles have been exempted from the payment of the tax leviable under the Madras Motor Vehicles Taxation Act, 1931.

SRI S. VEMAYYA :—ఏఏ basis మీాద exemption మంజూరు చేస్తారు? ప్రభుత్వవిధానము తెలుసుకొనవచ్చునా ?

29th September 1955]

THE HON. SRI D. SANJIVAYYA:—Vehicles in the use of the Governor are exempted from tax. తరువాత బంగనపల్లి నవాబు గారి Car W. H. O. వారి Vehicles ఇంకేమైనా philanthropic purposes కు use చేసేవాటికి exemption ఉంది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—W. H. O. వారికి ఎందుకు exemption ఇస్తున్నారు? వారికి డబ్బులేదా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Philanthropic purposes క్రింద వస్తుంది కాబట్టి ఇస్తున్నాము.

SRI S. NARAYANAPPA :—ఇప్పుడు రాష్ట్రములో చేనేత గుడ్డల ప్రచారముకోసము 4, 5 van లు ఉన్నవి. వాటికి motor tax exemption ఇస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA:—లేదు. అక్కడ వ్యాపారంలో లాభాలు ఉన్నాయి.

SRI A. KALESWARA RAO :—చేనేత సంఘంవారు లాభం లేకుండా గుడ్డలు అమ్ముతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—నారాయణప్పగారు విజ్ఞప్తి చేస్తే మేము exemption విషయము consider చేస్తాము.

Sri P. SREERAMULU :—Philanthropic purposes అన్నారు. Harijan Sevak Sangham van లు పెడితే exemption ఇస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Van లు పెట్టి గవర్నమెంటువారికి application పెట్టిన తరువాత ఆలోచిస్తాం.

SRI N. C. SESHADRI:—బంగనపల్లి నవాబుకు ఎందుకు exemption ఇచ్చారు?

THE HON. SRI D. SANJIVAYYA :—అది ఒక tradition గవర్నరుగారికి, నవాబుగారికి exemption ఇవ్వాలని. Central Government అర్డరు agreement కూడా ఉంది.

SRI S. RANGANATHA MUDALIAR :—Does every one who calls himself a Nawab get the exemption, Sir ?

THE HON. SRI D. SANJIVAYYA :—Ranganatha Mudaraliar గారు నవాబని పేరు పెట్టుకొని అర్జి పెట్టుకుంటే ఆలోచిస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఊడగొట్టిన నవాబులు, రాజ్యం ఏలుతున్న గవర్నరు, ఇద్దరు సమానమా ? ఇద్దరికి exemption ఇచ్చారు.

THE HON. SRI D. SANJIVAYYA :—Agreement ఉన్నదన్నాను.

Mr. SPEAKER :—There is an understanding. Objection is taken to the term "ఊడగొట్టిన Nawab."

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—పోనీ పడిపోయిన నవాబు అందాము.

SRI S. VEMAYYA :—ఈ 137 vehicles exempt చేసినందువల్ల ప్రభుత్వానికి ఎంత revenue పోతోందో చెబుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—దాదాపు 13,522 రూపాయిలు, per quarter, పోతోంది.

*Ramanna Cheruvu of Bangarupalem Estate.*

533—

* 1257 Q.—Sri P. RAJAGOPAL NAIDU : Will the Hon. the Minister for Revenue be pleased to state why Ramanna Cherurvu of Bangarupalem Estate in Chittoor taluk is not yet restored, though it was breached about 10 years ago ?

The Hon. SRI K. CHANDRAMOULI—

An estimate for Rs. 24,000 for the restoration of the tank has been prepared, and is now under the technical scrutiny of the Executive Engineer, Madanapalli. After the completion of the technical scrutiny, steps will be taken for executing repairs to Ramanna Cheruvu.

29th September 1955]

*Drinking water wells for Hill Tribes in the Agency tracts of Parvathipur taluk.*

534 —

* *1027* Q.—Sri P. GUNNAYYA: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) the number of drinking water wells sanctioned by the Government for Hill Tribes in the Agency tracts of Parvathipur taluk for 1955-56; and

(b) the estimated cost of each well?

The Hon. SRI K. VENKATA RAO—

(a) Ten wells.

(b) About Rs. 6,000 (Rupees six thousand).

(a) పది నూతులు

(b) ఒక్కొక్క నూతికి ఆరేసివేల రూపాయిలు ఖర్చవుతుంది.

SRI. P. GUNNAYYA :—అధ్యక్షా, ఎల్విను పేట ఏరియా చాలా పెద్ద ఏరియా. పదినూతులు అని సెలవిచ్చారు. నుయ్యి ఒకటింటికి 6 వేలరూపాయిలు శాంక్షన్-చేశామంటున్నారు. ఆ ఎల్విను పేట ఏరియాలో రాయిగాని, పనివారుగాని చౌకగా దొరుకుతాయి. ఎస్టిమేటుడబ్బు తగ్గించినట్లయితే ప్రభుత్వానికి ఎక్కువ లాభం వస్తుంది. తగ్గించడానికి ఏమైనా ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఆ విషయంలో నేను గున్నయ్యగారి సహాయం అపేక్షిస్తున్నాను. వారు దయచేసి ఈ tender పెట్టే వాళ్ళను Canvass చేసి కొంచెం తక్కువరేటుకు పెట్టిస్తే తప్పకుండా తగ్గుతుంది. మనకు డబ్బుమిగులుతుంది. ఎక్కువ నూతులు త్రవ్వించవచ్చు.

SRI M. SATYANARAYANA RAJU :—మంత్రిగారు tender పెట్టేవాళ్లను canvass చేయమన్నారు. ఇప్పుడు నుయ్యి ఒకటింటికి ఆరువేల రూపాయిలు ఇస్తున్నారు. ఆరువేలరూపాయిలు చాలా జాస్తిఅనిచెప్పి గౌరవనీయ సభ్యులు చెప్పారు. తక్కువ tender లు పెట్టించమని మంత్రిగారు చెబుతున్నారు. అందుకు మంత్రిగారు స్వయంగా ఒకనుయ్యి త్రవ్వించినట్లయితే దానికి యదార్థంగా ఎంతఖర్చవుతుందో, contractor కు ఎంతవఱకు లాభం ఇవ్వవలసివస్తుందో తెలుస్తుంది. కాబట్టి ఆ ప్రకారం చేయిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాకు వయస్సు మళ్ళిపోయింది. నేను నుయ్యి త్రవ్వించేటటువంటి పరిస్థితిలో లేను. సత్యనారాయణ రాజు గారు వయస్సులో ఉన్నారు. అందుచేత ఒకనుయ్యి త్రవ్వి ఎంతవుతుందో చూపిస్తే అందులో ముందుగా కొండలున్న ప్రదేశంలోకి వెళ్ళి వారు ప్రజాసేవచేసేవారు కనుక ఒక నుయ్యి త్రవ్వి ఇంతవుతుందని చెబితే ఆ ప్రకారం చెయ్యడానికి నాకు అభ్యంతరం లేదు.

*Formation of a Co-operative Society for Harijans of Kudaravalli village of Gudivada taluk.*

535—

* 1279 Q.—Sri V. VISWESWARA RAO : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether it is a fact that the Harijans of Kudaravalli village of Gudivada taluk represented to the Director of Fisheries and Deputy Registrar of Co-operative Societies, Vijayavada, to form a Fisheries Co-operative Society for them in the year 1954 ; and

(b) if so, the action taken thereon ?

The Hon. SRI D. SANJIVAYYA—

(a) Yes, Sir.

(b) No separate Fishermen Co-operative Society was formed for the Harijans in the village but the existing Field Labourers' Co-operative Society in the village has been permitted to amend its by-laws providing fishing as one of its objects, as desired by the Harijans.

సవర్ణ హిందువులనుకూడా చేర్చుకునేటట్లు ఒక condition పెట్టి చేర్చుకోడానికి ఒప్పుకున్న తరువాత ఆ By-Law కూడా amend ఐంది.

SRI PRAGADA KOTAIH :—అధ్యక్షా, ఈ Fishermen Co-operative Societies organise చెయ్యాలంటే విధిగా ఇంతమొత్తం share capital వసూలు చేయాలనేటటువంటి నిబంధన ఏదైనా ఉన్నదా అండీ? ఉంటే దాన్ని సడలించడానికి పూనుకుంటుందా ప్రభుత్వం ?

29th September 1955]

THE HON. SRI D. SANJIVAYYA :—Share capital కొంత ఉండవలసిందే. లేకపోతే పనిచెయ్యడం కష్టం. ఐతే ఇంతఖచ్చితంగా ఉండాలని ఏమీ లేదు. Executive orders ఏమైనాఉన్నా సడలించడానికి మాకేమీ అభ్యంతరంలేదు.

Sri P. VENKATASUBBAYYA :—ఉన్నటువంటి Credit Society లో By-law amend చేసి చేపలు పట్టడానికి అవకాశం కల్పించాలంటున్నారు. అటువంటప్పుడు వాళ్లు వలలు తయారు చేసుకోడానికిగాని సరియైన implements కొనుక్కోడానికిగాని అవకాశంఉండదు. కాబట్టి గవర్నమెంటు దానికేదైనా subsidy ఇస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అవకాశం లేకపోయినా By-law amend చేసిన కారణంచేత, fishing కూడా వాళ్ల objects లో ఒకటవుతుంది. కాబట్టి Fishermen Societies కి ఎటువంటి subsidy లు ఇస్తారో అటువంటివన్నీ ఇవ్వడానికి ఏమీ అభ్యంతరంలేదు.

SRI B. SANKARAYYA :—వృత్తి సంఘాలు ఏర్పాటుచేయడానికి ఇదివఱకు 50 రూ.లు Share capital ఉంటే సరిపోయేదని ఉండేది. ఇప్పుడేమిటంటే 400, 500 అనికూడా అంటున్నారు. కనీసం దీన్నివందయైనా చేసేదానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇదివఱకటి 50 రూపాయలే ఈనాటి 400 రూపాయిలుగా విలువనుబట్టిచూస్తే మారింది. ఎక్కడైనా పరిస్థితులను బట్టి మార్చడానికీ తగ్గించడానికీ ఏమీ అభ్యంతరంలేదు.

Sri P. SUNDARAYYA :—ఆనాడు 50 ఐతే Price index ను బట్టి ఏ Index నుబట్టి ఐనా 150 రూపాయిలకు మించదు. ఆ దృష్టిలో 400 కాకుండా 150 ఐనా చేసేందుకు తయారవుతారా మంత్రివర్గం ?

THE HON. SRI D. SANJIVAYYA :—150, ఇన్నూరు నూరు అని చెప్పలేను. అక్కడి వాస్తవిక పరిస్థితులనుబట్టి ఆర్థికపరిస్థితులనుబట్టి ఎంతకైనా తగ్గించడానికి మాకేమీ అభ్యంతరంలేదు. ఎందుకంటే తగ్గించినతరువాతకూడా, ఆ Society ఆ ధనాన్ని వినియోగించుకుని కార్యక్రమం నడిపించడానికి తాహతు కలిగినటువంటిదిగా తయారవాలి.

SRI PRAGADA KOTAIAH :—వెయ్యి రూపాయిలు విధిగా వసూలు చెయ్యాలనే నియమం ఉన్నది. అందువల్ల పరిస్థితులనుబట్టి సంఘాలు register చేయడానికి ఒక circular ను Deputy registrar లందరకూ పంపిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—నేను ఇదివరకే Registrar తో చెప్పినానండి. Circular పంపించమంటే కూడా పంపిస్తాను.

SRI S. VEMAYYA :—ఈ fishing rights ఇచ్చేటప్పుడు Fisheries Department, Co-operative Department, Revenue Department, మూడు Department లలో ఆ G. O. ప్రకారం ఏ Department final గా ఇవ్వాలనే విషయమై, ఆలస్యమైతే గవర్నమెంటుకు డబ్బుపోతుంది. కాబట్టి నిర్దిష్టమైనటువంటి ఒక Order క్రింద ఉద్యోగస్థులకు పంపడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అన్ని కేసులలో ఎల్లాజరిగినా ఈ కేసులోమాత్రం నాకువచ్చిన report నుబట్టి Assistant Director of Fisheries, Deputy Registrar of Co-operative societies ఇద్దరూ కలిసివెళ్ళి విచారించి దీన్ని ఏర్పాటుచేశారు.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, మంత్రిగారు సెలవిస్తూ By-law amend చేసేటప్పుడు కడం Castes వారందరూ చేరేటట్లుగా ప్రయత్నం చేస్తామని చెప్పారు. కాని ఇది ఇప్పటికి రెండు సంవత్సరాలైనది. రెండు సంవత్సరాలైనప్పటికీ ఇంతవఱకూ ఏమిజరగలేదు. అక్కడుండేటటువంటి ప్రజలు ప్రత్యేకం దీని విషయమై చాలా ఇబ్బందిపడుతున్నారు. కనుక వెంటనే చర్య తీసుకుని Society ఏర్పాటు చేసేటట్లుగా చూస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఏనాది, కొప్పువెలమ, తూర్పుకాపు, ఉప్పర, యాదవ and చాకలి Communities వారు చేరినారు. చేరిన తరువాత ఈ By-law కూడా register అయినది. నాకు report వచ్చింది.

SRI PRAGADA KOTAIAH :—ఎవరినిపడితే వారిని సంఘాలలో చేర్చుకోమని ఆదుపుచేయడానికి ప్రభుత్వానికి అధికారంలేదన్న విషయం తెలుసునా అండి ?

29th September 1955]

THE HON. SRI D. SANJIVAYYA :—ఎవరినిబడితే వారిని చేర్చుకోవడంకాదు. అసలు fishing తెలిసినటువంటివారిని, చేపలుపట్టేటటువంటి కళలలో నైపుణ్యం కలిగినటువంటివారిని చేర్చుకోమన్నాము.

*Land for Rehabilitation of East Bengal Refugees in the State.*

5:6—

* 1398 Q.—Sri S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government propose to allocate land for rehabilitation of East Bengal Refugees in the State now; and

(b) if so, the places in which they will be settled ?

The Hon. SRI K. CHANDRAMOULI—

(a) Yes.

(b) The places where they may be settled have not yet been selected. They will be selected after a team of officers of the Government of India which is expected to visit this State shortly, has surveyed the various areas suitable for colonization.

Sri S. VEMAYYA :—ఈ refugees కి అయ్యేఖర్చంతా ఇండియా ప్రభుత్వమే పూర్తిగా భరిస్తుందా? రాష్ట్రప్రభుత్వం దాంట్లో భరించవలసిన బాధ్యత ఉంటుందా ?

The Hon. SRI K. CHANDRAMOULI :— Ministry of Rehabilitation of India will meet the cost of this development.

SRI. D. KONDAYYA CHOWDARY :—ఈ East Bengal శరణార్థులు ఎంతమంది వస్తున్నారు? వారికోసం ఎంతభూమి కేటాయించవలసి వస్తుంది? దానికిగాను ఏ ప్రదేశంలో ఇది నిర్ణయించబోతున్నారు?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంతమంది వస్తున్నారని గాని, ఇంత ప్రదేశం అనిగాని లేదు. సాధ్యమైనంతవరకూ ఎంతవరకూ వీలవుతుంటుంది అనే రిపోర్టుఅడిగారు. 50 కుటుంబాలు రావచ్చు, వందకుటుంబాలు రావచ్చు, వీలును

బట్టి అన్నిరాష్ట్రాలలో ఈ ఏర్పాట్లు జరుగుతున్నాయి. మనకున్న అనుకూలాన్ని బట్టి చేస్తాం.

Sri P. SUNDARAYYA :—వచ్చినపుడు వారికి భూములకోసం, ఇపుడే సాగుచేస్తున్నవాండ్లను తొలగించడానికి ప్రభుత్వం ఏర్పాటుచేస్తున్నదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అటువంటిది ఏమిలేదు.

Sri B. APPA RAO :—కేవలం తూర్పుబెంగాల్ కాందిశీకులకేనా ఏర్పాట్లు ప్రభుత్వం ఆలోచిస్తుందా? లేక బర్మా, మలయా, దేశములనుంచి వచ్చిన ఆంధ్ర కాందిశీకుల విషయంలోకూడ ఏర్పాటులు ప్రభుత్వం ఏమైనా కొన సాగిస్తుందా?

THE HON. SRI K. CHANDRAMOULI :—West Bengal నుంచి వచ్చిన requisition ను బట్టి India Government అడిగారు. ఆ విషయంలోనే బోగట్టా తెప్పిస్తున్నాం.

Sri C. SUBBARAYADU :—కొన్ని ప్రదేశములు survey చేశారు అని మంత్రిగారు చెప్పారు. అవి ఏఏ ప్రదేశాలలో తెలుసుకోవచ్చునా?

THE HON. SRI K. CHANDRAMOULI :—కొన్ని ప్రాంతాలు చూచారు. Inspect చేశారని చెప్పాను. సర్వేచేయలేదు.

Sri A. VENKATRAMA RAJU :—ఎంత provide చేయగలరని వారు అడిగారు ఎంత provide చేయగలమని చెప్పారో తెలియజేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—మొదట్లో 50 కుటుంబాలదాకా రావచ్చును. ఇంకా అవసరమైతే ఎక్కువకూడా వస్తారన్నారు. ఇప్పటికి కొంతవరకు ఇంత number తీసుకొంటామని committal ఏమిలేదు. అంతా Mutual agreement చూచిన తర్వాత ఏఏప్రాంతాలు వాండ్లకు ఉండడానికి వసతిగా ఉంటుందో, ఇవి అన్నీ ఏర్పాటుఅయిన తరువాత నిర్ణయం అవుతుంది. కాని మనం ఉదారంగా చూస్తాం. వాండ్లను తక్కిన States మాదిరిగా తీసుకొంటామని చెప్పి ఒప్పుకున్నాము.

SRI P. SUNDARAYYA :—అరకు Valley లో వాండ్లకోసం స్థలం చూస్తామంటున్నారు, ఉత్తరంగా ఒరిస్సాఉంది. మీరు చూడగలిగింది ఏమిలేదు.

29th September 1955]

అరకువాలీలో చూస్తున్నారని ప్రతికలలో కూడ వచ్చింది అరకువాలీలో చూచి నపుడు అచ్చట చేపలు దొరకవు. బెంగాలీలు చేపలు లేకుండా జీవించడం చాలా కష్టం. కాబట్టి సముద్రతీరంలో చూస్తే బాగా ఉంటుంది. ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. CHANDRAMOULI :—బెంగాలునుంచికూడ ఆఫీసర్లు ఇక్కడికి వస్తారు. వాండ్లువచ్చినపుడు బెంగాలీలు నివసించడానికి ఎక్కడ వసతులు ఉంటాయో, వాండ్లకు ఆ మాత్రం ఆలోచించకుండా తీసుకొచ్చి వాండ్లకు ఇష్టములేకుండా నిర్బంధంగా పెట్టే విధానం కానే కాదండి.

SRI T. RAMACHANDRA REDDI :—అరకువాలీ మధ్యలో, అడవులు, ఆప్రదేశంఅంతా చూస్తున్నారని మంత్రిగారు ఇపుడు చెప్పారు. అయితే అడవులు కొట్టవలెనని మంత్రిగారికి అభిప్రాయం ఆ. రీతిగా ఉన్నదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అడవికొట్టడం లేదండి. ఏఏ ప్రాంతాలలో వీలు ఉంటుందో ఆ ప్రాంతాలు చూస్తున్నారు.

SRI PRAGADA KOTAIAH :—ఈ వచ్చేవారంతా అచ్చంగా వ్యవసాయంమీద ఆధారపడేవారేనా? లేక ఇతరవృత్తులున్నాయా? ఉండేవారికి వృత్తులు కూడ చూపిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Details work out చేయవలెను.

SRI K. SUBBA RAO :—అధ్యక్షా, ఉన్న కర్మకుతోడు ఉపాకర్మ ఒకటి అని అందరు మాకేభూమి కావాలనిచెప్పి భూదానముతో బాధపడుచున్నపుడు, మళ్ళీ వీండ్లందరిని తీసుకొనివచ్చి పెట్టుకోవాలనే టటువంటిది పై ప్రభుత్వంవారి నిర్బంధమా ? లేకపోతే మీరంతగా మీరే కోరి ఉదారంతో చేసే ప్రయత్నమా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—దానికి నిర్బంధంలేదని మొదటనే చెప్పానండి.

SRI P. SUNDARAYYA:—గొంపేట సముద్రం దగ్గరగాఉంది. కాబట్టి బంజరుభూములు రాజకీయ బాధితులకు ఇచ్చారు. రాజకీయ బాధితులదగ్గరనుంచి తీసుకొని బెంగాలు బాధితులకు ఇచ్చేదానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

29th September 1955]

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒకరిదగ్గరనుంచి ఇంకొకరికి తీసి ఇవ్వడం కాదండీ. ప్రభుత్వానికిఉన్న చోట్లలో ఆలోచిస్తారు.

*Grant of licences to dig iron ore.*

537—

*1072 Q.—Sri P. BAPAIAH : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) the number of Darkhasts received by the Government for the grant of licences permitting to dig iron ore in the Government poramboke and forest lands of Gandrayi village, Nandigama taluk, Krishna district ;

(b) the names of the Darkhastdars datewar ;

(c) whether the Government propose to auction these lands instead of granting them on darkhast on account of which there will be an income of some lakhs of rupees to them ;

(d) whether the Government are aware that the mining companies now working in these parts are paying Rs. 2,000 per acre for the lands adjacent to the above Government lands and digging iron ore ; and

(e) whether the Government propose to undertake to start this industry themselves ?

The Hon. SRI K. VENKATA RAO—

(a) & (b) Several applications have been received for the grant of mineral concessions for iron ore in Gandrayi and other villages, but as the matter is still under consideration, the Government do not consider it advisable in the public interest to disclose the number of applications received or the names of the applicants.

(c) There are no such proposals. The Mineral Concession Rules do not provide for auctioning mineral concessions.

(d) It is reported that the rates paid range according to this figure.

(e) The matter is under examination.

Sri P. BAPAIAH :—అధ్యక్షా, ఈనెల 23 వ తేదీన ఆంధ్రపత్రికలో జగ్గయ్యపేట ఇనుపగనులు కౌలుకు ఇవ్వరాదని ఉత్తరువు ఇచ్చినట్లుగా ప్రకటింపబడింది. ఆ ఉత్తరువులు మంత్రిగారు ధృవపరుస్తున్నారా.

THE HON. SRI K. VENKATA RAO :—Government వారు కొన్ని భూములు ఎవరికి Mining concession ఇవ్వవద్దని ఉత్తరువు చేసిన మాట నిజం.

SRI M. NAGI REDDI :—ఈ ఇనుపరాయిని పట్టాభూములనుంచి కొన్నిచోట్లనుంచి ఎగుమతి చేస్తున్నారు. ఆ ఎగుమతిమీద సీనియరేజి ఏమైనా వేస్తుందా ? ఏ రేటులో వసూలుచేస్తున్నది?

THE HON. SRI K. VENKATA RAO:—ఈ ప్రైవేటు lands మీదనుంచి వెళ్ళే దానిమీద టన్నుకు ఒక రూపాయ గవర్నమెంటు వసూలు చేస్తున్నారు. దానివల్ల ఇప్పటికప్పుడే ఆరులక్షల రూపాయలు మనకు వచ్చింది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఇపుడు టన్నుకు ఒక రూపాయ మాత్రమే వసూలుచేస్తున్నారు. దీనిని ఎక్కువ చేసేందుకు మనకు ఏమైనా అధికారాలున్నాయా ? సీనియరేజి ఎక్కువచేసి ఎక్కువ ఆదాయం సంపాదించటానికి వీలు ఉందా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇపుడు ఆస్కారలేదు. ఇంకా ఏమిచేసుకొన్నా మన భూమిలో ఉన్నదే ఎక్కువగ ఉన్నటువంటిరాయి. దాని వినియోగాన్ని గురించి ఆలోచిస్తాం.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మన భూమిలో ఎక్కడ ఎంతరాయి ఉన్నదని అంచనా తేలింది? ఎంతరాయి ఉంటేటట్లయితే ఒక చిన్నపాటి ఫ్యాక్టరీఅయినా పెట్టుకో డానికి వీలు ఉంటుంద్గా ?

[29th September 1955

THE HON. SRI K. VENKATA RAO :—40 లక్షల టన్నులు రాయి కనుక ఉంటే చిన్న melting plant పెట్టడానికి వీలు ఉంటుంది. ఇప్పటి estimates 5 లక్షలనుంచి 40 లక్షలదాకా ఉండవలెను. చాలా గొప్ప గొప్పవాండ్లు భేదాభిప్రాయానికి రావడంవల్ల ఇండియాకల్లా ప్రధానమైన Geologist Doctor, M. S. Krishnan, Head of Geological Survey of India వారికి ఈ question refer చేశాము.

Sri P. RAJAGOPALA NAIDU :—ఈ భూములను auction చేసే దానికి M. C. Rules ఏమైనా మార్చుతారండి ?

THE HON. SRI K. VENKATA RAO :—మళ్ళీమాటు ఎప్పుడైనా నామిత్రులుగాని వారి స్నేహితులుగాని పార్లమెంటు సభ్యులు అయినపుడు ఆ ప్రయత్నం అక్కడ చెయ్యాలి. ఇక్కడ చేయకలిగింది ఏమీలేదు.

SRI E. NAGAYYA:—ఈ Manganese mines కలకత్తా, బొంబాయి నుంచి వచ్చేకంపెనీలకు licence లు ఇస్తున్నారు. మన ఆంధ్రులకు ఇవ్వకూడదనే రూల్సు ఏమైనాఉన్నవండీ? అలా కాకపోతే ఆంధ్రులకు ఎవరికైనా ఇచ్చారా ? అంతా కలకత్తావారికే ఇస్తున్నారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాగయ్యగారు ఇక్కడ బోధన చేయడమేగాని, ఇంటిచుట్టువారు పనిచేయడం అలవాట్టు ఉన్నట్టు ఏమీకనిపించదు. ఆంధ్రులచేత దరఖాస్తులుపెట్టించి ప్రధానమైన హక్కువారికి కలిగించేటందుకు ప్రభుత్వంసిద్ధంగాఉంది. నాచేతిలోటి ముందు ఆంధ్రుడుఅంటే వాడికి అర్ధరూపేయడమేగాని ఇంకొకడికి వేయడం జరుగదు. కాని రూల్సుకు లోబడి ప్రభుత్వాన్ని నడిపించాలనే సంగతి వారు గుర్తించడం మంచిది.

Sri P. KOTHANDARAMAYYA :—ఈ Iron ore మన దేశంలో ఉపయోగంకోసం వినియోగపడుతుందా ? లేక ఇతర దేశాలకు ఎగుమతి కోసం ఈ licence దార్లకు ఇవ్వడం జరుగుతుందా చెప్పగలరా ?

THE HON. SRI K. VENKATA RAO :—స్ఫుటంగా చెప్పగలను. ఇప్పటివరకు వచ్చినరాయి అంతాకూడా Czechoslovakia, Japan కు వెళ్లింది.

SRI. S. NARAYANAPPA :—ఈ Iron ore ను గురించి ప్రభుత్వమే ఏదో ఒకవిధమైన పరిశ్రమ స్థాపనచేసే ఏదో ఒక విధమైన పెట్టుబడిక్రింద చేస్తు

వలెనని తల పెట్టింది, ఆలోచన చేస్తుందని మంత్రిగారు సెలవిచ్చారు. ఇది ఎంత కాలంలో ప్రభుత్వం నిర్ణయం తీసుకొంటుంది ? లేక వెంటనే యిప్పటి ఈ దరఖాస్తుదార్లను dispose of చేసేదానికి ఏదైనా ఒక నిర్ణయం తీసుకొంటారా అని ప్రశ్నిస్తున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—M. S. Krishnan గారి దగ్గరనుంచి జవాబురాగానే, Government of India దగ్గరనుంచి జాబురాగానే మేము నిర్ణయం తీసుకొనడానికి వీలు అవుతుంది. ఆ కాల నిర్ణయం అవతలవారి చేతిలో ఉంది. గాని నా చేతిలో లేదు. రెండో విషయం. కొంతమందికి ప్రయివేటుగా దరఖాస్తు పెట్టినవారికే ఇవ్వాలి, అన్న భావం, మనస్సులో ఉన్న భావాన్ని ప్రస్ఫుటం చేయడానికి నా మిత్రులు ఆ ప్రశ్న వేశారనుకొంటాను. వీలు అయినంతవరకు దానిని ఎవరికి ఇవ్వకుండా ప్రభుత్వమే సాధించాలని యత్నం చేస్తున్నాము. ఒక వేళ తప్పక పోయినట్లయితే M. C. Rules ప్రకారం మొట్ట మొదట ఎవరు దరఖాస్తు పెట్టుకొంటారో వారికే ఇవ్వవలెనని నియమం ఉంది. వారిపేరు మార్చాలన్నట్లయితే ఇండియా ప్రభుత్వం మార్చవలెను గాని ఈ ప్రభుత్వానికి అటువంటి హక్కు లేదు.

SRI K. SUBBA RAO :—ఈ కాకిరాయి ఇకమీదనుంచి పంపించకూడదని భారత ప్రభుత్వంవారు ఆంక్షవేసినట్లు ఉంది. కనుక ఆంధ్ర దేశంలో ఉండే ఈ కాకిరాయిని అంతా ఇనుముగా మార్చేదానికి ఇక్కడ ఒక మిల్లు పెట్టించేటటు వంటి ప్రయత్నం ఏమైనా చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—కాకిరాయి మీద ఇంతవరకు Government of India ban లేదు. ప్రయివేటు export మీద అలాగు ఉన్నట్లయితే మేము వెళ్లకుండా తక్షణం ఆపుచేసి వేస్తాం. రెండవ విషయం. హైదరాబాదులో private lands లో ఉండేది మన దగ్గర ఉండేది 40 లక్షల టన్నులు ఉన్నప్పటికికూడ ఏదైనా Melting plant పెట్టితే ఇపుడు 10 రూపాయలు లాభం వచ్చేది సుమారు 60 రూపాయలదాకా లాభం వస్తుంది. దానిని వినియోగించు కొనేందుకోసమే ఈ యత్నం చేస్తున్నాం. దాని యొక్క సఫలీకృతం మనకు వచ్చేటటువంటి experts advice మీద ఆధారపడి ఉంటుంది.

SRI SHEIK MOULA SAHEB :—నెల్లూరు జిల్లా, కనిగిరి తాలూకా లోని పొలాలలో క్రైసెట్ గనులున్నాయి. ఆ తా య ప్రదేశాలకు

పోకుండా నిషేధించారు. అట్లులేకుండా, ఎవరైనా దానిని ఎగుమతి చేయదలచు కుంటే, అందుకు permits ఇస్తారా? లేకపోతే ప్రభుత్వం తరఫున ఏదైన అల్యూమినీయం పరిశ్రమ నెలకొల్పి పేద ప్రజానీకానికి పని కల్పిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—నేను నిన్ననే ఒక mining licence కు ఆర్డరు చేసినట్లు జ్ఞాపకము. ఈ క్రైసేట్ వినియోగంకోసమే అది ఇవ్వబడినది. ఈ licence ఇవ్వబడినటువంటి ఆయనకూడ నెల్లూరు వారే, ఆంధ్రులే. ఇంకా ఎవరికైనా దరఖాస్తులుంటే, అక్కడ పదార్థము ఉంటే, శాస్త్ర ప్రకారం ఇవ్వడానికి ఎలాంటి అభ్యంతరము లేదు.

SRI A. BAPINEEDU :—పోలవరము తాలూకాలో కొండల్లో ఈ ఇనుపరాయి ఉన్నదని చాలామంది చెప్పుచున్నారు. అక్కడకూడ ప్రభుత్వము చర్య తీసుకొని investigate చేయిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ investigation అంకెలు గురించి Geological Survey of India వారు చెప్పవలసి యుంటుంది. బాపినీడుగారు ఇప్పుడు అది పలానచోట ఉన్నదని చెప్పారు. గనుక వారికిది తెలియపరచి పరిశోధన చేయవలసిందని కోరుతాము.

SRI M. NAGI REDDI :—ఈ సీనియరేజీ fees విషయంలో ఒక రూపాయ వసూలు చేస్తున్నాము. దాన్ని పెంచాలంటే, ఇకముందు ఆలోచన చేస్తాము అన్నారు. ఈ fees టన్నుకు ఇంత వేయాలనేది ఇదివరకే ఈ minerals కు fix అయి ఉన్నదా ? అలాలేక పోయినట్లయితే సిమెంటురాయికి టన్నుకు నాలుగు అణాలు చొప్పున వసూలు చేస్తున్నారు. ఇప్పుడు సిమెంటు కంపెనీలు 15, 20 లక్షలు సంపాదిస్తున్నాయి. అందువల్ల ఆ రాయిమీదకూడ ఏమైనా పెంచడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—పన్నులు ఎక్కువ వేసే రోజులలో మనకు అధికారం ఉంటే, తప్పకుండా వేసేదానికి నేను అంగీక రిస్తాను.

SRI SHAIK MAHOMMAD RAHAMATHULLAH :—ఇప్పుడు ఆంధ్ర రాష్ట్రం నుంచి సంవత్సరానికి ఎంత iron ore export అవుతున్నదో చెప్పగలరా ?

29th September 1955]

THE HON. SRI K. VENKATA RAO :—నాలుగైదేళ్లనుంచి ఈ కొకిరాయి వ్యవహారం ప్రారంభించారు. దాంట్లో ఆరు లక్షల టన్నుల దాకా ఇప్పటివరకు export అయింది.

SRI G. BAPAIAH:—జగ్గయ్యపేట ఇనుప గనుల విషయంలో ప్రభుత్వం వారు industry ప్రారంభించడానికి అవకాశము లేకపోతే, ఎవరైనా private పార్టీలు pilot plant పెట్టి pig iron తయారు చేసుకోడానికి licence ఇప్పిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాయొక్క బలాన్ని, బుద్ధి కుశలతను వినియోగించి తప్పకుండా ఇప్పిస్తాను. దానివల్ల ఈ నెత్తి మీది బరువు తగ్గుతుంది. ఆ విధంగా ఎవరైనా బయలుదేరివస్తే, తప్పకుండా తీసుకురావలసిందని బాపయ్యగారిని కోరుతున్నాను.

SRI S. VEMAYYA :—క్రిష్ణా జిల్లా నుంచి జకోస్లోవోకియాకు కూడ ఇది export అవుతుందని మంత్రిగారు చెప్పారు. మన ప్రభుత్వానికి export మీద వచ్చేటటువంటి royalty ఆదాయం ఎంతో సెలవిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO .—ఈ Royalty తప్ప మరేమిరాదు, రాష్ట్ర ప్రభుత్వానికి.

SRI N. P. CHENGALRAYA NAIDU :—ఇప్పుడు ఈ iron ore మీద వచ్చేటటువంటి royalty విషయంలో, మన రాష్ట్రమునుంచి బయటికి పోయ్యే దాన్నిగురించి అంటె, బందరు ఓడ రేవుమంచి, విశాఖపట్నం ఓడ రేవునుంచి, ఇంకా ఇక్కడనుంచి మద్రాసు harbour లోకి పంపించే వాటి లెక్కలకున్ను, ప్రభుత్వ లెక్కలకున్ను చాలా తేడా ఉన్నది. అది సరిచూచేదానికి ప్రభుత్వము ఆలోచిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—మేము ఈ కష్టాన్ని ఎత్తిపెట్టడం కోసం చాలా కృషిచేశాము. ఈ గంట్రాయి అనేటటువంటిది ఊర్లో నుంచి main road లోకి వచ్చేటటువంటి మార్గాలన్నిటిమీద special officer లను వేసి రాత్రీ పగలు కొండ బయటికి వెళ్లకుండా ఏర్పాటుచేశాము. ముందట కోర్టులలో ఏమి జరిగిందో నాకు తెలియదుగాని, ఇప్పుడుమటుకు ఒకరాయి కాదు గదా, ఒక్క రేనుగూడ బయటకి వెళ్లడానికి వీలులేదు.

[29th September 1955

*Weavers' Co-operative Society at Palasa.*

538—

* 1342 Q.—Sri N. RAMULU : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether the weavers of Palasa, Srikakulam district, have requested the Government in 1954 to register a Weavers' Co-operative Society at Palasa ; and

(b) if so, the action taken thereon ?

The Hon. SRI D. SANJIVAYYA—

(a) Yes, Sir.

(b) A Weavers' Co-operative Society at Palasa was registered by the Deputy Registrar, Srikakulam on 25th August 1955.

*Appointment of Trustees for the temples.*

539—

* 1720 Q.—Sri ALLURI VENKATARAMA RAJU : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether it is a fact that only one trustee is being appointed for the temples instead of three trustees ; and

(b) if so, why ?

The Hon. SRI K. CHANDRAMOULI :—

It is not a fact that for all temples only one trustee is appointed. Under section 39 of the Hindu Religious and Charitable Endowment Act 1951, it is incumbent that the Board of Trustees for listed temples should consist of 3 to 5 trustees. In the case of non-listed temples, provision is made under section 41 (1) of the Act for the appointment of a single trustee also, as some small temples may not require 3 to 5 trustees.

[29th September 1955

SRI A. VENKATARAMA RAJU :—ఇదివరలో దేవాలయాలలో ముగ్గురు trustees ఉంటూ ఉంటే ఇప్పుడు ఒకరినే ఎందుకు ఉంచారు? దానికి కారణమేమిటి?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ విషయంలో స్పష్టంగా చెప్పాను. Listed temples, Non-listed temples అని ఉన్నాయి. Non-listed temples అంటె 25 వేలకంటె తక్కువ ఆదాయము వచ్చేవి. చిన్న దేవాలయాలలో, ఇద్దరు, ముగ్గురుని మించి వేయకూడదని ఉన్నది. కాని listed temples లో మాత్రం ముగ్గురునుంచి అయిదు మంది వరకు వేయవలసి ఉంటుంది.

SRI A. VENKATRAMA RAJU :—ముగ్గురు ఉంటే కష్ట మేమిటి? ఒకరే ఉంటే వచ్చే లాభమేమిటో చెప్పుతారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—లాభమనికాదు. Administrative convenience కోసం ఆ విధంగా చేయబడుతుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇదివరకు ముగ్గురిని వేసినటువంటి temples కు ఇప్పుడు ఎందువల్ల ఒకరినే వేశారు?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒకరినే ఎందుకు వేశారు, ఇద్దరు, ముగ్గురుని ఎందుకు వేయకూడదు అనేదికాదు ఇక్కడ. Administrative convenience ను బట్టి చేశారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇదివరకుముగ్గురుని వేసినచోట, ఇప్పుడు ఒకరినే వేయడానికి కారణమేమిటి? ఏమి inconvenience feel అయ్యారో చెప్పుతారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—Administration లో అప్పుడప్పుడు కొన్ని difficulties రావచ్చు. ఇది మామూలుగా Commissioner చూస్తూ ఉంటాడు. ముగ్గురుని వేస్తే తగాదాలు ఎక్కువ ఉంటాయి. వాళ్లలో వాళ్లకే పరస్పర విరుద్ధాలు ఉంటాయి. కనుక smooth గా administration run అయ్యేకోసం ఆ పరిస్థితులను బట్టి వేస్తూ ఉంటారు.

SRI G. LAKSHMAYYA :—ప్రత్యేక సంస్థలలో గల మూడు దేవాలయాలకు ఒకే trustee ని వేసిన విషయాలు చాలా ఉన్నాయి. అటువంటివి ప్రభుత్వ దృష్టిలోకి వచ్చాయా?

29th September 1955]

THE HON SRI K. CHANDRAMOULI :—ఒక గ్రామంలో 2, 3 దేవాలయాలు ఉన్నప్పుడు, వాటికి common గా కూడ trustees ను వేయవచ్చు.

SRI N. C. SESHADRI :—ఈ trustees ను appoint చేసే విషయంలో వీరికి కనీసమైన యోగ్యతలేమైనా నిర్ణయిస్తారా? ఇదివరకు ఉన్న trustees కొంతమంది criminal cases లో convict అయిపోయి ఉంటే, వారిని మరల తీసుకోడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—సాధ్యమైనంతవరకు న్యాయంగా పరిపాలన చేసే వాళ్లను, తగాదాలు లేకుండా ఆదాయాన్ని జాగ్రత్తగా ఉంచే వాళ్లను చూచి appoint చేస్తారు.

SRI P. VENKATASUBBAYYA :—ఈ trustees నియమించబడిన తరువాత, వాళ్లు పరిమితి కాలములో సరిగా పనిచేయకపోతే వాళ్లను తొలగించి వేరే వాళ్లను వేసేదానికి వీలు ఉన్నదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—తప్పుచేస్తే, అది రుజువయితే, తొలగించడానికి వీలున్నది.

SRI S. RANGANATHA MUDALIAR :—In seleting the trustees, does the Government follow the principle that only those who have belief in idol worship are made Trustees? Is there any place for agnostics and atheists?

The Hon. SRI K. CHANDRAMOULI :—It is the opinion of the Government that those that have faith will properly discharge their duties.

SRI P. GOPALU REDDI :—Trustees అనేకారు గౌరవార్థంగా దేవస్థానం కార్యాలు చేస్తూ ఉంటారు. కాబట్టి వారు మీటింగులకు హాజరయ్యేటప్పుడు, D.A. గాని, T.A. ప్రభుత్వం ఇచ్చేదానికి rules లో provide చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—Trustees అంటే ఊర్లో ఉన్నవాళ్లనే సాధ్యమైనంతవరకు వేస్తూ ఉంటారు. కనుక వాళ్లకు T.A., D.A. అనేదేమీలేదు. వారు చేసేది గౌరవనీయమైన పని.

SRI G. RAMI REDDI :—Trustees ఏదైన తప్పుచేసినప్పుడు, వారిని తొలగించినాకూడా, వారు వేరొకరికి charge ఇవ్వకుండా తప్పించుకొంటూ ఉంటే, అట్లా చేయకుండా తక్షణమే బోర్డువారు ఏమైనా చేయడానికి వీలున్నదా? అంతేకాకుండా, వీరు కోర్టులకు ఎక్కుతూ ఉండడంకూడ జరుగుతుంది. అట్లు జరుగకుండా పరిపాలించే పద్ధతిలో ప్రభుత్వమేమైన, ఉత్తర్వులు జారీచేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—Hereditary trustees కు సంబంధించినవి కొన్ని rights ఉన్నాయి.

SRI S. NARAYANAPPA :—అయిదువందల రూపాయలకు లోపల ఆదాయంవుండే దేవాలయాలకు ట్రస్టీలను నియమించి వాటి అర్చకులను ఆ దేవతలను, ట్రస్టీల స్వాధీనములో వుంచటానికి ప్రభుత్వం ప్రయత్నంచేస్తుందా? లేకపోతే ట్రస్టీలను తొలగించటానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ విషయము నేను యిందాకనే చెప్పాను. Non-excepted temples కు ట్రస్టీలనువేసే సందర్భములో ఒక్కరినిగూడ వేయవచ్చును. అవసరమైతే, యింకా ఒకరిని యిద్దరిని ఎక్కువగాగూడా వేయవచ్చు.

SRI C. SUBBARAYUDU :—ఈ Trustees ను appoint చేసే సందర్భములో Area Committee లయొక్క సలహాలనుగూడా పాటిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—Area Committees కూడా Trustees ను appoint చేస్తారు.

SRI S. VEMAYYA :—ఈ Trustees లో hereditary trustees అని వుండడమువల్ల ప్రభుత్వమునకు యిబ్బందులు కలుగుతున్నాయి. అటువంటివారు లేకుండా ప్రభుత్వమువారు యికమీదట ఉత్తరువులు జారీచేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—Hereditary trustees వున్నందువల్ల పెద్ద యిబ్బందులు ఏమీ వుండడములేదు. వారిలోగూడా చక్కగా శ్రద్ధతీసుకొని పనిచేసేవారు వుంటున్నారు.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, దేవాలయములకు Trustees ను appoint చేసే సందర్భములో దేవునిమీద నమ్మకము, భక్తివుండే వారినే వేస్తారా? లేకపోతే భక్తిలేనివారినికూడా వేస్తారా?

Mr. SPEAKER :—That has been already answered. దేవునిమీద faith వున్నవారినే వేస్తారని చెప్పారండి.

SRI M. NAGI REDDI :—దేవాలయభూములు manage చేయటానికి పంచాయితీబోర్డువారికి అధికారము యివ్వటానికికూడా Act లో provision యిచ్చారు. ఇటువంటి provision చంద్రమౌళిగారి హయాములో తయారుచేసిన యాక్టులో పెట్టటము జరిగింది. కాబట్టి చిన్న చిన్న దేవాలయాలకు Trustees ను appoint చేయడము కేవలము nominate చేసేపద్ధతి అవలంబించే దానికంటె ప్రజాస్వామిక సిద్ధాంతమునకు అనుగుణంగా ప్రజలచే ఎన్నుకోబడిన పంచాయితీ బోర్డుల స్వాధీనము చేయటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

(No Answer.)

SRI B. SANKARAYYA :—చట్టములో provision వున్నప్పటికినీ ఎన్నికపద్ధతిమీద ఏర్పడిన పంచాయితీబోర్డులకు యివ్వకూడదని ప్రభుత్వము ఎందువల్ల భావిస్తున్నది ?

THE HON SRI K. CHANDRAMOULI :—గ్రామాలలో ఎవరు మంచివారని ప్రభుత్వము అనుకుంటే, వారిని వేస్తున్నారు. అంతే.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, Hereditary trustees వుండడమువల్ల దేవాలయాలకు ఏ విధంగాను నష్టమురాలేదని మంత్రిగారు చెప్పారు. అటువంటి సందర్భములో కృష్ణాజిల్లా దివి తాలూకానుంచి ఏమైనా పిటిషనులు ప్రభుత్వానికి వచ్చాయా ? దేవాలయభూములకు పబ్లిక్‌గా వేలము పెట్టకుండా యీ ట్రస్టీలే స్వంతముగా వుపయోగించుకుంటున్నారని ప్రభుత్వానికి పిటిషనులు వచ్చాయా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వంశ పారంపర్యపు హక్కువుండే ట్రస్టీలమీదనే యిటువంటి నేరాలు వుండవు. ఇతర ట్రస్టీలమీద కూడా వుంటాయి. అటువంటివారు వున్నారు, యిటువంటివారు వున్నారు, పిటిషనులు ఎవరిమీదవచ్చినా, దుర్వినియోగముచేస్తే ప్రభుత్వము తీసిన విచారణచేసి, చర్య తీసుకుంటుంది.

Sri M. RAJARAM :—దేవాలయములకు Trustees ను appoint చేసే సందర్భములో హరిజనులుగా వుండేవారిని ఎవరినైనా యింతవరకు వేశారా ? లేకపోతే యిప్పుడు ఎవరినైనా appoint చేయబోతారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇదివరకు కొంతమందిని appoint చేశారు

29.h September 1955]

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ట్రస్టీలు యిద్దరు ముగ్గురువుంటే పోట్లాడుకుంటున్నారు, అందువల్ల ఒక్కరినే వేశామని మంత్రిగారు చెబుతున్నారు. అటువంటప్పుడు ట్రస్టీలు ఒకరికన్న ఎక్కువమందివున్న వారందరిని తీసివేసి, అన్నిచోట్లనూ ఒక్కరినే వుంచదలచుకున్నారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—నేను ఆ విషయము చెప్పలేదు.

*Recruitment of Block Development Officers and Social Education Organisers.*

540—

* 1454 Q.—Sri S. JAGANNADHAM : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state why only people from Revenue Department are being taken as Block Development Officers and Social Education Organisers and why not from Agricultural Department ?

The Hon. SRI K. VENKATA RAO ?

It is not a fact that only people from the Revenue Department were taken as Block Development Officers and Social Education Organisers.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, Block development officers గానూ Social Education Organisers గానూ appoint చేసే సందర్భములో Revenue Department నుంచి తీసుకోటానికి వీలు అయినంత వరకు తగ్గిస్తూ, Medical Department నుంచి, Health Department నుంచి యింకా యితర డిపార్టుమెంట్లనుంచి హెచ్చుమందిని తీసుకోటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—Appointments అవసరాన్నిబట్టి చేయవలసివస్తుంది. చేయవలసినపని ఎవరిదివారికేవుంది. ఇంతవరకు 16 మందిని Revenue Department నుంచి, ముగ్గురిని Agricultural Department నుంచి, 10 మందిని Ex-Rural welfare Department నుంచి తీసుకోవడం జరిగింది.

Sri K. SUBBA RAO :—నిరుద్యోగ సమస్య పరిష్కారానికి యిప్పు డప్పుడే వుద్యోగాలలో వుండేవారిని తీసుకొనివచ్చి యిక్కడ వేయకుండా, సంక్షేమ కార్యక్రమాలలో చక్కగా విద్యాయోగ్యతలు కలిగివున్న అనధికారులను సగానికి సగముమందిని యీ Development డిపార్టుమెంటులో ఉద్యోగాలనివ్వ డానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—నేను చెప్పినవారిలో పదిమంది Ex-Rural Welfare Officers కూడా Non-officials యే వారి పేర్లు కూడా సుబ్బారావుగారికి తెలుసు. సగానికి కొంచెము హెచ్చుతక్కువగా, సగానికి తక్కువగా వారినే చేశాము కాని Unfortunate గా, వారికి Administration చేతకాకనో, మరే యితర కారణముచేతనోగాని, నిన్ననో మొన్ననో వారిలో కొంత మందిని suspension లోకూడా పెట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. అందువల్ల Departmental training అయినవారిని వేసుకోకపోతే, లక్షలకొద్ది డబ్బుఖర్చు చేసే చోట ప్రభుత్వానికి నష్టమువచ్చే పరిస్థితి ఏర్పడ్డది. గనుక, దీని విషయములో కొంత చర్య తీసుకుంటున్నాము. Department లోని వారిని Village Level Workers గా start అయి, అక్కడ అనుభవము సంపాదించుకున్నవారికి ప్రమోషను యిచ్చేదానికి ఏర్పాట్లుచేస్తూన్నాము. ఒక భాగానికి డైరక్టుగా recruit చేయ టానికి ప్రయత్నము చేస్తున్నాముగాని యిది క్రింద ఉద్యోగస్థులకు అన్వయిస్తుంది. Block development officer ఉద్యోగము ప్రమోషనువల్లనే రావాలని ప్రభు త్వము అభిప్రాయపడుతున్నది.

SRI S. VEMAYYA:—అధ్యక్షా, ఈ Block Development Officers Block ను develop చేసేదానికంటే, అక్కడక్కడ Development నే block చేస్తున్నట్లు చాలాచోట్లలో తెలుస్తున్నది. ఈ Block Development సందర్భములో అనధికార్లకంటె అధికార్లే ఎక్కువగా Blocks చేస్తున్నారు. కాబట్టి, యీ విషయములో ప్రభుత్వము త్వరలోనే విచారణచేసి, మంచి ఉద్యో గస్థులను వేయటానికి, అనధికార్లనే ఎక్కువమందిన్ని, తగినవారిని వేయటానికి, ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—అనధికార్లనువేస్తే జరిగిన విషయము యింతకుముందే విపులముగా చెప్పాను. అంతకంటె ఎక్కువమందినివేస్తే ప్రభుత్వముయొక్క డబ్బుకు ఎకౌంటు దొరకదు. వేమయ్యగారి District లోనే నిన్ననో మొన్ననో ఒకరిని suspension లో పెట్టవలసివచ్చింది. ఆయన

29th September 1955]

మాతో కలసి పనిచేసినవాడే చాలా పెద్దమనిషి అనుకున్నాము. ప్రభుత్వము యొక్క ధనం దుర్వినియోగము చేయడంవల్ల ఆయనను suspension లో పెట్టకతప్పలేదు. విచారణలో ఏమిజరుగుతుందో నాకు తెలియదు. అందువల్ల, అధికార్లు డబ్బు ఖర్చు పెట్టేస్తున్నారు, అనధికార్లు డబ్బు దుర్వినియోగము చేయరు, అనే అభిప్రాయము వుండడము సరియైనదికాదు. అందుచేత ప్రభుత్వములోని వారినే తీసుకునే విధానాన్ని గురించి నేను మనవిచేశాను.

తరువాత Block ను Develop చేసేబదులు development ను block చేస్తున్నారని, వేమయ్యగారు తమ ఆంగ్లభాషవిద్యా ప్రవీణ్యాన్ని చూపించారు. కాని ఆంధ్రదేశములో యిప్పటివరకూ జరిగిన progress చూచుకుంటే, అటువంటి వ్యవహారము ఎక్కడా కన్పించదు. పైగా యీ మధ్య Evaluation Officer అని ఒకరిని వేశాము. అక్కడ ప్రతిదినము ఖర్చుచేయబడేసొమ్ము చెప్పినరీతిగా ఖర్చు అవుతున్నదో లేదో పరిశీలించటానికి, ప్రతి మూడునెలల కొకసారి progress పరిశీలనచేస్తున్నారు. ఈ విషయములో బ్లాకులు యింకా ఎక్కువ అవుతున్నాయి. గనుక, కొత్త కొత్త innovation పెట్టి చట్టబద్ధంగా, క్రమబద్ధంగా నడపటానికి ప్రయత్నము చేయనున్నది.

Sri D. GOPALA RAO :—Is there any qualification fixed for the Block Development Officers ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు లేదుకాని, యిక ముందుఅయినా కొంచెము విద్యావంతులుగా వుండేవారిని, పరీక్షలు ప్యాసుఅయిన వారినే తీసుకుంటే ఉపయోగముగాను, లాభకరముగాను వుంటుందని అనుభవాన్ని బట్టి తెలుస్తున్నది.

Sri D. GOPALA RAO :—Sir, May I request that the help of the social organisations like the Guild of Service, Red Cross, etc., be brought into play ?

THE HON. SRI K. VENKATA RAO :—మొన్న జరిగిన గవర్నరుగారి పరిపాలనలో Block Development Committees లోనూ, District Planning Committees లోనూ వున్నవారందరు డబుల్ జరితల వాళ్లవారే. అంటే Red Cross, Ambulance, Guild of Service కు చెందినవారే ఎక్కువమంది వున్నారు.

29th September 1955]

SRI P. ANTHONY REDDI :—అధ్యక్షా, Block Development Officers గా ముఖ్యంగా Agriculture Graduates నే తీసుకోవాలని Government of India వారు సూచించినట్లుగా తెలుస్తున్నది. అటువంటివారిని ఒక్కరినిగూడా తీసుకున్నట్లు కన్పించదు. కారణమేమి ?

THE HON. SRI K. VENKATA RAO :—నేను చెప్పినది ఆంథోనీ రెడ్డిగారు సరిగా వినలేదు. ఇప్పటికప్పుడే ముగ్గురిని Agriculture Department నుంచి తీసుకున్నామని చెప్పాను. ఇకముందు promotions క్రింద తీసుకుంటామనికూడా చెప్పాను.

SRI R. B. RAMAKRISHNA RAJU :—Social Welfare Organisers కు ఏదైనా కనీసపు విద్యవుండాలని ప్రభుత్వము తీర్మానించారా ? టీచర్లనుగూడా తీసుకుంటారా ?

THE HON. SRI K. VENKATA RAO :—Social Welfare Organisers గా Graduates కంటే తక్కువ qualification వున్నవారిని తీసుకోకుండా వుండడానికి యీ మధ్యనే ప్రభుత్వం నిర్ణయించింది. వీలుగా వుంటే B.A., L.T., అంటే B. Ed., B.Et., పరీక్షలు ప్యాసుఅయినవారినే తీసుకుంటున్నాము. ఇందులో మూడు రకాలుగా వున్నవి. ఒకరిని యిదివరకు సర్వీసులో వున్నవారిని ప్రమోషను చేయడమువల్ల, ఒకభాగము Department నుంచి తీసుకోవడమువల్ల, యింకొక భాగము direct recruitment వల్ల తీసుకోటానికి నిర్ణయించబడ్డది. రేపు రాబోయే 15 వ అక్టోబరునాటికి direct recruitment కు దరఖాస్తులు పంపవలసిందిగా పత్రికలలో advertisement కూడా పడింది. ఎవరైనా సమర్థులైనవారువుంటే, రామకృష్ణరాజుగారు వారిచేత దరఖాస్తు పెట్టించవచ్చు.

SRI R. B. RAMAKRISHNA RAJU :—Graduates కాని వారికి chance వున్నదా ?

THE HON. SRI K. VENKATA RAO :—దురదృష్టవశాత్తు యిదివరకు S. S. L. C. fail అయినవారిని ఒకరిని Social Welfare Organizer గా చేశాము. అయితే Government of India వారు Weeding Committee అని ఒక కమిటీని వేసి, సరియైన సమర్థతలేనివారిని pick out చేయటానికి ప్రయత్నాలు జరుగుచున్నవి.

Sri RAJA SAGI SURYANARAYANA RAJU :—అధ్యక్షా, ఈ మధ్య Minor Irrigation Overseer ను Block Development Supervisor గా వేశారు. కాని అక్కడ మామూళ్లు యిక్కడ దొరకనందువల్ల, యిక్కడ వుండకుండా, తిరిగి వారి డిపార్టుమెంటుకే వేయించుకున్నారు. ఈ Block Development సందర్భములో సరియైనవారిని వేయకపోతే ప్రమాదము జరుగుతుంది. అందువల్ల ప్రభుత్వమువారు తగినచర్యతీసుకొని, సరియైనవారిని వేయటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. VENKATA RAO :—మామూళ్లు యిచ్చేటటువంటి రాజాగారి స్నేహితులు, యివ్వటము మానివేస్తే, యిటువంటి ప్రశ్నలు రావు. (Laughter)

Sri R. B. RAMAKRISHNA RAJU :—Secondary Grade Training అయినవారు దరఖాస్తులు యిటీవల పంపించుకున్నారు. వారందరిని select చేస్తారా? Graduates కాకపోయినా Secondary Training అయినవారిలో అనుభవం కలవారిని తీసుకోటానికి ప్రభుత్వమునకు అభిప్రాయమువున్నదా ?

The Hon. Sri K. VENKATA RAO :—ఇదివరకు ఏమిచేశారో నాకు తెలియదు. కాని నా వ్యక్తిగత అభిప్రాయములో నేను appoint చేయదలస్తే, Graduates కు తక్కువ కాకుండా వుండేవారికి 125 రూపాయలనుంచి 200 రూపాయలవరకూ యిచ్చేఉద్యోగాలలో S. S. L. C. తప్పిన అనర్హ్న గ్రాడ్యుయేట్లను వేయటానికి నేను అంగీకరించను.

Sri P. GOPALU REDDI :—అధ్యక్షా, మంత్రిగారు బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసర్లుగా అనర్థికొర్లను వేయడమువల్ల అది అసమర్థంగా వుండటము తటస్థించిందని అన్నారు. ఈ అసమర్థత అనేది రెవెన్యూ డిపార్టుమెంటు సహకారము సరిగా ఇవ్వనిచోట్ల ఏర్పడిందని మంత్రిగారికి తెలుసునా ?

The Hon. Sri K. VENKATA RAO :—అయితే అయి ఉండవచ్చును. రెండువేల రూపాయలు account లో draw చేసి, 1000 రూపాయలు ఖర్చుచేసి దీనవ్వక 6 నెలల తరువాత ఇచ్చి మిగిలిన డబ్బు ఇంతవరకు ప్రభుత్వానికి జమకట్టక పోవడానికి రెవెన్యూ డిపార్టుమెంటు యొక్క obstruction ఉన్నదని నేను అనుకోను. ఈ విషయం గోపాలురెడ్డిగారు తెలుసుకోవడము మంచిది.

[29th September 1955

SRI S. K. V. KRISHNAVATARAM :—ఈ బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్లుగా S.S.L.C. తప్పినవారు పనికిరారు, గ్రాడ్యుయేట్సును వేసుకుంటున్నామని చెప్పారు. స్కూల్ ఫైనలు తప్పినవారికి మంత్రుల ఉద్యోగాలు ఏమైనా రిజర్వుచేశారా ?

THE HON. SRI K. VENKATA RAO :—మంత్రులకు qualification అవసరములేదు. Qualification కనుక ఉంటే కృష్ణావతారంగారికి డిగ్రీ వున్నది కాబట్టి మంత్రిగా వుండవలసినవారు. ఇక్కడున్న మంత్రులకు సరియైన qualification degree లేదు. అందువల్ల M.L.A. కు ఏ నిబంధన లేనందున మంత్రులకు కూడా లేకపోవడం అనేది ఏర్పడ్డది. ఒకవేళ S.S.L.C. తప్పినవారు సమర్థులై ఉంటే Village Workers క్రింద వేయవచ్చును. కష్టపడి పనిచేసేవారికి ఈ దేశంలో దోవలెన్నో లేకపోలేదు.

SRI M. NAGI REDDI :—ఈ Block Development Schemes, ఈ National Extension Schemes వేయడంలో ఈ స్కీములు అమలు జరిపినటువంటి చోట్ల పెద్ద ఆఫీసర్లు ఎట్లా ఉన్నప్పటికీ Block Development Officers, Veterinary Doctors, ఈ Village Level Workers ను కూడా ఏ ప్రాంతాలనుంచో తీసుకువచ్చి వేస్తున్నారు. ఏ ప్రాంతాల వారిని, ఆ ప్రాంతాలలోనే రిక్రూట్ చేస్తే వాళ్ల ద్వారా ప్రజల సహకారం ఇంకా ఎక్కువ రావడానికి అవకాశాలు వుంటాయి. కాబట్టి అట్లాంటి ఏర్పాటు ప్రభుత్వము చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—2 సంవత్సరముల క్రింద దరఖాస్తులు పెట్టుకోమంటే అన్ని ప్రాంతములనుంచి వారు దరఖాస్తులు పెట్టుకున్నారు. వాళ్లు ట్రైనింగు అయ్యారు. 18 మాసములు ట్రైనింగు అయిన తరువాత వాళ్లను Village level Workers క్రింద వేయాలి. మొన్న latest recruitment ప్రకారం అన్ని జిల్లాలనుంచి హరిజనులకు సహాయం 573 recruit అయినారు. ట్రైనింగు అయినవారు కొన్నాళ్లకు బైటకు వస్తారు. అప్పుడు ఏ ప్రాంతాల వారిని ఆ ప్రాంతంలో వేయడానికి మాకు అభ్యంతరములేదు.

SRI R. B. RAMAKRISHNA RAJU :—School Final pass అయిన వాళ్లకు, Secondary Grade Training pass అయిన వాళ్లకు, Social Work లో అనుభవమున్న వాళ్లకు వీటిల్లో ఏమైనా అవకాశాలు ఉన్నదా అని నేను అడుగుతున్నాను.

[29th September 1955

THE HON. SRI K. VENKATA RAO:—Social Education Organisers క్రింద లేదు. Village Level Workers క్రిందవస్తే నా అభ్యంతరము లేదు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, Revenue Department నుంచి గాని, Education Department నుంచిగాని, Agriculture Departmentనుంచిగాని ఆఫీసర్లను సరాసరి, Block Development Officersగా వేస్తున్నాము అంటున్నారు. వారికి అట్టి అనుభవము ఉండటములేదు. అందుచేత Block Development Officers గా వేసేముందు వారికి 6 మాసములు training ఇప్పించేదానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—మొట్టమొదటగా తీసుకొన్నప్పుడు అంతగా చూడలేదని నేను మనవిచేశాను. అందుచేత సీడింగు కమిటీ వచ్చిందనికూడా మనవిచేశాను. ఇకనుంచి National Extension Officers గా వచ్చేవాళ్లకు 6 నెలలు ట్రైనింగు ఉన్నది. Village Level Workers 18 నెలలు ట్రైనింగు వున్నది. ఈ Block Development Officersకు ఏదో కొంతకాలం కాల నిర్ణయము ఉన్నది. ఆ training అయితేనే గాని ఉద్యోగాలు ఇవ్వరు.

SRI N. P. CHENGALRAYA NAIDU :—ఈ Block Development Officers గా ఆడవారిని వేయడములేదు. వారిపైన మంత్రిగారికి కోపమా?

THE HON. SRI K. VENKATA RAO :—Block Development Officers లో లేరుగాని M.L.A. లు సాధారణముగా పర్యటనచేసే నియోజక వర్గాలలో Village Level Workers, Social Education ఆర్గనైజర్సుగా చాలామంది స్త్రీలు ఉన్నారు.

**Sri S. RANGANATHA MUDALIAR :—Will the Government avoid, as far as possible, appointment of non-officials as Block Development Officers, as it exposes the Government to the charge of nepotism ?**

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు అటువంటి భయంలేదండి. ఇప్పుడు సక్రమమైన రూల్సు వచ్చాయి. కొత్తగా చేసే రోజుల్లో అంతా ఏవో పద్ధతులు అవలంబించారు, వాళ్ల అవసరము కొద్ది. ఇకపైన శాస్త్రీయమైన, నిర్ణీతమైన రూల్సు మీద జరుగుతుంది. ఆ రూల్సును ఫ్రేమ్ చేస్తున్నారు.

సుమారు 10, 15 రోజులలో అవి ప్రచురణచేసి వాటి సిద్ధాంత ప్రకారమే చేస్తాము.

SRI P. BASI REDDI :—ఈ Block Development Officers ను, ఈ National Extension Officers ను recruit చేసే అధికారము సర్వీసు కమీషనుకు అప్పగిస్తే బాగుంటుందేమో ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు ఇచ్చినపనే వారు చేయుటకు చాలా కష్టపడుతున్నారు. ఈ చిన్న ఉద్యోగాలకొరకు కూడా వారికి పంపిస్తే చాలా ఆలస్యం అవుతుంది. అందుచేత పెద్దలతోటి ఒక కమిటీ వేశాము. ఆ కమిటీలో అనుభవజ్ఞులైన మన డిప్యూటి స్పీకరు అయిన కల్లూరి సుబ్బారావుగారు కూడా వున్నారు. వారు తమ విధిని సక్రమంగా నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

SRI A. BAPINEEDU :—Village Level Workers గా మొన్న ఎన్నికో బడిన వారిలో చాలామంది స్కూల్ ఫైనలు ప్యాసు అయినవాళ్లు, Intermediate ప్యాసు అయిన వాళ్లు మాత్రమే ఇచ్చారు. స్కూల్ ఫైనలు fail అయినవారికి కూడా ఇచ్చామని మంత్రిగారు చెప్పారు. ప్యాసు అయినవారు కూడా చాలా కొద్దిమంది వున్నారు. Intermediate లో ఒకటి, రెండు పార్టులు ప్యాసుఅయిన వాళ్లువున్నారు. అందుచేత S.S.L.C. తప్పినవారికికూడా 25% లేక 50% సీట్లు రిజర్వు చేయిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—ఆ సలహా పుచ్చుకుంటే ఈ పైన ఎవ్వరూ S.S.L.C. ప్యాసుకారు. ఎందుచేతనంటే ఉద్యోగాలు 50% రిజర్వు అయివుంటున్నాయి. అందువల్ల ఈ హామీ నేను ఇవ్వలేను.

*Passenger fares on Gooty-Kurnool Bus.*

541

* 1572 Q.—Sri M. MUNUSWAMI : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether the Government are aware that a particular bus plying from Gooty to Kurnool is charging Rs. 3 from the passengers occupying the first two rows, while the ordinary fare is Rs. 2 and As. 6 ;

(b) whether it is not the infringement of rules by way of excess fare collection ; and

(c) if so, what action is going to be taken in the matter ?

The Hon. SRI D. SANJIVYYA :

(a) The answer is in affirmative.

(b) It is not an infringement of Madras Motor Vehicles Rules, 1940, as the operator of the bus which is an express stage carriage can charge 50 per cent over and above the rates fixed for ordinary stage carriages. In the first two rows of the bus, a superior class of accommodation is provided and the fares of Rs. 3 charged from passengers occupying the first two rows, is within the maximum permissible.

(c) Does not arise.

SRI C. SUBBARAYUDU :—ఇప్పుడు వారు 50% ఎక్కువ పెట్ట వచ్చును అన్నారు. అయితే ఒకటి బస్సులో 50% ఫేర్సు వుండడానికి ఏ సెక్షను క్రింద ఏ రూల్సు ప్రకారం వుండవచ్చునో సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Section 43 Notification చూస్తే Express Buses కు 50% charge చేయవచ్చును అని, అదే Express Buses లో special accommodation ఉంటే 100% వరకు charge చేయవచ్చును అన్నారు.

SRI M. MUNUSWAMI :—అధ్యక్షా, ఇట్టువంటి classes గా సీట్లు విభజింపబడిన బస్సులు మన స్టేటులో యివిగాక వేరే వున్నాయా? ఇతర స్టేటుల్లో ఎక్కడైనా వున్నాయేమో సెలవిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA :—మన స్టేటులో ఇది తప్ప వేరే వున్నట్లు నాకు తెలియదు. నేను ఢిల్లిలో వున్నప్పుడు U. P. State లో అక్కడక్కడా వున్నాయని విన్నాను.

*Selection of Executive Officers to Panchayats.*

542.—

* 582 Q.—Sri S. NARAYANAPPA : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state ;

(a) how many people for Executive Officers' posts to Panchayats have been selected during 1954–55;

(b) how many of rhem were selected frum the Departments and how many from outside;

(c) what are the required qualifications for this post;

(d) how many candidates are still to be appointed to whom training has been given;

(e) by whom the selection of the candidates was conducted; and

(f) how many of the selected gandidates belong to backward communities?

The Hon. SRI A. B. NAGESWARA RAO—

(a) Seventy-one persons were selected for the posts of executive officers of panchayats during 1954-55.

(b) Nine of the above persons are those in service in various Departments and Offices, while the remaining sixty-two are outsiders.

(c) A person, not being a member of Scheduled Castes and Backward Classes should have completed and been declared eligible for College courses of study;

If he is a member of Scheduled Castes and Backward Classes, he should hold a completed S.S.L.C. merely. He should not be more than 30 years old, if outsider; and not more than 35 year old, if in service under Government, District Board, Municipal or Panchayat.

(d) Thirty-five of the trained persons have yet to be appointed as Executive Officers.

(e) The Inspector-General of Local Administration.

(f) Five.

SRI S. NARAYANAPPA :—అధ్యక్షా, ఇప్పుడు departmental గా recruit చేయబడినటువంటి Executive Officers list లో 30 సంవత్సరములు, 35 సంవత్సరములు వాళ్లకు age limit వుంటుంది. ఆ age limit తీసివేసే ప్రయత్నము అనుభవము సంపాదించినటువంటి ఈ పంచాయితీలలో పని చేసినటువంటి గుమాస్తాలలో నుంచి Executive officers లోకి తీసుకుంటే చాలా వుపయోగముగ వుంటుంది. ఆ age limit ను తొలగించే ప్రయత్నము చేస్తారా మంత్రిగారు?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—గౌరవసభ్యులు ఏదైనా అటువంటి అర్జీ పెడితే, అప్పుడు ప్రభుత్వము ఆలోచిస్తుంది.

*Construction of new buildings for the Government Hospital at Chirala.*

543—

* 1469-F Q.—Sri PRAGADA KOTAIAH : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the steps that are being taken for the construction of new buildings for the Government Hospital at Chirala ?

The Hon. SRI K. VENKATA RAO—

To mark a definite stage in the matter of constructing new buildings for the Government Hospital at Chirala, the Government have decided to acquire land measuring ten acres thirty-eight cents (acres 10·38 cents) in Chirala during the current year.

*Andhra Automobile Association.*

544—

* 1665 Q.—Sri G. RAMASWAMI REDDI : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether any representation has been made requesting for permission to start the Andhra Automobile Association under section 26 of the Indian Companies Act, 1913 ;

(b) if so, the action taken so far ;

(c) whether the Government have asked for a share of assets from the Automobile Association of South India, Madras-3 ;

(d) whether the Government are aware that large revenue is being collected from the Automobie ownres of Andhra, by the Madras Associatioon ;

(e) whether the Government are aware that the Central Government have decided to entrust some of the tourist affairs to the Automobile Associations in India ; and

(f) if so, whether this Provincial Government expedite the organization of Andhra Automobile Association to be in time to receive the Central Grant?

The Hon. SRI D. SANJIVAYYA—

(a) & (b) A representation has been received from the promoters of Andhra Automobile Association, Guntur. It is under examination of the Government.

(c), (d), & (e) Information is not available.

(f) The organisation of the Association is one purely for the promoters.

SRI G. RAMASWAMI REDDI :—మోటారు యజమానులు, ప్రభుత్వము మధ్య సామరస్యము సద్భావము పెంపొందించేందుకు విదేశీయ, దేశీయ యాత్రికులకు సలహాలు ఇచ్చి తోడ్పడేందుకు ఈ అసోసియేషన్ చాలా అవసరం. ప్రభుత్వం దీనిని సాధ్యమైనంత తొందరలో ప్రారంభించేదానికి ప్రయత్నము చేస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇప్పుడు బెజవాడలో ఆంధ్ర స్టేటుకు Special Registrar of Joint Stock Companies అని వున్నారు అనుకొంటాను. ఆయనకు ఈ application పంపాము. తరువాత ఆయన 'Government may issue Licences under the Indian Companies Act 1913,' అని అన్న తరువాత రిజిస్టరు చేస్తానని చెప్పారు.

29th September 1955]

*Transfer of Block Development office from Narasipatnam to Kotauratla.*

545—

* 1654 Q.—Sri M. NAGI REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) whether it is a fact that the Block Dovelopment office has been transferred from Narasipatnam of Visakhapatnam district to Kotauratla village in the month of 1955 July ; and

(b) if so, the reasons therefor ?

The Hon SRI K. VENKATA RAO :

(a) Yes, Sir.

(b) It is a fact that the Block Development Office was shifted from Narasipatnam to Kotauratla in July 1955. Narasipatnam is not the Block Headquarters and is outside the Block area. The Office was temporarily located in Narasipatnam for want of accommodation at Kotauratla.

## II. NON-OFFICIAL BUSINESS.

## RESOLUTIONS.

### (1) Pay scales recommended by the Central Pay Commission —(contd.)

The Hon. SRI K. VENKATA RAO :—అధ్యక్షా, మొన్న ఈ చర్చ జరిగిన రోజున దురదృష్టవశాత్తు నేను శాసన సభలో లేకపోవడంవల్ల సమంగా ఈ points మీద గౌరవసభ్యులు ఏమి మాట్లాడారో పత్రికల్లో చదివాను తప్ప అంతకన్న ఎక్కువ తెలియదు. అందువల్ల పేమయ్యగారు జవాబు చెప్పేవరకు విపులంగా జవాబు చెప్పలేకపోతే క్షమించాలని కోరుతున్నాను. N.G.O. లు అంటే స్వల్ప జీతాలలో ఉండే ఉద్యోగులు అని మనం అనుకోవాలి. N.G.O. ల list లో తాసిల్దారులుకూడా ఉన్నారు. వారి జీతం రు. 250 లు వరకు

ఉంటుంది. కొంతమంది గెజెటెడ్ ఆఫీసర్ల జీతం రు. 200 లు కూడా లేదు. రు. 130 లు, రు. 180 లు, రు. 200 లులో బయలుదేరే గెజెటెడ్ ఆఫీసర్లు ఉన్నారు. తీర్మానం ఉద్దేశం- నా ఊహ ప్రకారం- రు. 100 లు- అంతకన్న తక్కువ జీతం వచ్చేవారిని గురించి అనుకుంటున్నాను. ఈ సందర్భంలో నా మనవి ఏమిటంటే ఈ తక్కువ జీతగాళ్ల కష్ట సుఖాలు ఎవరూ ఎరుగనివి కావు. మనం అందరము ఎరుగుదుము. ఒక్కటే నేను మనవిచేస్తున్నాను. మనం పుట్టిన దేశపరిస్థితి, ఆర్థిక వ్యవస్థకూడా మనస్సులో పెట్టుకుని దేశాన్ని మనం నడపించాలి. విదేశ రాజులు ఈ దేశాన్ని పరిపాలించినప్పుడు వారి దేశంలో ఉండే standards మనదేశంలో ప్రవేశపెట్టారు. పేదవారికి భాగ్యవంతులకు మధ్య ఉండే అంతరువు చాలా హెచ్చుగా ఉన్నది. ఈ దేశంలో, ఉద్యోగంలో ప్రవేశించినవాడు రివెన్యూ బోర్డు మెంబరు అయితే రు. 3750 లు జీతం పుచ్చుకొనే పరిస్థితికూడా ఏర్పడి ఉన్నది. మనదేశం స్వరాజ్యం సంపాదించుకున్న తరువాత ఈ ఔన్నత్యం చాలా తగ్గించారు. I.A.S. వాళ్లు రు. 1800 లు పైగా వెళ్లడానికి వీలులేదు. వీటన్నింటికి కొన్ని adjustments చేసుకోవలసి వచ్చింది. మనకు ఉన్న ఆర్థిక వ్యవస్థ ప్రకారం నిర్ణయించబడిన విధానాల క్రమాన్ని ఈ రోజున మార్చేటటువంటి పరిస్థితి ఉంటే మార్చడానికి వ్యక్తిగతంగా గాని ప్రభుత్వం తరఫునగాని ఏ విధమైన అభ్యంతరాలు లేవు. కాని మన వ్యవస్థలో ఆ విధమైన పరిస్థితులు లేవని చెప్పడానికి విచారిస్తున్నాను. తల్లి బిడ్డలకు పాలిచ్చి పెంచుకోవాలి. కాని తల్లికి తగినటువంటి శరీర సౌష్టవం కావాలంటే కడుపునిండా భోజనం ఉండాలి. అప్పుడే శరీరం బాగుంటుంది. పిల్ల ఎదగడానికి బాగుంటుంది. తల్లికే భోజనం తక్కువై శరీర సౌష్టవం బాగాలేనప్పుడు బిడ్డకు పాలు ఇవ్వనందుకు కోప్పడితే లాభంలేదు. అవసరమే. బిడ్డకు పాలు ఇవ్వవలసిందే. పూర్తిగా కడుపునిండి పరిపూర్ణ ఆరోగ్యంలో ఉండే పరిస్థితి తల్లికే లేకపోతే మనంకూడా దానిని గురించి తీవ్రమైన విమర్శలకు దిగడం న్యాయంకాదు. N.G.O. ల అవసరాలు సరి అయినవి. వారికి సహాయం చేయవలసిన ధర్మం ప్రభుత్వంపైన, సంఘంపైనకూడా ఉన్నది. ఈవేళ ప్రభుత్వము ఉన్న పరిస్థితులలో ఈ వ్యవహారాన్ని సాంగంచేసేస్థితి లేదని మనవిచేస్తున్నాను. ఢిల్లీలో appoint చేసిన Pay Commission వారి స్కేలు ఇస్తే చాలునని తీర్మానం భావం. [illegible] ఉండే పరిస్థితులలో పేదరైతును పెట్టడం న్యాయంకాదు వారి దగ్గర సామర్థ్యం ఉన్నది. వారి ఆదాయం కోటాను కోట్ల రూపాయలు. సామర్థ్యం ఉన్నంతవరకు

Sri K. Venkata Rao] [29th September 1955

ఇస్తున్నారు. అక్కడ 3 వ క్లాసు 4 వ క్లాసు clerks ఉన్నారు. ఢిల్లీలో ఉండే 3rd class clerks గడ్డాలపెంచి గవర్నమెంటుమీద సత్యాగ్రహం చేస్తారని పత్రికలలో చదివాము. వారు అక్కడ తృప్తిగా లేకుండా ఉన్నారు. Village officers సంగతి చూస్తే రు. 8 ల జీతంతోనే కుటుంబాలను పోషించగలడా? తనకైనా భోజనానికి సరిపోతుందా? వచ్చే ప్రతి ఆఫీసరు, ప్రతి పెద్ద మనిషి వాళ్ల ఇంటికి వెళ్లవలసిందే. అంతా రైతుల దగ్గర సంపాదించి పెడుతున్నారని అనవచ్చును. రైతు దగ్గర పావులా, బేడ పుచ్చుకునే వాళ్లు లేరని నేను అనను. గ్రామంలో వారికి మర్యాద ఏర్పడింది. నాగిరెడ్డిగారు గ్రామ మునసబు, ఇదివరకే అనుకోండి. ఆయనకు ఒక status గ్రామంలో ఉన్నది. తాత ముత్తాతలనుంచి వస్తోంది. సరిఅయిన పరిస్థితులలో ఉంటే చూస్తారు. లేకపోతే ఎవరి సహాయమో తీసికొని చూస్తారు. వాళ్లకు ప్రధానమైన స్థానం ఇవ్వాలా, అక్కరలేదా? N.G.O. ల పిల్లలకు చదువులు చెప్పిస్తున్నాము. వైద్యానికి ఏదో కొంత సహాయం చేస్తున్నాము. దీనినంతను జీతంలో భాగంగా చూసుకోవాలి. రాష్ట్రంలో ఉండే సామర్థ్యం వినియోగం చేస్తున్నామా, లేదా అని చూడాలి. మీ అందరి సహాయంచేత ఆంధ్ర రాష్ట్రం అభివృద్ధి చెంది ఆదాయం హెచ్చి క్రొత్త వనరలవల్ల investments ప్రణాళికలవల్ల లాభం వస్తే ఎక్కువ ఆదాయం ప్రభుత్వానికి చేకూరే పరిస్థితులలో వారి కష్టస్థితిని కొంతవరకు తగ్గించే యత్నం చేయడానికి తప్పకుండా కృషిచేయవలసిందే. వీరి విషయం గురించి నా హృదయం చాలా బాధపడుతోంది. ఒకరు వారికి ఏదో ఇవ్వాలని చెప్పడం, నేను వద్దని చెప్పడం రాజకీయాల చదరంగపుయెత్తుగాని ఇవ్వాలని చెప్పేవారికి కరుణ ప్రవహిస్తోందని, వద్దన్నవారికి కరుణలేదని చెప్పకూడదు. నాకు వారికంటే ఎక్కువగా ఉన్నది. నేను opposition member అయినట్లయితే ఇటువంటి తీర్మానం పెట్టేవాణ్ణి ఏమో. ఇది opposition చేయవలసిన ధర్మ నిర్వహణ కావచ్చును. కాని వారికి సహాయం చేయాలనే విషయంలో ఏ విధమైన భేదాభిప్రాయాలు లేవు అని మనవిచేస్తున్నాను.

ఆఖరి విషయము నేను మనవిచేస్తున్నాను. ప్రజలకో appeal చేస్తున్నాను. నువ్వు కూడా [illegible] Project వ్యవహారం బాగా చేస్తాము. నీవు అర్థం చెయ్యి, భారత సేవక సమాజంలో చేరు, లేకపోతే తట్టమొయ్యి, రోడ్లు వేస్తాము, వంతెనలు కడతాము, స్కూలు బిల్డింగ్సు కడతాం అని చెబుతున్నాం. ఆదేవిధముగా ఈ పరిస్థితిలో ఉన్న ఆంధ్రరాష్ట్రములో మన Service లో ఉన్న ఉద్యోగస్థులు అంత

తమ విధి కృతధర్మమని దేశాభ్యుదయానికి వారుకూడా మనస్ఫూర్తిగా శరీర పాట వంతో పాటుబడితే మనము administer చేస్తే మన చివరలోజులలోనైనా వారి కుమారులకు మంచిరోజులు వస్తాయని నేను చెప్పదలచుకొన్నాను. మన రాష్ట్ర బడ్జెటులోటు 5.25 కోట్ల రూపాయలు అనుకొన్నాము. మళ్లీ బడ్జెటులో చూస్తే 3½ కోట్లుదాకా ఉన్నదన్న దృష్టిలో పెట్టుకొంటే మనకు ఉన్నదానికంటె ఎక్కువ తింటున్నామని తెలుస్తుంది. రాష్ట్ర మొత్తముమీద ఇప్పుడు ఈ Central Pay Commission శిఫార్సులను అమలులోనికి తీసుకొనివస్తే ఒక్క జీతంకోసము 200/- లక్షల రూపాయల పై బిల్లుకు ఇవ్వవలసిఉంటుంది. ఇటువంటి ఆర్థికవ్యవస్థలో మనము ఉన్నాము. ఇష్టములేక కాదు. అవసరములేక కాదు. ఆర్థికసామర్థ్యము లేక ఇవ్వలేకున్నాము. మనము ముందుకుపోయే పరిస్థితులలో లేము. అందువల్ల N.G.O ల కష్టాల గురించిచెప్పిన స్నేహితులు తమ దృష్టిలో పెట్టుకొని ఈ తీర్మానాన్ని ఉపసంహరించవలెనని నేను కోరుచున్నాను.

SRI S. VEMAYYA :— అధ్యక్షా, మంత్రిగారితో సహా ఈచర్చలో 13 గురు సభ్యులు మాట్లాడేరు. ప్రభుత్వంవైపునుండి ఇరుపక్షులనుండి ఎక్కువ మంది మాట్లాడారు. తీర్మానము సరిఅయినదికాదు అనిగాని వారి ఇబ్బందులు తీర్చ డానికి తగినట్టివి కావని గాని అనలేరు. తీర్మానము సబబుగా ఉన్నదని ఒప్పుకున్నారు. లక్ష్మణదాసుగారు మాట్లాడుతూ ఇది ప్రచారముకోసము తీసుకునివచ్చారు అన్నారు. కూలీలు, పేదప్రజలు బాధలుపడుతూఉన్నప్పుడు N. G. O ల ప్రాధాన్యతగా ఏమిటిఅన్నారు. కూలీల విషయముల్లో ప్రగడకోటయ్యగారు ఇది సహాయముకాదని చెప్పేరు. ఇది ప్రచారముకోసము తీసుకొని వచ్చారనడం సబబుకాదు. ఇది సమ యముకాదంటే నేను ఒప్పుకుంటాను. ఇది కూడా యదార్థముకాదు. లెక్కలు ఏ విధముగా వెయ్యవలెనో నేను చెబుతాను.

SRI L. LAXMANA DAS :— నేను చెప్పినదానికి కారణము ఇప్పుడు మన రాష్ట్రములోఉన్న ఆర్థికపరిస్థితి దృష్టిలో పెట్టుకోవలెనని వేమయ్యగారు బడ్జెటు వ్యవహారము తెలుసుకుంటే ప్రస్తుతపరిస్థితిలో ఇటువంటి తీర్మానము తీసుకు రావడములో అర్థములేదు. పరిస్థితులు చూస్తూ కేవలము ప్రచారముకోసము తీర్మానము తీసుకునివచ్చారేగాని ప్రాక్టికల్‌గా ఉంటుందని తీసుకురాలేదు. అది మంచిదికాదని నేను చెబుతున్నాను.

SRI S. VEMAYYA :—నేను ప్రతిఘటిస్తున్నానని బ్రహ్మయ్యగారు చెప్పేరు. ఇది ఎలక్షను ప్రచారముకోసము N. G. O ల సానుభూతికోసము తీసుకు రాబడిన తీర్మానమనిఅంటూ, మొన్న ఎలెక్షనులలో కమ్యూనిస్టులు నిరూపించేరు అన్నారు. అది సబబుకాదు.

(At this Stage Mr. DEPUTY SPEAKER occupied the Chair.)

రాజకీయాలను అనుసరించి N. G. O లు పనిచేసినారన్నది చెప్పవలసిన మాట కాదు. అది నిజమేఅయితే N. G. O లు రాజకీయపక్షాలకోసము పనిచేశార మాట. అలాచెప్పడం న్యాయంకాదు. గ్రామాధికారుల విషయము ఉన్నది. వారికి పని ఎక్కువగా ఉన్నదని అందరూకూడా ఒప్పుకున్నారు. కేంద్రం మనకు డబ్బుఇస్తుందని ప్రగడకోటయ్యగారన్నారు. వడ్రంగి, చేనేత కూలీల విషయము చర్చించమన్నారు. ఏమిచేసినారన్నారు. మేము ప్రభుత్వపక్షములో లేము కాబట్టి మేము ఏమితీసుకునివచ్చినా వారు త్రోసివేయవచ్చును. అటువంటుది ఏమైనా మీరు చేస్తే Pass చేసుకోవచ్చు. మరి మంచిదే. రేపు తీర్మానములువస్తే వోటు చేస్తారని నమ్ముచున్నాను. నంబూరి శ్రీనివాసరావు చెప్పేది ఇది తీర్మానముకాదు, అంకెలతో చరిత్ర వ్రాయవలెను, అని అన్నారు. దానికి అధ్యక్షులవారు ఒప్పు కొనరని భావించుచున్నాను. Subject కు సంబంధించని విషయాలు చెప్పేరు గాని దానిని గురించి చెప్పవవసరములేదు.

వ్యత్యాసాలు చాలా ఉన్నాయని అవి పోవాలనిచెప్పేరు. అవి నిజమే. శ్రీ అప్పారావుగారు సెంట్రలు గవర్నమెంటు ఉద్యోగస్థుల జీతాలకు ఇక్కడ ఇస్తున్న జీతాలకు తేడా ఉందన్నారు. అది మనము ఆపించాలి అంటున్నాము. ఒక కాం పౌండులోనే ఒకరికి ఒక జీతము, ఇంకొకరికి ఇంకొక జీతము, ఇది మన రాజ్యాంగానికి విరుద్ధము. దానిని మనము అరికట్టడానికి ముందుకు రావలెనని మనవిచేస్తున్నాను. రాఘవులుగారు పున్నయ్యగారు హృదయావేదన పడ్డారు. జీతంచాలదు అన్నారు. గాని ఇది ప్రచారముకోసము తీసుకువచ్చిన తీర్మానం కాదన్నారు సబబుగాఉన్న దన్నారు. తిమ్మారెడ్డిగారు వేదాంతరీత్యా కొన్ని విషయాలు చెప్పేరు. ఆఖరు ఆయన కళావెంకటరావుగారు, ఇది ప్రచారంకోసంకాదు. నిజంగా N. G. Oలు ఇబ్బందులుపడుతున్నారు. వారి కష్టాలనుచూస్తాము, కాని ఇది సమయముకాదు

అన్నారు. తల్లికే అన్నము లేనపుడు బిడ్డకు పెట్టే పరిస్థితులు ఎక్కడవస్తాయని స్పష్టముగా చెప్పేరు. అయితే వారి దృష్టికి కొన్ని విషయాలు తీసుకువస్తాను. తీర్మానము తీసుకువచ్చారుగాని, ఎంత ఆదాయం వస్తుందో, ఏ విధముగా లోటు పూడ్చుకోవచ్చునో చెప్పలేదని కొందరు సభ్యులన్నారు. మనరాష్ట్రము భరించే పరిస్థితులలో లేదన్నారు. దానికి నేను కొన్ని విషయాలు మంత్రివర్గం దృష్టికితెస్తున్నాను. రాష్ట్ర లోటుబడ్జటు భర్తీచేసుకొని ఈ తీర్మానము అమలుపెట్టడానికి నేను కొన్ని సూచనలు చేస్తున్నాను. నేనుపెట్టిన తీర్మానములో N. G. O లందరికీ కేంద్ర ప్రభుత్వస్కేల్సు ఇవ్వాలనిఉంది. తాహసీల్దారుకు Gazetted officer లకన్న ఎక్కువ జీతాలుఉన్నాయిఅన్నారు. అటువంటువారిని మినహాయించి ఇప్పుడు ప్రారంభించుదాము. మీరుకూడా N. G. O లకు కష్టాలు ఉన్నాయని ఒప్పుకున్నారు. కాబట్టి implement చేద్దాము. పురోగమిద్దాం. మొదట Inferior servants తో ప్రారంభముచేద్దాము. చిన్న ఉద్యోగస్థులు Lower Division Clerks తో మొదలుపెట్టి తాహతువచ్చేక పూర్తిచెయ్యవచ్చును. క్రమేపి ఈ తీర్మానమును అమలులోనికి తీసుకొనివద్దాము.Implement చెయ్యడం మీ బాధ్యత అని చెబుతూ కొన్ని సూచనలు ఇవ్వదలచుకున్నాను.

ఇప్పుడున్నటువంటి ఉద్యోగస్థుల విషయం తీసుకున్నప్పుడు Gazetted Officer లలో 17 మంది I.C.S., 27 గురు I.A.S., ఇతర All India Services వారు 28, ఇంకా ఇతర Gazetted Officer లు 1800 మొత్తం 1862 మంది ఉంటారు. ఈ అంకెలు నేను Budget ను చదివి సేకరించి తెచ్చాను. ప్రభుత్వం వారికి machinery ఉన్నది. కాబట్టి వారివద్ద సరియైన లెక్కలుంటే ఉండవచ్చును. నేను సేకరించిన లెక్కలు, ప్రభుత్వం దగ్గరనున్న లెక్కలు కొంచం ఇంచుమించులో సరిపోతాయని భావిస్తున్నాను. వారి క్రింద ఖర్చు 89 లక్షలు Budget లో చూపించారు. ఇక Non-gazetted ఉద్యోగస్థులు 50 వేలమంది ఉన్నారు. ప్రభుత్వం Budget లో ఇచ్చిన లెక్కల ప్రకారం ఈ Non-gazetted officers క్రింద మొత్తం ఖర్చవుతోన్నది 4 కోట్ల వరకూ ఉంది. కాని ఇప్పుడు తీసుకువచ్చిన తీర్మానాన్ని అమలు జరపడానికి డబ్బు ఏవిధంగా వస్తుందన్నప్పుడు, ప్రభుత్వం ముందు నేనొక చిన్న proposal పెట్టదలచుకున్నాను. ఇప్పుడు అమలులో యున్న Pay scales లో Upper Division గుమాస్తాలకు 80 నుంచి 110 వరకూ ఉంది. నేను 90 నుంచి 150 వరకూ పెట్టమని కోరుతున్నాను. Lower Division గుమాస్తాలకు ఇప్పుడు 45 నుంచి 90 వరకూ ఉంది. నేను

50 ల గాయకు 110 వఱకూ పెడితే చాలని భావిస్తున్నాను. బంట్రోతులు వగైరాలకు ప్రస్తుతం 18 రూపాయిలు మొదలు 25 రూపాయిల వఱకు ఉంది. నేను 25 రూపాయిల లగాయతు 40 రూపాయిలవఱకు పెడితే బాగుంటుందని అనుకుంటున్నాను. ఇప్పుడు Junior Superintendents కు 140 మొదలు 190 వఱకూ ఉంది. నేను సూచించేది 150 మొదలు 220 రూపాయిల వఱకు ఇవ్వాలని సూచించాను. ఈ సూచనల ప్రకారం ఎంత డబ్బు అదనంగా కావలసి వస్తుందంటే 75 లక్షల రూపాయలకన్న ఎక్కువకాదు. ఈ 75 లక్షలు రావడానికి తరువాత సూచనలు ఇస్తాను. ఇక గ్రామాధికార్ల విషయం తీసుకున్నప్పుడు రైతు వారీ గ్రామాలలో 29933 మంది, ప్రొప్రైటరీ Estate లలో 16525 మంది, Agency area లో 257—200, Village Police 61, మొత్తం 46921 మంది ఉన్నారు. వాళ్ళకి ఖర్చు 96.86 లక్షలవుతోంది. ఈ Budget ప్రకారం correct గా తీసుకుంటే 96.84 లక్షలు ఖర్చు చూపెట్టబడింది. మన సభ్యులంతా కూడా ఈ గ్రామోద్యోగస్థుల తాహతుకూడా పెంచాలని చెబుతున్నారు. వాళ్ళ వంశ పారం పర్యపు హక్కు తీసేసి సక్రమమైన ఒక Lower Division Clerk జీతం పెట్టి వారికున్నటువంటి ఇబ్బందులు తొలగించి, వారి ఆర్థిక పరిస్థితి బాగుపఱచ డానికి ప్రభుత్వం పూనుకోవాలని నేను సూచిస్తున్నాను. వారి జీతాలుకూడా పెంచినప్పుడు మనకింకా ఎక్కువ డబ్బు కావలసి వస్తుంది. దానికి కూడా మార్గాలు ప్రభుత్వానికి చూపిస్తాను. ఈ N.G.O. లకు, గ్రామాధికార్లకు జీతాలు పెంచ డంవల్ల మనకు కావలసిన అదనపు ఆదాయం సేకరించడానికి కొన్ని విధానాలను ప్రభుత్వానికి సూచిస్తున్నాను ఇప్పుడు మన రాష్ట్రంలో ఈ forest లు వగైరాలలో grazing క్రింద కొంత డబ్బు వస్తోంది. ఆ item క్రింద correct figures ఈ Budget లో వేరుగా చూపెట్టలేదు. దీని క్రింద 40 లక్షల రూపాయలు వస్తున్నట్లు నేననుకుంటున్నాను. ఈ forest లలో grazing rights సక్రమంగా వేలం వేయడంగాని, లేక grazing permits ఇవ్వడంవల్లగాని మరొక 40 లక్షల రూపాయిలకంటెకూడా అదనంగా రావడానికి అవకాశం ఉంది. ఇది ఏవిధంగా వస్తుందని మీరు ప్రశ్నించవచ్చును. ఇప్పుడు ఒక గ్రామంలో 300 పశువులుంటే, వంద పశువులకు మాత్రమే permit లు ఇవ్వడం జరుగుతోంది. కాని ఆ వంద పశువులు మాత్రమే ఆ అడవిలో మేస్తున్నాయా? మిగతా పశువులు కూడా ఆ అడవిలోనే మేస్తున్నాయి. కాని ఈ forest ఉద్యోగస్థులకూ రైతు లకూ ఉన్న లాలూచీ ప్రకారం వాళ్ళేదో లంచాలిచ్చి ఈ పశువులను మేస్తు

కోవడం జరుగుతోంది. మొత్తం పశువులన్నీ ప్రభుత్వంయొక్క కంచెలలో మేస్తూ ఉంటే ప్రభుత్వానికి వచ్చే ఆదాయం చాలా తక్కువగా ఉంది. ఈ పశువులన్నిటికి grazing permits తప్పకుండా insist చేస్తే ఎక్కువ డబ్బు రావడానికి వీలవుతుంది. ఈ grazing permits issue చేయడంవల్ల, ఇంకా ఇతర forest produce sale వల్ల ఎక్కువ డబ్బు ప్రభుత్వానికి వస్తుంది అందువల్ల ఈ విషయం ప్రభుత్వం ఆలోచించాలని మనవిచేస్తున్నాను. ఈ రాష్ట్రంలో మొత్తం 11 కోట్ల పశువులున్నాయి. అందులో 5 కోట్లయినా లేకపోతే 2 కోట్ల పశువులైనా మేస్తున్నాయనుకుంటే, దానిమీద ప్రభుత్వం సరియైన revenue వసూలుచేసి, ఇంకా forest produce అమ్మకంవల్ల revenue తెచ్చుకోగలిగితే ఇంకొక నూరు లక్షలవరకూ ఆదాయం అధికమవుతుందని నేను భావిస్తున్నాను. ఇంక stamps—judicial stamps—విషయం ఆలోచించుదాం. వందలాది అర్జీలు ప్రతి గ్రామంనుంచీ ప్రభుత్వానికి వస్తున్నాయి. వాళ్లు registered post లో అర్జీ పంపి acknowledgment తీసుకున్నా వాళ్లకి జవాబురాదు. ఆ office లలో మాకు అర్జీయే రాలేదంటారు. Acknowledgment చూపించినా దిక్కులేదు. వాళ్లు ఈ అర్జీలన్నీ registered post లో పంపడంవల్ల కేంద్ర ప్రభుత్వానికి మనం లాభం చేస్తున్నాం. కాబట్టి ఈ అర్జీలు registered post లో పంపే పద్ధతి కాకుండా నాలుగణాలో, అర్థ రూపాయో Non-Judicial stamp ఒక్కొక్క అర్జీమీద fix చేసి పంపించాలనీ, అర్జీవచ్చిన వెంటనే దాన్ని register చేసి "ఇదిగో మీ అర్జీ వచ్చింది విచారణలో ఉంది. అని వెనువెంటనే ఆ పార్టీకి తెలియజేసినట్లయితే చాలా సక్రమంగా ఉంటుంది. Petition రాలేదంటే, దానిమీద Non-Judicial stamp వేయడంవల్ల, నిజంగా వేశారా లేదా అని ఆ stamp vendors అంతా ప్రభుత్వ control లో ఉంటారు. కాబట్టి, అది verify చేయడానికి వీలవుతుంది. ఈ విధానానికి ప్రభుత్వం పూనుకుంటే ఈ పద్దు క్రింద ప్రభుత్వానికి ఒక కోటి 16 లక్షల రూపాయిలు అదనంగా వస్తుంది.

Sri B. APPA RAO :—On a point of order, ఉపాధ్యక్షా, ఇప్పుడు శాసన సభలో ఈ చర్చ జరుగుతున్నప్పుడు శాసనసభ్యులు సభలో కూర్చుని పత్రికలు చదువుకోవచ్చునా?

Mr. DEPUTY SPEAKER :—పత్రికలు చదువుకోకూడదని ఉంది

కాని, తమకు కావలసిన విషయాలు చదువుకొని ముందు మాట్లాడడానికి అవసర మైనవి చదువుకునే అవకాశం ఉంది.

Sri S. VEMAYYA :—నేను సూచించిన విధానం ప్రకారంగా, మనకు 16 వేల గ్రామాలున్నప్పుడు, ఒక్కొక్క గ్రామంనుంచి 50 petition లు వస్తున్నాయని అంచానా వేసుకున్నా కొన్ని లక్షల రూపాయిలు వస్తాయి. ఇక గ్రామాధికార్లు మనరాష్ట్రంలో 46921 మంది ఉన్నప్పుడు వాళ్లకు జీతం 23,18 రూపాయి లిస్తున్నాం వాళ్లకి ఇచ్చే వేతనం వాళ్ళ జీవన భృతికి సరిపోతోందా? చాలదు. అందువల్ల వాళ్లు రైతులను పీడించో, government డబ్బు mis-appropriate చేసో, ఇటువంటి చెడ్డ మార్గాలకు పాల్పడుతున్నారు. గ్రామాధికారి ఏ మజ్జిగ నీళ్లకోసమో, జమాబందీ మామూళ్ళకోసమో రైతులకు లొంగి పోయి—concealment of cultivation—అంటే సాగుబడి దాచిపెడు తున్నాడ. అతనిమీద వచ్చి పడేటటువంటి ఒత్తిడి భరించలేక ఈ పాడుపనులు చేస్తున్నాడు. వాళ్లకి సరియైన జీవనభృతి కలగజేస్తే ప్రభుత్వానికి అదనపు ఆదాయం చూపించడానికి ముందుకువస్తారు. కనీసము ఇంకో 50 లక్షల రూపాయిలైనా అదనంగా వస్తాయి. కేంద్ర ప్రభుత్వం ఇస్తుందా అని కోటయ్యగారు ప్రశ్నించారు. వారు మన రాష్ట్రంనుంచి పొగాకుమీద ఎంత excise పన్ను వసూలు చేస్తున్నారో అలాగే Mica మీదకూడా వసూలు చేస్తున్నారు.

మన రాష్ట్రంనుంచి ఈ Tobacco మీద నేమి, మైకామీద నేమి Royalty వస్తుందని మంత్రిగారుచెప్పారు. అయితే మనకురాదు. నేను ఒక ప్రశ్న మంత్రి గారిని అడుగుతూఉన్నాను. ఒక Mines మీద నే ఆరులక్షలు వచ్చిందన్నారుగాని అక్కడ ఉన్నటువంటి సిబ్బంది ఎవరిక్రింద ఉన్నారు? సిబ్బందిఅంతా మన ప్రభుత్వం క్రిందఉన్నారు. చేసేపని కేంద్రప్రభుత్వంపని. కేంద్రంపనిచేసి, ఆదాయాలలో నుంచి సరిగా వాటాతెచ్చుకోకుండా కేంద్రప్రభుత్వోద్యోగులను అంతా భరించవలెనని చెప్పి తప్పకుండా కేంద్రప్రభుత్వనుంచి ఈ Royalty ని హెచ్చుగా తీసుకొని రావలసినదని మనవిచేస్తూ కేంద్రప్రభుత్వం పనిచేసేవారిలో మొత్తం ఈ Mines విషయంలో మైకా Inspectors లకు మనమేజీతం ఇస్తున్నాం. Head Clerk కు ఇస్తున్నారు. దీనినిఅంతా మనం భరించకుండా కేంద్రప్రభుత్వంమీద నే ఒత్తిడి తీసుకొనివచ్చి వాంట్లే భరించేటట్లు చేయవలెనని మనవిచేస్తున్నాను. Royalty అంతా మనకు వసూలుఅవుతుంది. ఏవాటాలో ఇస్తున్నది? ఎందుకు ఎక్కువ

తీసుకొనుటకు ప్రయత్నం చేయకూడదు? ఈ Royalty వసూలుచేసే విషయంలో Mines వద్ద వసూలుచేస్తున్నారు. ఈ mines వద్ద వసూలు చేసినందున, అటు ఇటు పోకుండా జాగ్రత్తగ చూస్తున్నాము. మా నెల్లూరుజిల్లా, Mica mines తీసుకోండి. Mines వద్ద తప్పు కొట్టుకొని తీసుకొనిపోయి Companyలలో లెక్క లేకుండా చేస్తున్నారు. ప్రభుత్వానికి చూపేది ఒక లెక్క-వారు Maintain చేసేది మరొక లెక్క. ఇవి అన్నీ కూడ అందరకు తెలిసిన రహస్యం కాబట్టి, కంపెనీలవద్ద వసూలు చేసేవిధానం అవలంభిస్తే అనేకమంది అనుభవంగలవాండ్లు Company వద్ద తప్పకుండా దొరుకుతారు. ఎక్కువడబ్బు ప్రభుత్వానికి రావడానికి వీలుంది అంటున్నాను. దీనిని ప్రభుత్వదృష్టిలోకి తీసుకొనివస్తే డబ్బు ప్రభుత్వానికి రావడం కొంత అదనపుఖర్చులు తప్పిపోవడంకూడా జరుగుతుంది అని నేను మనవి చేస్తున్నాను. అంతేకాకుండా పోలీసుశాఖ తీసుకోండాము. రైల్వేపోలీసుఅంటూ తిరుగుతూఉంటారు. Railway లో జరిగే Crime branch పోలీసులులంతా కూడా, కేంద్రప్రభుత్వం భరించుకోవలసిన జీతములు మనము ఎందుకు భరించు కొంటున్నామో నాకు అర్థము అగుటలేదు. మన ప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి రైల్వేపోలీసుఖర్చుఅంతాకూడా మీరు భరించవలెనని చెప్పినట్లయితే ఇపుడు బడ్జటులో కనబడుతున్న 8 లక్షలనుండికూడ మనము 4 లక్షలు save చేసుకో డానికి వీలుఉంటుంది. కేంద్రప్రభుత్వాన్ని ఆ లక్షలు భరించమని మన ప్రభుత్వం ఎందుకు ఒత్తిడి తీసుకొనిరాకూడదో నాకు అర్థంఅగుటలేదు. అల్లే బడ్జటు Memorandum 30 page లో చేసేపనిఅంతా కేంద్రప్రభుత్వంపనే. రైల్వే ఆదాయ మంతా వాండ్లకేపోతుంది. మనకు ఏమిరాదు. కాబట్టి కనీసం ఈ ఉద్యోగస్థులను మనం lend చేశాము గనుక వాండ్లేభరించేదానికి ప్రభుత్వం చూడాలని నేను మనవి చేస్తున్నాను. రాజ్యాంగచట్టంలో 270 Article చూస్తే Scheduled Castes and Tribes అనే subject బాగా చెప్పారు. ఇది ఎక్కువగ కేంద్రప్రభుత్వ subject గాఉంది గనుక, కేంద్రప్రభుత్వం ఎక్కువగ డబ్బుఖర్చు పెట్టవలసిన బాధ్యతకూడ వాండ్లది. కేంద్రప్రభుత్వం మనకు ఎంతఇస్తున్నది. అని లెక్కలు తీసు కొన్నపుడు, 15 లక్షలు ఇస్తున్నట్లు లెక్క తేలుతున్నది. అన్ని Heads క్రింద తీసు కొన్నపుడు మనకు ఒకకోటి రూపాయలు ఖర్చుఅయినపుడు కేంద్రప్రభుత్వమంచి ఈ ప్రభుత్వం, ఈ రాజ్యాంగచట్టంలో వాండ్లుపెట్టిన విధానం ప్రకారం వాండ్లు భరిస్తామని అందులో వాండ్లు 50% భరించేందుకు ఎందుకు ఒత్తిడి తీసుకొని రాకూడదు ? ఇందులో మనకు 50 లక్షలు savings వస్తుంది. ఈ 50 లక్షలు

ఒత్తిడిచేసి కేంద్రప్రభుత్వంనుంచి తీసుకొనివస్తే మనకు అక్కడకూడా డబ్బు మిగలడానికి ఆస్కారం ఉందని నేను మనవి చేస్తున్నాను. ఈ బడ్జెటు మెమొరాండంలో బస్సులమీద 9 పైసలు, లారీలమీద 6 పైసలు మనము వసూలు చేస్తున్నట్లు తేలితే 1.33 లక్షలు ప్రభుత్వానికి నేడు వస్తున్న ఆదాయం కాని బస్సులకంటే ఈ లారీలవల్ల ఎక్కువలాభం తీసుకొన్నట్లు, బస్సులవల్ల కొంత తక్కువలాభం వస్తున్నట్లు ఇతరులు అనుకొంటూఉన్నారు. నాకు తెలియదు. లారీలకు బస్సులకు తేడాలేకుండా, ఈ లారీలకే, ఇంకా ఒకపైసా ఎక్కువగ పెట్టితే, ప్రభుత్వానికి ఎక్కువడబ్బు రావడానికి ఆస్కారంఉంది. దీనికి 25 లక్షల రూపాయలు, ఈ రోజున ప్రభుత్వం ఇప్పుడు కట్టుకొంటూఉన్నది. Bus లతోటి లారీలకు ఇంకా ఒకపైసా హెచ్చుచేసి ఇంకా ఒక 25 లక్షలరూపాయలు ఆదాయం ఎక్కువ తీసుకొనుటకు వీలుఅవుతుంది. అదేరీతిగా, గాంధిమహాత్ముడు మనకు ప్రస్తుతంలేడు. ఆయనఉన్నపుడు. నాకు బాగా జ్ఞప్తివుంది. 1937 వ సంవత్సరంలో ఆ ప్రాంతంలో మనవారు మంత్రులుగావచ్చినపుడు, మన ప్రభుత్వం వచ్చినపుడు, ఎవరికికూడ 5 వందలకంటే ఎక్కువజీతం ఉండకూడదని పదేపదే చెప్పడం జరిగింది. కాని ఈ రోజున అవలంభించే విధానం ఏమి ? 5 వందలకంటె హెచ్చు తీసుకోకూడదని తీర్మానంతెస్తే మళ్ల గవర్మెంటుకుపంపించి మళ్ళ 1000 రూపాయలవరకు హెచ్చుచేసుకొన్నారు. ఆ విధంగా ఎందుకు అవలంభించకూడదు? ఇక్కడ మంత్రులు ఆలా ఆదర్శప్రాయంగా తగ్గించుకుంటే ఇతర M. L. A లు అందరుకూడ త్యాగం చేయాలని ఒక సభ్యుడుచెప్పాడు. త్యాగంచేస్తాం.' ఈరోజు ప్రతిమనిషి, ప్రతిసభ్యునికి ఎంత ఆస్తిఉంది, జీవితానికి ఎంత సరిపోతుంది, మిగిలినది ఎంతఉంది? ఈ విధంగా జీవితానికి సరిపోయేవాడ్లంతా మానివేదాము. జీతాలులేకుండా Honorary గ పనిచేద్దాం. ఆ విధానాన్ని అందరు పూనుకొందాము. వెంటనే ఒకకమిటీవేసి, జీతము లేనికమిటీ, రిపోర్టును అందజేసి, ఎవరెవరు జీతాలులేకుండా ఉండవచ్చునో సూచనలుచేసి, మంత్రులుగాని, M. L. A లుగాని ఎవరుకూడ ఆదర్శంగా జీతాలు మినహాయించుకుంటే నేనువేసిన లెక్కప్రకారం రెండు లక్షలరూపాయలు Savings వస్తుంది. అదీకాకుండా sales tax విషయంలోకూడ ఎంతో మంది పదేపదే చెప్పారు. Leakage పోతుందనిచెప్పి దగ్గర దగ్గర 2 కోట్లవరకు పోతుందనిచెప్పి దానిని పటిష్టముగ తీసుకొని రావడానికి ప్రయత్నం జరగాలనిచెప్పి అది జరిగినట్లయితే మనకు ఎక్కువగ డబ్బురావడానికి వీలుందనిచెప్పి నేను మనవిచేస్తున్నాను. అంతేకాకుండా ఈ ఉద్యోగస్థుల విషయం తీసుకొన్నపుడు, Health Inspector

Sri S. Vemayya] [29th September 1955

Co-operative Inspector ఇంకా వగైరాలు కొంతమంది చిన్న చిన్న ఉద్యోగస్థులు ఉన్నారు. వాండ్లజీతాలు చాలా స్వల్పం. వాండ్ల విషయంలో ఎటువంటి విధానాన్ని అవలంభిస్తున్నదంటే వాండ్లను State wide transfers చేసి, ఈ రోజున కర్నూలు, ఇంకోరోజున విశాఖపట్టణం, అనంతపురం, ఇలాచేసినందువల్ల వాండ్లను అనేకవిధముల ఇబ్బందిపెట్టి వాండ్ల కర్తవ్యాన్ని నెరవేర్చకుండా పోవడమేతప్ప దానిని అవలంభించడం సబబుకాదని ఆ జిల్లావాండ్లను అత్యావసరమైన సమయంలోతప్ప transfers చేయకూడదని Planning మంత్రిగారిని కోరుతున్నాను. చిన్న చిన్న ఉద్యోగులను State wide transfers చేయకూడదు. అలా చేయడం బాగాలేదు. దానివల్ల కొన్నిలక్షల రూపాయలుకూడ మిగులుతుంది, అని మనవిచేస్తున్నాను. తరువాత Printing press ఉన్నది. Printing అంతా మన ప్రభుత్వమే చేసే స్థితిలోలేదు. అనేకము ప్రవేటుగ Printing చేసుకోవడం జరుగుతున్నది. అనేకము మద్రాసులో ప్రింటు అయినట్లు మనకు దాఖలాలు వస్తున్నాయి. ప్రభుత్వం పూనుకొని బాధ్యతవహిస్తే ఈ రోజున 6.4 లక్షలు వస్తుంటే మరొక మూడు లక్షలరూపాయలు ఈ ప్రింటింగువాండ్లకు ఇవ్వకుండ, ప్రభుత్వమే నిర్వహించినట్లయితే మూడులక్షలు సేవింగ్సు రావడానికి వీలుఉంది. ఈ Printing విషయంలోకూడ కుప్పుస్వామి కమిటీవారి సూచనలు ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నాము. ఈ Books అన్నికూడ ప్రైవేటువాండ్లకు ఇస్తున్నారు. ప్రభుత్వమే దానిని print చేస్తే ఎక్కువ Savings వస్తుంది. చిన్న చిన్న ఉద్యోగుల జీతాన్ని పెంచుటకు ఇది ఒక ఆస్కారంకూడ అవుతుంది. దానిని పురస్కరించుకొని ప్రభుత్వం తానే Printing చేయడంవల్ల 3,4 లక్షల రూపాయలు ఆదాయంవస్తుంది.

అంతేకాకుండా, ఈ బడ్జెటు మెమొరాండాలో ఇక్కడ 30 వ పేజీలో Taxes and Duties అని ఒకచోట ఉన్నది. ఈ Taxes and Duties పైన పోయిన సంవత్సరం బడ్జెటు ఎస్టిమేటులో 18 లక్షల రూపాయలు ఎస్టిమేటు వేశారు. కాని, Revised Estimates లో 7 లక్షలే చూపించారు. అంటే, 18 లక్షలకు, 7 లక్షలు మాత్రం వసూలు చేసుకొని మిగతా 11 లక్షలు వసూలు చేయలేక పోయిందన్నమాట. దీనిని దృష్టిలో పెట్టుకొని ఈ సంవత్సరం ఈ విధానాన్ని అవలంభించింది. అంటే, పోయిన సంవత్సరం 18 లక్షలు ఎస్టిమేటు వేసుకొన్నప్పటికీ, 7 లక్షలే వచ్చింది గనుక, మరల ఇప్పుడు ఆ విధంగా commit

కాకుండా, మనకు 7 లక్షలే వస్తుందని ఈవేళ ఈ బడ్జెటులో చూపించారు. 30 వ పేజీలో కాని 31 వ పేజీలో, చూచినట్లయితే Receipts from Tobacco duty etc. అని ఉన్నది. మద్రాసు ప్రభుత్వములో మనకు వచ్చినటువంటి వాటా వగైరాలు తీసుకొన్నప్పుడు, మనకు ఇక్కడ 18 లక్షలవరకు ఈ tax వల్ల వస్తుందని తెలుస్తున్నది. కనుక మనకు 18 లక్షల రూపాయలు ఈ taxes వల్ల రావలసి యుండగా, అందులో 11 లక్షలు వసూలు కాకుండా, 7 లక్షలు మాత్రమే తీసుకోవడం జరుగుతున్నది. ఇంకా 11 లక్షల రూపాయలు ప్రభుత్వం తీసుకురావడానికి వీలుండికూడ తీసుకురాకుండా ఉన్నది. ఇప్పుడు మన రివిన్యూ మంత్రిగారే చెప్పారు— ఈ దేవాదాయాలకు సంబంధించినంతవరకు ఏమి దుర్వినియోగము జరగడం లేదు, వంశపారం పర్యంగా ఉన్నటువంటి trustees ఆ విధంగా చేయరని అనుకొంటాను అని. కాని నిన్ననే ప్రతికలలో ఒక ప్రకటన చూచాను. ఈ trustees ఎక్కడెక్కడ దుర్వినియోగం చేసినది, temples కు ఆదాయము రాకుండా వాళ్లు చేసిన అటకాయింపులు, దానిమీద ప్రభుత్వముయొక్క ప్రకటనలు తెలుపబడినవి. దీనినిబట్టి మనం చూచినట్లయితే, ఈ దేవస్థానాలకు సంబంధించినటువంటి భూములనుండి మనకు ఎంతో ఆదాయము రావలసియుండికూడా ఈ ఆదాయాన్ని అంతా, మధ్యలో ఉన్నటువంటి ఈ trustees మింగివేయడం జరుగుతున్నదని తెలుస్తున్నది. ఈ రోజున మనం ఈ temples ను పటిష్ఠంగా చేసినట్లయితే కనీసం 50 లక్షలవరకు ప్రభుత్వానికి అందులో ఆదాయం చూపించవచ్చు. అది గవర్నమెంటుకు రాకపోయినా, దానిలోవచ్చే contribution నుంచి మన ఉద్యోగస్థులకు ఇస్తున్నాముకదా? ఏవిధంగానైనా సరే, అది మన రాష్ట్రానికి ఉపయోగపడుతుంది. ఇప్పుడు అందులో Endowments చట్టము ప్రకారం school పిల్లలకు మొదలగువారికి ఇవ్వవచ్చు అనికూడ ఉన్నది. కనుక వాటినుంచి వచ్చే డబ్బు ఆవిధంగా వాడుకొంటె, State కు ఖర్చు తగ్గిపోతుంది. ప్రస్తుతం, ఈ temples యొక్క properties నుంచి leakage, చాలా దుబారాకూడ జరుగుతూంది.

అంతేకాకుండా, మీరు ఎప్పుడైతే ఉద్యోగస్థుల జీతాలు పెంచడానికి మొదలు పెడతారో, అప్పుడు ఉద్యోగస్థులు ఎక్కువ పనిచేయడానికి వీలుంటుందన్నమాట. వాళ్లు ఎంతో కష్టపడి పనిచేస్తారన్నమాట. ఇప్పుడుగూడ అనేకమంది ఉద్యోగస్థులు మనరాష్ట్రాన్ని బాగుచేసుకోవాలని ఎంతో కష్టపడి పనిచేస్తున్నారు. ఎక్కడో కొంతమంది పోకిరీవాళ్లు ఉంటే ఉండవచ్చు. కాని

చాలామంది మనరాష్ట్రాభివృద్ధి కోసమని ఉత్సాహంతో, ఆరు నెలలో చేసే పనిని, 2, 3 నెలలోనే, ఒక్కొక్కమారు దినములలోనే చేస్తున్నారని నాకు తెలుసును. ఉదాహరణకు ఇటీవల Planning మంత్రిగారు మాకు ఒక ఉత్తరువు ఇచ్చారు. ఈ ఉత్తరువు జారీ అవుతుండగానే, దానికి సంబంధించిన estimates కును, revised estimates కును తేడా వచ్చింది. మళ్లీ దీనికోసం కర్నూలుకు ఎక్కడ పోయి మంత్రిగారిని పట్టుకోవలసియుంటుందో అని అనుకొంటూ ఉంటె, వెంటనే ఆ కలెక్టరు ఒక Assistant Engineer ను Planning కు పంపించారు. ఇది కనీసం రెండు, మూడు నెలలు పడుతుందేమో అనుకొంటిని గాని, వారు 24 గంటల లోనే దానిని scrutinise చేసి తగ్గించవలసినదాన్ని తగ్గించి, సరిచేసి, మళ్లీ పంపించారు. అంటే, వాళ్లు ఎంత ఉత్సాహంతో పని చేస్తున్నారో తెలుసుకోవచ్చు. ఆ విధంగా ఉత్సాహంగా పని చేసేవారిని మనం ఇంకా బాగా ఉపయోగించాలంటే, వారిని ప్రోత్సహించాలంటే, వాళ్ల జీతాలను పెంచవలసియుంటుంది. ఇప్పుడు చూడండి. ఒక irrigation పనికి technical factor తీసుకొన్నప్పుడు, మొదట మూడువేలు sanction అయినటువంటి దానికి మరల revised estimate వచ్చి కూర్చుంటుంది. ఈరోజు నాకు తెలిసినటువంటిదే చెప్పుతున్నాను. మూడు వేలకు estimate వేసినటువంటి ఒక పనికి, revised estimates పదివేల వరకు పోయింది. ఈవిధంగా deviation వచ్చి చాలా దుబారా జరుగుతున్నది. కాని ఉద్యోగస్థులు జాగ్రత్తగా చూచి పనిచేశారంటె, ఈ deviation గాని, దుబారా గాని ఉండదు. ప్రభుత్వానికి ఎంతో ఖర్చు మిగులుతుంది. మీరు గనుక ఈ ఉద్యోగస్థుల జీతాలు పెంచినట్లయితే, మనకు ఒక కోటి రూపాయల వరకు వీరు మనకు save చేసి పెడతారు, అని మీకు నేను హామీ ఇస్తున్నాను. వాళ్లు ఎటువంటి దుబారా ఖర్చుకూడ జరుగకుండా బాగా పనిచేసి ప్రభుత్వమునకు లాభము చూపించడానికి ముందుకు వస్తారు. అందుచేత వాళ్ల జీతాలు తప్పకుండా పెంచాలని మనవి చేస్తున్నాను. ముఖ్యంగా ఈ technical people, medical people, విద్యాసంస్థలలో ఉండే వాళ్లయొక్క జీతాలు పెంచినట్లయితే, వాళ్లు, మనదేశానికి, మనందరికికూడా ఎంతో లాభము చేసిపెడతారు. కనుక ఈ విషయాన్ని ప్రభుత్వము ముఖ్యంగా ఆలోచించవలసి యున్నదని భావిస్తున్నాను.

అంతేకాదు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు ఆ ప్రభుత్వము

SRI S. Vemayya] [29th September 1955

Retrenchment Committee ని ఒకదాన్ని నిర్ణయించింది. మన Planning మంత్రిగారుకూడ అప్పుడు అక్కడ మంత్రిగా ఉన్నారనుకొంటాను. ఉన్నారని చెప్పుతున్నారు. కనుక వారికి ఇది తెలిసే ఉంటుంది. ప్రభుత్వ పరిపాలనలో Post Office business చేసేటటువంటివి కొన్ని ఆఫీసులున్నాయి. వాటిని తీసివేయవచ్చు అనుకొని దీన్ని పరిశీలించుటకుగాను ప్రభుత్వము ఒక కమిటీని వేసింది ఆ కమిటీ వారు ఇదంతా పరిశీలించి ఒక రిపోర్టు ప్రభుత్వానికి సమర్పించారు. అందులో వారు చెప్పినవన్నీ మనం తీసివేయలేమనుకోండి. మనం అనుకొన్నదానికంటె, ఆ కమిటీవారు ఇంకా ఎక్కువ drastic steps తీసుకొని, వాళ్ల లెక్కల ప్రకారం 4 కోట్ల, 54 లక్షల రూపాయల ఆదాయాన్ని చూపించే విధంగా సలహాలు చేస్తూ, తమ రిపోర్టు అందజేశారు. కాబట్టి ఈ రోజున మనము దీనిని పురస్కరించుకొని చేసినట్లయితే, మనం ఒక కోటి రూపాయలవరకు కూడ save చేసుకోవచ్చు. ముఖ్యంగా ప్రతిదానికి మీరు డబ్బులేదు, డబ్బులేదు అంటున్నప్పుడు, ఈ సూచనలను కొన్నిటిని తీసుకొన్నట్లయితే ఎంతో ఉపయోగపడుతుంది. ముఖ్యంగా N.G.O. లకు కొంత సహాయం చేయవచ్చు. ఏదో కారణాలు చెప్పి ప్రజలనేమైన మీరు మభ్యపెట్ట కలుగుతారేమోగాని, వీళ్లను మాత్రం మభ్యపెట్టలేరు. మీ కారణాలు వాళ్లు ఒప్పుకోరు. కనుక వాళ్ల జీతాలు ముఖ్యంగా పెంచవలసిన అవసరమున్నది. అందువల్ల నేను చెప్పిన విధానం ప్రకారం, ఈ Pay Commission వాళ్లు సూచించినట్లు entire గా చేయలేకపోయినా, కనీసం inferior service తోటి, lower division తోటి, upper division తోటి మొదలు పెట్టి, ఆ విధంగా ఈ సూచనలను implement చేయడానికి వీలుఉన్నది, కనుక, ప్రభుత్వం తప్పకుండా క్రమేణా ఈ విధానాన్ని అమలు పెడుతుందని, దీనికి అందరు అంగీకరిస్తారని, ముఖ్యంగా cabinet సభ్యులు ఇందుకు పూనుకొంటారని, ఆశిస్తున్నాను.

అంతే కాకుండా, ముఖ్యంగా ప్రభుత్వానికి డబ్బుతగలకుండా వుండేవిధానాలు కొన్నివున్నవి. ప్రభుత్వము వెంటనే ముందుకువచ్చి, "ఇదుగో N. G. Oల విషయములో యీ విధానాన్ని అవలంభిస్తున్నాము. మేము Pay Commission సిఫార్సులు అమలులో పెట్టలేకపోయినప్పటికినీ, మీకు కొన్ని యితర లాభాలు కల్పిస్తున్నాము అనిచెప్పి "అవి కలుగజేస్తే వారు దానికి సంతోషించి, ఎక్కువ ఉత్సాహముతో పనిచేయుటానికి వీలువుంటుంది. నేను మొన్ననే ఆ ప్రోత్సాహకార్యాలు యేమిటో క్లుప్తముగా వివరించి చెప్పాను. కనీసము చిన్న చిన్న ఉద్యోగస్థులకైనా

కొంచెముగానైనను వారి జీతాలువృద్ధిచేస్తే బాగుంటుంది. ఈ కొస్తాఅయినా వారికి చేయవలసిన అవసరమువున్నది. Medical relief వారికి అందడములేదు. అది practical గా వారికి అందే విధానాన్ని అవలంభించండి.

తరువాత Leave rules విషయములో సర్వీసులో వుండేవారికందరికి ఒకే విధమైన Leave rules applicable గా చేయడములేదు. Old leave rules కొంతమందికి, New leave rules కొంతమందికి apply చేస్తున్నారు. ఇటువంటి discrimination తీసివేయండి. ఇది వుండడమువల్ల New leave rules apply అయ్యేవారికి Leave accumulate చేసుకోటానికి వీలుకాకుండ వుండడము వల్ల, దీర్ఘవ్యాధిచే బాధపడేవారికి ఆ leave లేకుండా యిబ్బంది పడుచున్నారు. సర్వీసులో వున్నవారికి అకాలమరణము సంభవించినవారికి ఎట్టి సౌకర్యాలు ప్రభుత్వము కలుగుచేయడములేదు. సర్వీసుకాలము పూర్తికాకుండా చనిపోయినవారికి, వారియొక్క కుటుంబాలకు ఏ విధంగాను ప్రభుత్వము ఆర్థికసహాయము చేయడము లేదు. ఇటువంటి కనీస సౌకర్యాలు అయినను చేయాలి.

తరువాత Departmental Tests ప్యాసు కావటానికి పుస్తకాలు సప్లయి లేదు. పుస్తకాలులేని కారణముచేత వారు యీ Tests ఆలస్యముగా ప్యాసు కావటమువల్ల, overage అనేది అడ్డము వస్తున్నది. Age question లేకుండా ప్రమోషన్సు విషయములో సర్వీసునుబట్టి automatic గా వారికి ప్రమోషనులు, వారి increments automatic గా లభించే ఏర్పాట్లుచేయాలి. ఇటువంటి సౌకర్యములేని కారణముచేత కొందరు మొదట్లో సర్వీసులో చేరినప్పుడు ఎంతజీతము తెచ్చుకోటానికి ప్రారంభిస్తారో, retiring stage లోగూడా అదే విధంగా వుండిపోవటము జరుగుచున్నది. ఈ విధంగావుంటే, ప్రభుత్వమువారి సర్వీసును నమ్ముకొని ప్రవేశించేవారికి జీతము ప్రమోషన్సు మూలంగాను, increments లభించకుండావుంటే, వారి కుటుంబాలు ఆర్థికంగా దెబ్బతింటున్నవి. ఆర్థిక యిబ్బందులవల్ల సర్వీసులోని వారిలో కొందరికి మనోవేదనవల్ల premature death కూడ సంభవించడము జరుగుచున్నది. Departmental Tests pass కావటానికి పుస్తకాలసప్లయికి త్వరలో ప్రభుత్వము print చేయించి ఉచితముగా సప్లయి చేయించాలని అంటున్నాను.

SRI S. Vemayya] [29th September 1955

తరువాత ఆఫీసులలో కొన్ని Departments లో over staff, కొన్నింటిలో under staff వుంటున్నది. over staff వున్నచోట leisure తగినంత enjoy చేస్తున్నారు. Under staff వున్నచోట ఆఫీసులలో పనిఎక్కువై రాత్రి పదిగంటలవరకూ ఆఫీసులలో పనిచేసి, యింకను Files యిళ్లకు తీసుకొని వెళ్లడం జరుగుచున్నది. ఈ విధంగా over work చేయడమువల్ల కూడా staff లో కొంతమంది వ్యాధులవల్ల rest లేకపోవడమువల్ల premature death సంభవించటానికి కారణమగుచున్నది. సర్వీసులోని వారికి normal work యివ్వాలనేగాని, ఆఫీసులలో under staff గావుంచి, over work చేయించడము న్యాయమేనా అని ప్రభుత్వాన్ని అడుగుచున్నాను. తీరా premature death సంభవిస్తే, అతనియొక్క కుటుంబానికి ప్రభుత్వము యేవిధంగా సహాయము చేయడములేదు. ఆ post ఖాళీ అయిందని, యింకొకరిని అందులో వేస్తున్నారుగాని, ప్రభుత్వము తనలాభము, ఆఫీసులోని work కు సౌకర్యము చేసుకొంటున్నారుగాని, చనిపోయినవారి కుటుంబానికి సౌకర్యాలు చేయడము కన్పించదు. Over staff గా వున్నచోట షికార్లు చేస్తున్నారని కొంతమంది సభ్యులు చెప్పారు. ఇది యదార్థముకాదు. ఏది అయినప్పటికినీ, అటువంటి విషయాలు ప్రభుత్వము విచారించి అదనంగావున్న staff ను, under staff గా వున్నచోట్లకు transfer చేయండి. అందరికి equal గా normal work వుంటుంది.

తరువాత Housing facilities ను గురించి నేను యిదివరకే చెప్పాను. రాష్ట్రములో చాలామందికి యిళ్లులేవు. పల్లెప్రాంతాలలో ఖాళీగానైనా వుంచుకుంటారుగాని అద్దెలకు యివ్వరు. ఇక పట్టణప్రాంతాలలో యిళ్లు అద్దెకు దొరకక యీ వుద్యోగస్థులు అనేక యిబ్బందులు పడుచున్నారు. కనీసము చిన్న చిన్న ఉద్యోగస్థులకైనా ప్రభుత్వము తరఫున యిళ్లను కట్టించియిస్తే వారికి సౌకర్యాముగా వుంటుంది. రెవిన్యూఫిర్కా గ్రామాలలో Revenue Inspector లుకూడా బాధపడుచున్నారు. వారికికూడా అక్కడ యిల్లుకట్టించియిస్తే, ప్రభుత్వము తరఫున అక్కడికి transfer అయ్యే ప్రతి Revenue Inspector కూడా యింటికొరకు బాధపడడు. అదేవిధంగా యితర చిన్న వుద్యోగస్థులు అక్కడ పనిచేసేవార్కి అందర్కికి యిళ్లను కట్టించియిస్తే, ప్రజలమీద ఆధారపడకుండా పనిచేయుటానికి వీలవుతుంది.

తరువాత కొంతమంది చిన్న చిన్న ఉద్యోగస్థులనుగూడా State wide గ transfer చేస్తున్నారు. చిన్న ఉద్యోగస్థులు వారి కుటుంబాలతో అంతదూరము పోలేక, ప్రభుత్వమువారు యిచ్చేజీతము చాలక, రెండు కుటుంబాలుగాను, ఆయన అక్కడ, కుటుంబము పిల్లలు యిక్కడ, వుండడమువల్ల చాలా యిబ్బందులు పడు మన్నారు. కనీసము యీ చిన్న ఉద్యోగస్థులనైనా State wide గా చేయ కుండా అదే జిల్లాకు పరిమితము చేయమని కోరుతున్నాను. ఇంతేకాకుండా N. G. Oలకు ఒక Association పెట్టుకున్నప్పుడు, దాన్ని ప్రభుత్వము recognise చేసి, దానిద్వారా వారి కష్టసుఖాలు తెలియజేసుకునేటట్టు, అవన్నీ ప్రభుత్వము పరిష్కరించేటట్లు, ఏర్పాట్లుచేయాలి. లేకపోతే వీరికి ఏవిధంగాను చెప్పుకోట్టానికి దిక్కులేని వ్యవహారమవుతుంది. ఆ విధంగా కాకపోతే, at least, ఒక Conciliation Board మాదిరి ఒక Tribunal ను ఏర్పాటుచేసి దానిద్వారా వారి కష్టములను పరిష్కరింపచేయండి. ప్రైవేటు ఇండస్ట్రీల మాదిరిగా వీరి వ్యవహారాలుగూడ పరిష్కరిస్తే, యీ N. G. Oలలో అంతగా అసంతృప్తివుండదు. ఈ విధమైన ఏర్పాటులేని కారణముచేత, ఎవరైనా aggrieved N. G. O లు వుంటే, వారుపైకి చెప్పుకుంటే, వారిపై ఆఫీసరు ఏదో విధంగా prejudice తో అతనిని బాధించి, చివరకు అతనిని dismiss చేసే పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి అక్రమాలు ఏవైనా N. G. Oలకు జరిగితే Conciliation Board Tribunal ద్వారా, వారి grievances కూడా settle చేయాలని కోరుతున్నాను. అంతేకాకుండా temporary ఉద్యోగస్థుల list ను చదివాను. పర్మనెంటు వుద్యోగస్థులకంటే temporary ఉద్యోగస్థులే ఎక్కువమంది వుంటున్నారు. పర్మనెంటు వారు Medical Department లో 4 వందలమందివుంటె టెంపరరీవారు 17 వేల మంది వుంటున్నారు. ఇక Highways Department, P.W.D., Engineering Departments లో ఎన్నో ఏళ్లనుంచి పనిచేస్తున్నప్పటికిన్నీ, యింకను వారిని temporary గానే వుంచారు. నేను యీ temporary వారి సంగతిని గురించి మొన్న వివరంగా చెప్పాను. మరల చెప్పనవసరములేదు. నాకు తెలిసినంతమట్టుకు Revenue Department లో 15, 20 సంవత్సరాలుగా పనిచేసినప్పటికిన్నీ యింత వరకు వారిని పర్మనెంటుచేయలేదు. ఈ రోజువరకూ వారిని temporary గానే వుంచడమువల్ల వాళ్లకు increments లేవు. ప్రమోషన్సులేవు. ఈ రకంగావుంటే యిక వారికి పర్మనెంటుఅయ్యేది ఎప్పుడు ? నిరుత్సాహపడతారంటే, ఎందుకు

పడరు ? ప్రభుత్వ కార్యకలాపాలు అందుకనే సంతృప్తికరంగా జరగవు. అందువల్ల యీ చిన్న వుద్యోగస్థుల విషయములోనూ, టెంపరరీ వారిని ముందు పర్మనెంటు చేసి, వారికి యివ్వవలసిన increments retrospective effect తో యివ్వమని అంటున్నాను. వారికి యివ్వవలసిన minimum requirements ఏమిటో ప్రభుత్వము విచారించాల్సివుంది. Minimum requirements అంటే, అవి ఎంతవరకని ? ఇప్పుడు పోలీసు డిపార్టుమెంటును తీసుకోండి. పర్మనెంటువారు ఏ కొద్దిమందో వుంటే, టెంపరరీ వారు వేలసంఖ్యకు వున్నారు. Highways, P. W. D. Engineering Departments లో nominal muster roll అనిపెట్టి, వేలకొలది temporary గావుంచి, వారికి పర్మనెంటు చేయకుండా, increment యివ్వకుండా ప్రభుత్వమువారు వానిని ఎప్పుడు వెళ్లమంటే, అప్పుడు వెళ్ళిపొయ్యేటటువంటి స్థితిలో పెట్టి, పనులు చేయించుకుంటున్నారు. గట్టిగా ఎవరైనా అడిగితే, నీది temporary ఉద్యోగము, రేపు నీకు వుద్యోగములేదు అని చెబుతున్నారు. ఈ రోజున వాడికి జీతమువుంటుంది. రేపటిసంగతి ఏమిటి ? ప్రభుత్వము వీరిని అమాయకులను చేసి తమ పనులు అన్యాయముగా చేయించుకుంటున్నారన్నమాట. క్రిందటి బడ్జెటు speech లో వారందరిని పర్మనెంటు చేస్తానని హామీయిచ్చారు. ఈ విషయములో ఎంతవరకు చర్యతీసుకున్నది తెలియజేయాలని కోరుతున్నాను.

ఇక ఆఫీసర్లయిళ్లవద్ద వారు Peons చేత యిళ్లలో పడకలుదగ్గరనుంచి, అన్ని తరగతుల యింటిపనులు చేయించుకుంటున్నారు. కొంతమంది ఆఫీసర్ల యిళ్లలో రాత్రి వారు పడుకునేటంతవరకు పనులుచేసి, అటుపిమ్మట వాళ్లయిళ్లకు తిండికి ఏ రెండు మైళ్లో, మూడు మైళ్లో నడిచిపోవాలి. మరల ఉదయము ఆరుగంటలకే వారి యింటివద్ద హాజరుకావాలి. ఈ విధంగా పొద్దుననుంచి సాయంత్రమువరకు వారికి యిచ్చే కొద్ది జీతముతో వాళ్లు సంసారాలు ఎట్లాజరగాలని అంటున్నాను. ఏదైనా యింట్లో యిబ్బందివచ్చి రాకపోతే, సెలవుయివ్వరు. ఆరోజుకు జీతము విరగకోస్తారు. లేకపోతే టెంపరరీవాడైతే, యీనాడు ఆఫీసరుకు కోపమువచ్చింది కాబట్టి, నీకు ఉద్యోగము అయిపోయింది కాబట్టి రేపు ఉద్యోగములేదని చెబుతారు. ఇటువంటివి జరగకుండా ఆఫీసర్లయిళ్లలో Peons చేతపనులు చేయించటము మాన్పించాలని ప్రభుత్వాన్ని ముఖ్యంగా కోరుతున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—ప్రభుత్వానికి సంబంధము లేని విషయాలు గురించి చెబుతున్నారు.

SRI S. VEMAYYA :—ప్రభుత్వోద్యోగులు చేసేపని ప్రతివారు యిదే. నాకు తెలిసినంతమటుకు ఒక ఉదహారణ చెప్పదలచాను. ఒక Superintending Engineer యింట్లో Peons ఏడు, ఎనిమిదిమందిచేత పనులు చేయించుకుంటున్నాడు. ఇంట్లో తలా ఒక పనిచేస్తారు. ఒక Peon యింటినుంచి అన్నము కట్టుకొనివచ్చి, మధ్యాహ్నము పూటతిని, రాత్రికి యింటికి చేరుకుంటాడు. అతనియిల్లు ఎన్నో మైళ్ల దూరములోవుంటుంది. వుదయము వచ్చినది మొదలురాత్రి యింజనీరు పొమ్మనిచెప్పే వరకు అతను అక్కడనుంచి కదలటానికి వీలులేకుండా పోతున్నది. అతనియింట్లో యిబ్బందివచ్చి భార్యకుగాని పిల్లలకుగాని జబ్బుచేస్తే, యిక వాళ్లగతి చూచేది ఎవరు ? శెలవుఅడిగితే యివ్వరు ? లేకపోతే వుద్యోగమునుంచి తీసివేయడము. దానికి Muster roll వంకగా చూపిస్తారు. ఇటువంటివి యింకా ఎన్నో ఉన్నవి. ఇంతదూరమునుంచి వస్తాడని అతనికి భత్యమువున్నదా అంటే, అదేమీలేదు. దీన్ని బట్టిచూస్తే, యిదంతా బ్రిటిషువారి పాతకాలపు విధానాన్నే యింకను యీ ప్రభుత్వము నడుపుతున్నారు. ఈ పద్ధతులు మానవలసిందిగా strict instructions ప్రభుత్వమువారు పంపుతారని ఆశిస్తున్నాను.

తరువాత Casual leave విషయములో, casual leave muffasal లో జాస్తిగా యివ్వరనుకోండి. ఇది యివ్వడములేదు. ఇంకా తలబరువు ఆఫీసరు వుంటే, యింకా అతనిక్రింద గుమాస్తాలయితే confidential sheets లో ఏదైనా వ్రాస్తారు. Peon అయితే, ఏదో యిబ్బందిచేస్తూవుంటూ fine వేస్తారు. అసలు casual leave అంటే, casual occurances కు యివ్వాలి. అదికూడా యివ్వకపోతే, ఎంతో యిబ్బందులు జరుగుతున్నవి. ఇవి అడగగానే యివ్వాలని ఆదేశించాలని ప్రభుత్వాని కోరుతున్నాను. ఇంతే కాకుండా Daily allowance విషయములో ప్రతివ్యక్తికి కూడా దినమునకు రెండు రూపాయలు కనీసపు ఖర్చు వుంటుంది. అలాంటిది యీ Peons వగైరా Inferior servants కు దినమునకు 0-12-0 కంటె యివ్వడములేదు. ఈ పన్నెండు అణాలు ఏ విధంగా సరిపోతుందో ప్రభుత్వము గుర్తించాలి. ఈ విధంగాయిస్తే, బైటవూరువెళ్ళినప్పుడు ఒకపూట తిని, ఒకపూట పస్తువుండాల్సిన పరిస్థితి వుంటుంది. కడుపునిండా తిండి పెట్టకపోతే, యిక అతను ప్రభుత్వమువారి పనులు జరిపేదెట్లో గుర్తించాలి. అందువల్ల Peons కు కూడా Daily allowance రెండు రూపాయలు చేయాలని అంటున్నాను.

Sri K. Venkata Rao] [29th September 1955

జీతాలను Pay Commission వారు recommend చేసిన ప్రకారము పూర్తిగా ప్రభుత్వము implement చేయలేక పోయినప్పటికినీ, యీ Dearness allowance ను అంతయును వారి pay లో merge చేయమని కోరుతున్నాను. వస్తువుల ఖరీదులు తగ్గలేదు. పెరుగుతు నేవున్నవి. గనుక యీ Allowance ను merge చేయాలంటున్నాను. Government of India వారు ఆ విధంగా merge చేసినప్పుడు, మన ప్రభుత్వమువారు మటుకు ఎందుకు చేయకూడదు? కనీసము కొంతభాగము అయినను merge చేస్తే, N. G. Oలలో అసంతృప్తి ప్రబలిపోకుండా కొంతవరకైనను చేస్తే సంతోషిస్తారు.

ఇదిగాక Risk allowance అని వున్నది. ఉద్యోగస్థులను Malaria, Cholera, మున్నగు అంటువ్యాధులున్న మారుమూలలకు transfer చేస్తున్నారు. అక్కడ ఆ వుద్యోగము అయనచేసినన్ని రోజులున్నూ, అతని life risk లో వుంటుంది. అటువంటిచోట్ల T. B రావచ్చు, ఇంకా ఏ జబ్బుఅయినా రావచ్చు. అక్కడ అతనికి జబ్బుచేస్తే, అతనిని చూచేవారెవ్వరు? అటువంటివారికి ఆ period కు మాత్రము అయినను Risk allowance యివ్వాలని అంటున్నాను.

కాబట్టి యిటువంటి Minimum requirements ప్రభుత్వమువారు ఔదార్య స్వభావముతో N. G. Oలకు కలుగజేస్తే వారు సంతోషిస్తారు. ఇదివరకే అసంతృప్తి ప్రబలింది. ప్రక్కన ఒకేయింట్లో నివసించే కేంద్రప్రభుత్వోద్యోగికి, same category లో పనిచేసేవారికి Salary and allowance అన్నీ చేర్చిచూస్తే ఎంతో difference వుంటున్నది. ఇక అసంతృప్తివుంటుందంటే ఎందుకువుండదో ఆలోచించండి. కాబట్టి నేను యీనాడు ప్రతిపాదించిన తీర్మానము చాలా న్యాయమైనది. అందువల్ల అందరు సభ్యులున్నూ దీని కనుగుణంగా ఓటు చేసి, గెలిపించాలని కోరుతున్నాను. ప్రభుత్వముగూడా నేనుచెప్పిన సూచనలు అంగీకరించి implement త్వరలో చేస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Mr. DEPUTY SPEAKER:—వేమయ్యగారు చెప్పిన విషయాలను గురించి మంత్రిగారు జవాబు చెప్పదలచుకుంటే చెప్పవచ్చు.

THE HON. SRI K. VENKATA RAO:—అధ్యక్షా, అసలు పునాది అయిన విషయాలు ముందుగానే మనవిచేశాను. మరల వాటన్నింటిని గురించి చర్చ

Sri K. Venkata Rao]                                        [29th September 1955

లోకి తీసుకొని రావలసిన అవసరములేదు. కాని ఒక అందుకు మాత్రము సంతోషముగా వున్నది. నా మిత్రుడు వేమయ్యగారు ఆ పునాది సంగతులను ఆ శాస్త్రి విషయాలు యిప్పుడు చర్చలోకి రాకుండా N.G.O. లకు వున్న కష్టాలను ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చి వాటిని గురించి మాట్లాడారు. కనుక మరల నేను అవన్నిటిని గురించి చర్చలోకి వెళ్లవలసిన పనిలేదు. దానికి నేను వారికి కృతజ్ఞుడను. వారు చెప్పిన విషయాలలో ప్రతి డిపార్టుమెంటు సంగతికూడా చెప్పడమంటే సౌమ్యముగా వుండదు. వారు చెప్పిన నాలుగు, మూడు విషయాలను గురించి చెబుతున్నాను. ప్రభుత్వానికి యిప్పుడు కొత్త రకముగా ఆదాయము తెచ్చుకునే విధానాలు, వాటి అవసరాలను గురించి కొన్ని చెప్పారు. అవి సమంజసము కావచ్చు, సాధ్యము కావచ్చు, కాకపోవచ్చు. అవి ఎలా వున్నప్పటికినీ వారు చెప్పిన అంకెలను అన్నీ ఒకసారి కూడుకొని చూచుకున్నాను. ఎంతెంత ఆదాయము వస్తుందో ఆ అంకెలను అన్నీ కూడుకొని చూస్తే మరలవారు చెప్పిన ఖర్చులుగూడా లెక్కవేసి చూస్తే ఇంకా deficit కనుపిస్తూందేగాని plus కనుపించడంలేదు. అందువల్ల వారు యిచ్చిన సలహాలన్నీ పాటించడమైయినట్లయితే బడ్జటు deficit తగ్గడము లేదు సరికదా, యింకా హెచ్చు అయ్యే స్థితి ఏర్పడుతుంది. అందువల్ల వారు మనవిచేసిన కష్టాలు ఏ మాత్రము తగ్గటానికి అవకాశము కన్పించదు. వారు forests లో grazing permits వగైరాలను గురించి చెప్పారు. నూరు లక్షల ఆదాయము రాగలదని చెప్పారు. నూరు లక్షలేకాదు. నూటయాభై లక్షలు దాకా తీసుకొనే యత్నం ప్రభుత్వముకూడా మొదలు పెట్టింది. కాని అక్కడికి యీ మేకలుకూడా వెళ్లకుండా చేస్తే అడవులు బాగుపడుతాయి. మేకలు అడవులకు వెళ్లటానికి ఫీజువేయమని కోరారు. మేకలు అడవులకు వెళ్లడము మానివేస్తే, అక్కడ చెట్లు బాగా పెరుగుతాయి. అందుచేత ప్రభుత్వము ఒక restriction అనేది పెట్టింది.

SRI P. SUNDARAYYA :—అందుచేతనే కాబోలు ! ఫారెస్టు మంత్రిగారు మేకలు పెంచటానికి ప్రత్యేకంగా డబ్బు కేటాయించారు.

THE HON. SRI K. VENKATA RAO :—అవును. ఆ మేకలను అడవులు లేనిచోట పెంచాలని నా కోరికగాని అడవులలోనికి మేకలను పంపించి పెంచాలనే కోర్కె నాకు లేదు. ఒకవేళ అవి మరీలావు అయితే, అవి వుపయోగించుకొనే శక్తి సామర్థ్యాలు నా దగ్గరలేవు. కనుక యిప్పుడు forests లో మనకు నూటికి 23 ఎకరాల చొప్పుననే ఆంధ్రరాష్ట్రములో వున్నది. ఈ అడవులను

యుంకను అభివృద్ధిచేసి పెంచవలసియున్నది. అందులో చాలా Non-Reserve forests వున్నవి. వాటిలోకి మేకలను, గొర్రెలను పంపించవచ్చు. కాని పెద్ద పెద్ద అడవులలోకి పంపే ఆస్కారములేదు. అందులో పైగా ఈ grazing permits యివ్వడము అనే పద్ధతి తీసివేయమని, యీ grazing fees (పుల్లరి) తగ్గించమని ఒక వైపునుంచి ప్రజలు ఆందోళన చేస్తూంటే, యీ ఆందోళనను పెచ్చు చేసే పరిస్థితిలో ప్రభుత్వము వుండదేమోనని నా అభిప్రాయము కాని forest produce ను ద్వారా ఎక్కువ ఆదాయము తెచ్చుకునే ఏర్పాట్లు మాత్రము ప్రభుత్వము చేస్తుందని మనవిచేస్తున్నాను.

ఇదిగాక ఒక novel suggestion వేమయ్యగారు చేశారు. ప్రభుత్వానికి పంపబడే పిటిషనులమీద ప్రతిదానికిని stamp అంటించవలయునని ప్రభుత్వము ఆదేసిస్తే, దానిద్వారా కొంత ఆదాయము ప్రభుత్వానికి రావటానికి సాధ్యమవుతుంది అని చెప్పారు. సాధారణముగా కష్టములలోవున్న పేదవారే ప్రభుత్వానికి పిటిషనులు వగైరాలు పంపిస్తూవుంటారు. అంతేగాని భాగ్యవంతులనుంచి రావటము అరుదు. వారు నేరుగా రైలులో వచ్చి మాట్లాడుకొని వారి పనులు సానుకూలపరచుకునేటట్లు చేసుకుంటారు. వీరు డబ్బు గలవారు. వారు డబ్బులేని పేదవారు. కాబట్టి వేమయ్యగారు చెప్పిన suggestion అంగీకరించేటట్లయితే, యీ పన్ను పేదవారిమీదనే ఎక్కువగా పడుతుందేమోననే ఆలోచన వస్తున్నది. కాబట్టి యీ విషయము దీర్ఘాలోచన చేయవలసియున్నది.

తరువాత Village Officers ను గురించి నేను ఇందాకనే మనవిచేశాను. వాళ్లు ఒక గౌరవమైన స్థితిలో వుండి, వారియొక్క కుటుంబ గౌరవాన్ని కాపాడుకుంటున్నారు. ఎవరో కొంతమంది పావలు, బేడ పుచ్చుకోటానికి పాల్పడతారేమోగాని, చాలామంది దానికి పాల్పడకుండానే కూడా వారియొక్క కుటుంబ గౌరవాన్ని కాపాడుకుంటున్నారు. కనుక అటువంటి sweeping remarks యీ V. Os మీద పెట్టడము న్యాయముకాదని నా మనవి.

MR. DEPUTY SPEAKER :—వాళ్ల లో ఆస్తిపరులు అనేకమంది వున్నారు.

THE HON. SRI K. VENKATA RAO :— చాలమంది ఉంటారు. ముఖ్యము రాయలిటీ వుంచుకొని మైనింగు ఇన్‌స్పెక్టర్ల ఖర్చు సెంటరును పెట్టమనడం

సాధారణ సాంప్రదాయము గాదు. వారు అంగీకరిస్తారని అనుకోను. పోలీసు విషయంలో రైల్వే పోలీసు ఖర్చును మాత్రము సెంటరును భరించమన్నారు. రైల్వే పోలీసును ఎందుకు పెట్టమన్నారు అంటే Constitution లో Law and Order అనేది Provincial subject. ఈ విషయంలో సెంటరుకు పూచీ చాలా తక్కువ. మనము రైల్వే పోలీసులను పంపిస్తున్నాము అంటే, వూరికే పేరుకు S.A.P. అన్నట్లు Reserved Police అన్నట్లు, Town Police అన్నట్లు. అలాగే రైల్వే పోలీసు అని పేరుగాని, వారు మన వుద్యోగస్థులలో వేరు భాగము కాదు. రైల్వే లైనుమీద రైలు గబగబా పరుగెత్తుతుంది. స్థానికమైన పోలీసు వుద్యోగస్థులు వచ్చి పట్టుకోవడము కష్టము గనుక అందులో జరిగే అరాచకాన్ని అరికట్టుటకొఱకు ఈవిధంగా చేయడం అవసరమైంది.

SRI S. VEMAYYA :—Law and order విషయము కొకుండా Crime Branch గురించే నేను చెప్పాను. అదికూడ వాళ్ళే భరించాలని చెప్పాను.

THE HON. Sri K. VENKATA RAO :—Law and order లో Crime కూడ ఒక భాగమే కదా. Crime ఒక భాగమే. Crime లేకపోతే అసలు పనిలేనేలేదు. అసలు చాలావరకు పోలీసులనే తగ్గించవచ్చును. మెడ్యూలు కొస్టుల గురించి, ట్రైబ్సుగురించి సెంటరునుంచి ఎక్కువ డబ్బు తీసుకురమ్మన్నారు. అందుకు నాకేమీ అభ్యంతరములేదు. వేమయ్యగారి సహాయంతో పోరాడి ఇంకా ఎన్ని లక్షలు కావాలంటే అన్ని లక్షలు పోరాడి తీసుకురావడానికి వీలుంటుంది. లారీలకు ఎక్కువ రేటు వేయమన్నారు. దానినిగురించి సోదరుడైన సంజీవయ్యగారు ఇది ఒక టిప్‌గా తీసుకొని పన్ను ఎక్కువ వేయడానికి ఏమైనా యత్నము చేస్తారని అనుకొంటున్నాను.

తరువాత మేము నలుగురము మంత్రులు ఇక్కడ కనిపిస్తునే ఉంటాము. అందువల్ల మంత్రుల జీతాలుకూడ ఆయన లెక్కకు తీసుకొని, వీరి జీతాలు తగ్గిస్తే దానివల్ల 2 లక్షలు రూపాయలు లాభిస్తుందని చెప్పారు. అసలు తీసివేస్తేకూడా అంత రాదని మనవిచేస్తున్నాను. ఎందుచేత అంటే మన మంత్రులకు అయ్యే ఖర్చు సాలుకు 84 వేలు రూపాయిలు. వారి జీతాలను 500 కు తగ్గిస్తే 42 వేలు అవుతుంది. కాని 2 లక్షలు ప్రభుత్వానికి ఆదాయమువచ్చే పరిస్థితి లేదు.

SRI P. N. APPPA RAO :—M.L.A. లకు అయ్యే ఖర్చుకూడా లెక్కవేస్తే...

29th September 1955]

THE HON. SRI K. VENKATA RAO :—M.L.A. లకు ఒక్కొక్కరికి నెలకు 150 రూపాయలు వేసుకోండి. M.L.A లకు Income-tax లేదు. మాకున్నది. Actual గా నాకు వచ్చే జీతములో ప్రతినెల 100 రూపాయిలు తగ్గిపోతోంది కూడాను. 1931 వ సంవత్సరములో కరాచీ కాంగ్రెసు మంత్రులు రు. 500 లు ప్రతి నెల జీతము తీసుకోవాలని pass చేసినమాట నిజమే. 1931 సంవత్సరములో రూపాయికి వున్నటువంటి కొనుగోలు శక్తి ప్రకారం ఆవేళ ఇస్తే 150 రూపాయిలు ఇచ్చినా నాకేమీ అభ్యంతరములేదు. నేను వ్యక్తిగతంగా మాట్లాడుతున్నాను. రూపాయికి ఆ purchase value తగ్గిపోయింది. అందుచేత అంత inflation తో పాటు ఇదికూడ వచ్చిందిగాని, ఏదో రూపాయిల రూపంగా ఎక్కువ commodity purchase శక్తి తెచ్చుకున్నాము, అని అనుకునేందుకు వీల్లేదని మనవిచేస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—1931 సం॥ లో వున్నటువంటి రూపాయా ఇప్పుడు ప్రభుత్వ ఉద్యోగస్థులకు ఇస్తున్నటువంటిది? లేక 1953 లో వున్నటువంటి రూపాయా, లేక 1955 లో వున్నటువంటి రూపాయా?

THE HON. SRI K. VENKATA RAO :—అందుచేతనే ఈమధ్య ప్రభుత్వోద్యోగుల జీతాలుకూడా రివైజు చేశారు. వెంకటేశ్వర్లుగారు అప్పటికి కుర్రవాడేమో అనుకొంటాను. ఆ రోజులలో ప్రభుత్వోద్యోగులకు ఇచ్చినటువంటి జీతాలను రిట్రెంచిచేసి 15 రూపాయిలు ఇచ్చేవాళ్లకు అప్పుడు 10 రూపాయిలు ఇచ్చారు. ఆ రోజులలో అంటే, 1931 సం॥ లో అన్నిచోట్లకూడా రిట్రెంచిమెంటు వున్నది. తరువాత మరల ఈ రూపాయిలను ఎక్కువ చేయకుండా Dearness allowance plus చేశారు. మైనస్ పూర్తిచేయడమే కాకుండా ఇంకా ఒక plus కూడా కలిపారు. కనుక వారినికూడా వదలిపెట్టలేదు. నిస్సహాయులను చేయలేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—కరాచీ తీర్మానములో రు. 30 లకు తక్కువగా వుండకూడదనికూడా వున్నది. అదికూడా తమరు దృష్టిలో వుంచుకోవాలి.

29th September 1955]

THE HON. SRI K. VENKATARAO :—నిజమే. అటువంటివి సాధించడానికే ఇప్పుడు శ్రేయోరాజ్యము భారతదేశంలో స్థాపించాలని మేము సంకల్పిస్తున్నాము. తరువాత హెల్తు ఇన్‌స్పెక్టర్ల ట్రాన్స్‌ఫరును గురించి దీనికి సంబంధం లేకపోయినా వేమయ్యగారు తీసుకువచ్చారు. వీరికి రాష్ట్రము మొత్తముమీద బదిలీలు వున్నాయనే సంగతి నేను మొన్ననే వొప్పుకున్నాను. చేయవలసిన అవసరము ఏర్పడింది. అంతే కాకుండా ఇంకొక విషయము మనవి చేస్తున్నాను. సెంటువంటి దేదో ముక్కులో పెట్టుకొంటనే తప్ప కర్నూలు వీధుల్లో తిరగడానికి కష్టమౌతుంది. ఈ మధ్య మునిసిపలు హెల్తు ఆఫీసరును, కమీషనరును పిలిచి నేను అప్పుడు నా వెంటనున్న మిత్రుడు నాగేశ్వరరావుగారుకూడా ఈ వాసనను అక్టోబరు 7వ తేదీ లోపల తగ్గిస్తేనేగాని వీల్లేదని కొంత గట్టిగా చెప్పాము. అందుకు వారు "మేము శాయశక్తుల శ్రమపడుతూనే వున్నాము. ఈ వూరికి 5 గురు శానిటరీ ఇన్‌స్పెక్టర్లు వున్నారు. అందులో ఇద్దరిని మీరు బదిలీచేశారు. ఉన్న ముగ్గురు మేము ఎంత యత్నము చేసినా ఇది జరగడంలేదు" అని అన్నారు. అందుకు మమ్ములను ఏమి చేయమంటారు. మాకు శానిటరీ ఇన్‌స్పెక్టర్లను కష్టపెట్టడము ఇష్టమా వారు ఎవరోకూడా నాకు తెలియదు. పేరుకూడా తెలియదు. వారిని అవస్థ పెట్టవలసిన అవసరము మాకేమీలేదు. ఈ Health staff పాపము! చాలా చిన్న ఉద్యోగస్థులు. వారిని అంత దూరం బదిలీచేయడము చాలా కష్టముగానే వుంటుంది. కాని అది ఒక రింగు లాగా ఏర్పడింది. దానిని break చేసి ఒకచోట స్థిరంగా పెట్టడానికి వీలులేదు. కర్నూలు కాకపోతే నంద్యాలలో, నంద్యాల కాకపోతే కోయిలకుంట్లో ఎక్కడో వేసి కాలక్షేపణ చేసే యత్నము చేస్తున్నాము. ఏమైనా కొంచెము difficulties వస్తే కొంచెము మారము పంపించవలసిన అవసరం వస్తుంది. కాని రాష్ట్ర వ్యాపితంగా బదిలీలు చేయకూడదని గవర్నమెంటు rules వున్నవి. వీలయినంత వరకు చేయకూడదనే ఉన్నది. పరిస్థితి కొంచెము అభివృద్ధి అయినట్లయితే తప్పకుండా దగ్గర దగ్గర అట్టిపెట్టే యత్నము చేస్తాము. వారు conciliation tribunal ఒకటి పెట్టమన్నారు. అలా అయితే ప్రభుత్వముయొక్క పరిపాలన ఎప్పటికి కొనసాగదు. ప్రభుత్వ వ్యవహారములపై కూడ కోర్టుల్లో రిట్‌లు వేస్తున్నారు. Tribunal కు వెళ్లినట్లయితే పరిపాలనేమి సాగదు. ఇప్పటికే ఒక కాని కేసులను dismiss చేసినాకూడా వ్యవహారము అంతాకూడా హైకోర్టుల్లో

రిట్ కు వెళ్లుతుంది. ఇంకా discipline తగ్గిపోతోంది. అందుచేతనే మనవాళ్లు Association పెట్టుకొని N.G.O. ల యొక్క పురోభివృద్ధికిగాని సంస్కృతికిగాని ఇతరత్రా చదువుకొని దేశసేవ చేయడానికి వాళ్లు యత్నంచేసుకున్నట్లయితే తప్పకుండా ప్రభుత్వము ప్రోత్సాహము ఇచ్చి సహాయము చేస్తున్నదిగాని వాళ్లను అడ్డుపెట్టేటటు వంటి యత్నము ఏమీ చేయదు. మిగిలినవి అనేక విషయాలు దీంట్లో జరుగుతున్నాయి. ఇప్పుడూ daily allowance dearness allowance, risk allowance అనేవి ఇస్తున్నారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇప్పుడు వెంకటరావుగారు N.G.Os. Association పెట్టుకోవచ్చునని చెప్పారు. తుంగభద్రా డాము వుద్యోగస్థులు N.G.O. అసోసియేషను పెట్టుకుంటామంటె మేము దానిని రికగ్నైజు చేయడానికి వీల్లేదని చెప్పి అక్కడ బోర్డువారు వ్రాశారు. ఆ విషయము కూడా జ్ఞాపకము చేస్తున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :—తుంగభద్రబోర్డు Provincial Board గాదు. దానికి గవర్నమెంటుకు ఏమీ సంబంధములేదు. అందుచేత స్టాఫ్‌ను కంట్రోలు చేసేదివారే. ప్రస్తుతము వారి సర్వీసును వారికి lend చేశాము. వారు ఏమి వ్రాశారో నాకు తెలియదుగాని నేను చెప్పిన షరతులకు లోబడి వాళ్ల సంఘాభివృద్ధికి వారియొక్క విద్యాభివృద్ధికి వారియొక్క ఇతర సదుపాయాలకు సంబంధించినంతవరకు ప్రభుత్వముయొక్క ప్రోత్సాహము లభిస్తున్నది. ట్రేడ్ యూనియన్ క్రింద మాత్రము form కావడానికి వీల్లేదని చెప్పడం తప్ప అంతకంటే ఇప్పుడు నేను ఏమీ మనవి చేయడములేదు. Dearness allowance ఎంత కలపాలి, daily allowance ఎంత increase చేయాలి, risk allowance ఎక్కడెక్కడ ఇవ్వాలి అనేటటువంటి విషయాలు constant గా ప్రభుత్వముయొక్క పరిశీలనలో వున్నాయి. కొన్ని కొన్ని చోట్ల ఇంకా హెచ్చు చోట్లకూడా ఇటువంటి సదుపాయాలు కలుగజేసే యత్నము తప్పకుండా చేస్తామని నేను మనవిచేస్తున్నాను. ఇప్పుడు casual leave గురించికూడా వారు చెప్పారు. దానికి వారే జవాబుకూడ చెప్పేశారు. ఎవరో తలబిరుసు వుద్యోగులు అపని చేస్తున్నారని. ఈ తలబిరుసు తనాన్ని పోగొట్టడానికి పెన్సిలిన్‌లాంటి ఇంజెక్షను ఏదైనా కొరికితే వాళ్లకు ఇస్తే ఆ విధంగా ఇది పోవాలేగాని. దీనిని judge చేయడానికి వీలులేకుండా ఉంది. నిజంగా అవిధముగా Casual leave

ఇవ్వకపోవడము చాలా అన్యాయము. ఎవరికైనా కష్టములో వున్నప్పుడు సెలవు కావలసివస్తుంది. అసలు వారికివున్న casual leave 15 రోజులు మాత్రమే. అది కూడా ఇవ్వనని బాధపెట్టడము ధర్మము కాదు. ఇటువంటి వృత్తి ఎవరి దగ్గరనైనా వుంటే ఇకముందు వారు తగ్గించకూడదని వేమయ్యగారితోపాటు నేనుకూడా అప్పీలు చేసుకొంటున్నాను. ఇక N.G.Os. అనేటటువంటి కొడరులో వున్న వుద్యోగస్థులకు నేను ఇదివరకే మనవిచేసినట్లు ప్రభుత్వముయొక్క ఆదాయము ఎదిగిన కొద్దీ వాళ్లకు కావలసినటువంటి సౌకర్యములు చేయడానికి అభ్యంతరములేదు. అందువల్ల ఇప్పుడు వేమయ్యగారు శ్రమపడి బడ్జెటులో వున్నటువంటి taxes అన్నీ verify చేసి increases suggest చేశారు. అవన్నీకూడా కలిపినా ఈనాడువున్న బడ్జెటులోటు 5 కోట్ల 25 లక్షలు భర్తీచేయడానికి వీలు కొరకు సభ్యులందరి యొక్క సహాయముతోటి ఈ మాత్రము సంపాదించుకొనే లెజిస్లేషను నేడు, రేపు, ఎల్లుండి అని ఇలా పెట్టుకుంటూనే వెళ్లవలసియున్నది. ఇంకా కొంతకాలము దానిని పూర్తి చేసుకొనే దానికే దోవలేనప్పుడు ఇంకా commitment కావాల్సి ఇందాక నాకు వచ్చిన నోటును బట్టి సెంటరులో pay allowance మన రాష్ట్రములో ఈనాడు N.G.Os. salary's కు అప్లయిచేస్తే ఇంకా 200 లక్షల రూపాయిలు ఇంకా కావలసివస్తుంది. ఆ సామర్థ్యము మనకులేదు. గనుక ఇంతకు ఇది మనదేశము అనుకొని N.G.O's కూడా దీని విషయములో కృషి చేయువలసినది అని కోరుతున్నాను. ఆఖరున ఒక విషయము మనవి చేస్తాను. రెండవ ప్లాను అమల్లోకి వచ్చిన కొద్దీ ఆదాయము ఎదిగి ప్రభుత్వ అభ్యుదయము, ప్రజల అభ్యుదయము ఎదిగిన కొద్దీ కొంత దేశంలో పురోభివృద్ధి వస్తుందని అనుకొంటాను. ఇటువంటి పురోభివృద్ధి మనమువేసిన అంచనాల ప్రకారము వచ్చినట్లయితే ఈ ప్రస్తుత మంత్రి వర్గము, ఈ అయిదేళ్లు ఉంటుందని లెక్కవేసుకొంటె—ఈ 5 ఏళ్లు ఈ ప్రస్తుతము మంత్రివర్గము రెండవ పంచవర్ష ప్రణాళిక రెండు దరిదాపుగా వెళ్లుతాయి. గనుక అంత లోపల ఏ రకమైన అభివృద్ధి కలిగినప్పటికీ, ప్రజాభ్యుదయము కలిగినప్పటికీ దాంట్లో భాగాన్ని ప్రభుత్వముయొక్క సేవ చేస్తున్నాము. అంతేకంటే ఈ దశలో వున్నటువంటి N.G.O's. యొక్క సహాయార్థము వినియోగించడానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందని నేను తమకు మనవిచేస్తూ తిరిగి ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోవలసినది అని వేమయ్యగారిని కోరుతున్నాను.

Mr. DEPUTY SPEAKER :—Discussion is closed. I will now put the motion to the vote of the House.

The question is :

> "This Assembly recommends to the Government that the recommendations of the Central Pay Commission regarding the revision of the scales of pay of the Non-Gazetted Officers be implemented giving retrospective effect from 1st October, 1953."

The motion was declared lost.

Sri S. Vemayya demanded a poll and the House divided thus :

*AYES*

1 Sri Vavilala Gopalakrishnayya
2 ,, B. Adinarayana
3 ,, G. Suryanarayana
4 ,, M. Satyanarayana Raju
5 ,, C. V. Somayajulu
6 ,, P. Sundarayya
7 ,, Pillalamarri Venkateswarlu
8 ,, S. Vemayya
9 ,, A. Venkatrama Raju
10 ,, B. Sankaraiah
11 ,, V. Visweswara Rao
12 ,, P. Satyanarayana
13 ,, G. Bussanna
14 ,, S. Seetharamayya

29th September 1955]

15 ,, Mahammad Tahseel
16 ,, M. Nagi Reddi
17 ,, G. Ramunaidu

*NOES*

1 Hon. Sri K. Chandramouli
2 ,, Kala Venkata Rao
3 Srimathi N. Venkataratnam
4 ,, B. Rukmini Devi
5 Sri M. R. Appa Rao
6 ,, Y. Audinarayana Reddi
7 ,, G. Bapaiah
8 ,, P. Bapayya
9 ,, P. Basi Reddi
10 Hon. Sri D. Sanjivayya
11 ,, A. B. Nageswara Rao
12 Sri S. Brahmayya
13 ,, Y. Chennaiah
14 ,, N. Chenchurama Naidu
15 ,, N. P. Chengalraya Naidu
16 ,, Chidambara Reddi
17 ,, Marupilla Chitti alias Appalaswami
18 ,, M. Doraikannu
19 ,, T. Gopalakrishnayya
20 ,, P. Thimma Reddi
21 ,, Nallapati Venkatramayya
22 ,, P. Gopalu Reddi
23 ,, N. Govindarajulu
24 ,, S. Jagannadham

29th September 1955]

25 Sri P. Kodandaramayya
26 ,, Divi Kondiah Chowdary
27 ,, M. Koti Reddi
28 ,, S. K. V. Krishnavatharam
29 ,, Raja Sri V. V. Krishnam Raja Bahadur
30 ,, L. Lakshmana Dass
31 ,, J. Laxmayya
32 ,, Shaik Mahammad Rahamathulla shaik
33 ,, Ch. S. R. V. P. Murthy Raju
34 ,, B. G. M. A. Narasinga Rao
35 ,, Sanda Narayanappa
36 ,, D. Perumallu
37 ,, M. Pydayya Naidu
28 ,, N. Ramabhadra Raju
39 ,, B. Rajayya
40 ,, M. Rajaram
41 ,, D. Ramabrahmam
42 ,, T. Ramachandra Reddi
43 ,, P. Ramacharlu
44 ,, Kunda Ramaiah
45 ,, P. Ramaswami Naidu
46 ,, N. Ramulu
47 ,, P. Ranga Reddi
48 ,, U. Rangababu
49 ,, K. Santhappa
50 ,, K. Appa Rao
51 ,, Chowdari Satyanarayana
52 ,, K. Seetharamaswamy
53 ,, Raja Sagi Suryanarayana Raju

54 ,, N. C. Seshadri
55 ,, P. Sreearamulu
56 ,, A. C. Subba Reddi
57 ,, Shaik Moula Saheb
58 ,, Challa Subbarayudu
59 ,, K. Shanmugam
60 ,, C. P. Timma Reddi
61 ,, Nagineni Venkaiah
62 ,, D. Venkataramana Reddi
63 ,, M. Venkataraju
64 ,, P. Venkataravanappa
65 ,, G. Venkata Reddi
66 ,, P. Venkata Subbaiah
67 ,, V. Kothandarami Reddi
68 ,, P. Venkataswami Reddi
69 ,, Nachu Venkatramayya

*Neutrals.*

1. Sri P. Narasimhappa Rao
2. ,, T. Papa Rao.
3. ,, C. S. Ranganatha Mudaliar

Ayes : 17 ; Noes : 69 ; Neutrals : 3.

The motion was lost.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :—Sir, I am not moving Resolution No. 2 standing in my name.

Sri P. RANGA REDDI:—Sir, I am not moving Resolution No. 3 (33) standing in my name.

29th September 1955] [Sri Vavilala Gopalakrishnayya

Sri B. SANKARAIAH :—Sir, I am not moving Resolutions No. 4 (34) and 5 (36) standing in my name.

## (2) Conducting the Business of Government in Telugu.

Sri VAVILALA GOPALAKRISHNIAH :—Sir, I move :

> " This Assembly recommends to the Government to conduct thebusiness of the Government in Telugu only, in so far as it is not inconsistent with the provisions of the Constitution."

Sri A. VENKATARAMA RAJU :—Sir, I second the amendment.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఆంధ్ర రాష్ట్రం మనము కన్నటువంటి కలలలో ప్రధానమైనది. దాని ఉద్యమ ప్రారంభములో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఆరోజులలో ఆంధ్ర మహాసభ ఉపన్యాసములో ప్రసంగిస్తూ ఇలా అన్నారు. "ప్రస్తుత పరిస్థితియందు విద్యాశిక్షణకు, పరిపాలన విధానమునకు, పరిభాష ఆధారముగా ఉన్నది. అది అసహజస్థితి. ఆ అసహజస్థితి పోయి, సహజస్థితి సంప్రాప్తము అయినపుడు ఆంధ్రదేశము, ఆంధ్రభాష ఆంధ్రులు సంపూర్ణవికాసముపొందు అవకాశము కలుగ గలదు." ఇది ఆంధ్ర ఉద్యమము అనే నాగేశ్వరరావుగారి పబ్లికేషనునుంచి నేనువ్రాసిన విశాలఆంధ్రఅనే పుస్తకములో (29) పేజీనుండి.

రెండవది. రాజ్యము, స్వరాజ్యము అగుటకు గ్రామమునకు గ్రామస్థులు నాయకత్వం వహింపవలెననియు ఇందుకు విద్యాపద్ధతి, న్యాయపరిపాలన శాసన విధానము, భాషఐక్యతమీద ఆధారపడి ఉండవలెననియు ఆంధ్రరాష్ట్ర వాంఛ స్వరూపముగా Dr. Pattabhi Seetharamayya గారు వివరించేరు. కొండా వెంకటప్పయ్యగారుకూడా ఈ విషయాలను తెలుగులోనే ఒక రాజధానిలో ఉన్న వారు, తెలుగులో మాట్లాడినపుడు ఆ భాష గౌరవము పెంపొందునని వారు తమ ఆంధ్ర మహాసభ ప్రథమ సమావేశ స్వాగతోపన్యాసములో చెప్పారు. దానిని బట్టి మనము మన రాష్ట్రకోరికను వెల్లడిచేసినాము. ప్రజానీకం తమ భాషలో పరిపాలనా విధానము నడుపవలెననే కోరికతో చేసినది. దీనినే మాడపాటి హనుమంత

రావుగారు తెలంగాణాలో తెలుగులో పరిపాలనా విధానము నడపడానికే ఆంధ్ర తెలంగాణా ఉద్యమము తీసుకొనివచ్చారు. 1927 సంవత్సరములో గాడిచర్ల వారి సర్వోత్తమరావు మద్రాసు శాసనసభలో ప్రాంతీయభాషలలో పరిపాలన నడపవలెననే తీర్మానము ప్రతిపాదించేరు. భారతదేశము ఈ నాడు స్వతంత్రం సంపాదించింది. స్వరాజ్యం పొందింది. అంతేకాదు. స్వరాష్ట్రంకూడా పొందింది. ఇండియా జనాభా 35 కోట్లు. అందులో తెలుగువారి జనాభా 3½ కోట్లువరకు ఉన్నది. విభజనకానట్టి (Undivided) ఇండియాలో ఈనాడు హిందీ తరువాత తెలుగుభాష చాలా ప్రధానమైనట్టి భాషగాఉంది. అందువలన మన పరిపాలన విధానమంతా తెలుగులో నడపవలయును అని మనము కోరుచున్నాము. ఈనాడు ప్రభుత్వములోఉన్న పెద్దలు మన Central Government యొక్క ప్రభుత్వవిధానము ఏ విధముగా నడుస్తున్నదో తెలుసుకునేందుకు నియమించిన Estimates Committee తన రిపోర్టు (80 Page 91)లో ఈ విధముగా చెప్పింది.

"As years passed it will be increasingly difficult for the Central Government......

Sri S. RANGANATHA MUDALIAR:—Let the Hon. Member read the quotation in Telugu.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Government time వృధా చేయడానికి ఇష్టంలేక ఇంగ్లీషులో చదువుతున్నానండి.

Mr. SPEAKER : It is a quotation and the member can read it in English.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :—"As years passed it will be increasingly difficult for the Central Government to keep intimate contacts with the people in farflung area directly and they may feel a sort of alienship to the Central Government as was the case under the British administration. Even as it is, the far off people in the southern and eastern States are not fully conscious of the Central Government at Delhi and there is not sufficient touch between it and the people there. It is also impossible for any Central Government to achieve that ideal. It is through

Sri Vavilala Gopalakrishnayya] [29th September 1955

making the State and the local administrative units more responsible and more conscious of their obligations to the people whom they serve that the respect for their administration will grow.

దానిని Dr. Pattabhi seetharamayya గారు చెప్పినది అన్వయిస్తే Administration సరిగ్గా నడపవలెనంటే "విద్యాపద్ధతి, న్యాయపరిపాలన, శాసనసభ విధానము ప్రాంతీయభాషలో జరిగినపుడే ప్రజలకు అర్థమవుతుంది. వారు నిర్వహించుకోగలరు. ఈరోజు ఫజులాలీ కమిషను రిపోర్టుకోసము ఎదురుచూస్తున్నాము. భాషారాష్ట్ర విభజనకు ఇది ప్రధానప్రాతిపదిక. దానిని Secondary గా అందుబాటులో ఉండేటట్టు పరిపాలనా విధానము జరుగవలెను. ఈ రోజున విశాలాంధ్ర సమస్యనుగురించి మన మందరము చెప్పుకోనడము జరిగింది. అట్లాగే ఇతర భాషా ప్రాంతాలవారు తమ భాషలలో తమ పరిపాలన జరగాలని అంటున్నారు ఈనాడు భాషారాష్ట్రములు ఏర్పడాలనే సూత్రమును అంగీకరించేవారి రిపోర్టు ఇవ్వబోతున్నారని చెప్పేరు. ఇదివరకు పరిపాలనఅంతా, ప్రభుత్వవిధానము పరప్రభుత్వం నడిపింది. 1948 సంవత్సరం ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పంపిన address లో శ్రీ Aravinda Ghose గారు ఈ విధముగా చెప్పేరు. ఇంగ్లిషులో తన పరిపాలన నడపవలెనని ప్రయత్నంచేసిందిగాని ఎప్పుడైతే ప్రాంతీయభాషలతో నడపలేదో అందువల్ల బ్రిటిషు ప్రభుత్వం తన రాష్ట్రప్రభుత్వ విధానంవల్ల వాటిని ఐక్యం చెయ్యలేకపోయింది. భారతదేశములో సర్వసాధారణముగ ఉపజాతుల విధానము ఒకటిఉన్నది. అది వృద్ధిచెందిందిగాని బ్రిటిషు ప్రభుత్వం తన రాష్ట్రాలలో పరిపాలనా విధానమువల్ల ఐక్యత సాధించలేక పోయిందన్నారు. ఈ విధముగా చూస్తే మొత్తముగా భాషావిధానము అమలు జరపడం అవసరం అని తేలుతుంది. చైనాదేశభక్తిని గురించి వివరిస్తూ "Nationalism and Internationalism అనే పుస్తకములో,

"స్వచ్ఛమగు దేశభక్తి తరతరాలనుండి తనకు సంక్రమించిన తన మాతృభూమిపై తన ప్రజలపై, తన భాషపై, తన సారస్వతంపై తనజాతి ఉన్నత సాంప్రదాయములపైగల నిగూఢగాఢ ప్రేమతో కూడినది" అని అన్నారు. అంతే కాదు. మనం ఈనాడు Socialist Patternకు పోదామనే విషయములో ఉన్నాం.

**DEPUTY SPEAKER**: The House will now adjourn for lunch and meet again at 3 p.m.

AFTER LUNCH (3.00 P. M.)

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇంతకు ముందు అసలు దాని ప్రయోజనాలు, ఆదర్శాలు చెప్పాను. ఇంక ఆచరణలో వచ్చే లాభాలను గురించి మనవిచేస్తాను. ఇప్పుడు గ్రామాలలో నివశిస్తున్న సామాన్య జనానికి ప్రభుత్వంయొక్క విధానాలతో సంబంధంలేకుండా ఉంది. గవర్నమెంటు orders అన్నీ ఇంగ్లీషులో ఉండడంవల్ల సామాన్య ప్రజలకు వాటినిగురించి తెలుసుకునే అవకాశం లేకుండా పోతోంది. ఏదైనా ఒక petition మీద order లు ఇంగ్లీషులో వేస్తే ఒక సామాన్య రైతు వాటినిగురించి తెలుసుకొనుటకు ఎక్కడకైనా వెళ్ళి చదివించుకొని అర్థం తెలుసుకోడానికి ఎంతోకాలం వృధాచేయవలసి వస్తోంది. తెలుగు భాష చాలాపేలవంగా ఉంటున్నదని, English భాషలో ఉన్న standard లేకుండా ఉందని అంటున్నారు. దానికి కారణం ఇప్పుడు చదువుతూ ఉండేవాళ్లు తెలుగు చదివినా చదవకపోయినాకూడా ఇబ్బందిలేదు. ఇంగ్లీషు భాష మాత్రం కొంచం వచ్చిఉంటే, తెలుగు పుస్తకాలు అసలు చదవకపోయినా, తనకు ఉద్యోగం వస్తుందనేటటువంటి విశ్వాసం ఉన్నందువల్ల తెలుగుభాషను విద్యార్థులు విస్మరించడం జరుగుతోంది. ఆంధ్ర భాష అభివృద్ధి కావాలంటే దానికి ప్రాతిపదిక తెలుగు ప్రభుత్వ భాషగా ఏర్పడడమే. అప్పుడే తెలుగుభాష సర్వతోముఖంగా అభివృద్ధి కావడానికి అవకాశం ఉంటుంది. ఇది తప్పకుండా ఆచరణ సాధ్యమని నేను విశ్వశిస్తున్నాను. ఇక విద్యావిధానం విషయం సమీక్షించినప్పుడు ఉస్మానియా యూనివర్సిటీ ఉర్దూ భాషలో మొత్తం విజ్ఞానం అంతాకూడా తర్జుమా చేసుకుని పెట్టుకోగలిగారు. మనం మొదటినుంచీ ఆంధ్ర రాష్ట్ర ఆశయంతోపాటు, ప్రభుత్వ విధానంలోనూ, విద్యావిధానంలోనూ తెలుగు ఉండాలని వాంఛించాం. నేను ఉర్దూ విషయం చెప్పిన కారణమేమిటంటే, తెలుగువాళ్లమీద ఉర్దూ భాష రుద్దాలని ఇప్పుడు ప్రభుత్వం అధికారంలో ఉన్నాయన ఉద్దేశించాడు. ఈ argument ఎందుకు చెబుతున్నానంటే మన భాషలోకూడా, ఇతర భాషలవలెనే, ప్రభుత్వం ప్రోత్సహించినట్లయితే కావలసినంత సారస్వతం—literature—తయారు కావడానికి ఎంతో అవకాశం ఉంది. తెలుగు భాష పరిపాలనా విధానంలోకి తీసుకు రావాలంటే కొన్ని ఇబ్బందులు ప్రస్తుతం మనకు ఉన్నాయి. చాలా Departments పెరిగాయి. Correspondence విపరీతంగా పెరిగిపోయింది. ఉత్తర ప్రత్యుత్తరాలు చకచకా నడవవలసిన అవసరం ఉంది. పూర్వపు మాదిరిగా మంచి దస్తూరితో వ్రాసేవాళ్లున్నారని అనుకుంటే పనిసాగదు. అందుచేత type writing machines కావలసిన అవసరం పెరిగింది, దానితోపాటుగా shorthand కావాలని

Sri Vavilala Gopalakrishnayya] [29th September 1955

నటువంటి అవసరం ఉంది. ఈ shorthand, type writing ల కోసం మన వాళ్లు ఈ నడుమంగా ఒక కమిటీ వేశారు. ఆ కమిటీయొక్క report వెంటనే ప్రకటించి ఈ type writers ను గురించి శ్రద్ధ తీసుకోవలసియున్నది. వాటి నిర్ణయంలో వచ్చే ఇబ్బందులు చాలా ఉన్నాయి. ఈ రోజు మనకు చిన్నమాంబ type writing machine ఉన్నది. కాని అది ఈనాటి standard కు చాలకుండా పోయింది. కనుక దానికన్న ఇంకా ఎక్కువ అభివృద్ధి కావాలి. Speed ఎక్కువగా పెంచగలిగే machine కావాలి. ఇప్పుడు Telugu typists ను అడిగితే "మహానుభావా! ఇది ఎక్కడవుతుందండి? దీనితో అయ్యేపనికాదు. కావాలంటే మేము మంచి దస్తూరీతో వ్రాసి ఇస్తాం కాని ఈ machine తో type చేసి ఇవ్వలేమంటున్నారు. నిజమే. ఇప్పుడున్న machine ప్రథమ ప్రయత్నంగా తీసుకురాబడింది. ఎవరూ ఉత్సాహపరచిన వాళ్లు లేకపోయారు. ఎవరో ఒక్కరు శ్రద్ధ తీసుకుని, దానికి డబ్బంతా పెట్టుకొని ఏ వంద type writing machine లో తెప్పించారు. గవర్నమెంటు పనినంతా తెలుగులో నడవాలంటే గవర్నమెంటు ఆఫీసులన్నిటికీ type machine లు కావాలి. అందుకోసం మనం వెంటనే ఒక standard key board ఏర్పర్చి, ఒక వెయ్యో, రెండు వేలో machine లకు order ఇస్తే ఇంత ఖరీదు కాదు. ఈరోజు చిన్నమాంబ Typewriting machine ఖరీదు 800 రూపాయిలో వెయ్యి రూపాయిలో కూడా అవుతోంది. అంత ఖరీదు కాకుండా, ఖరీదు తగ్గాలంటే ఎక్కువ మిషన్లు తెప్పించుకోవలసిన అవసరం ఉంది. ఉద్యోగాలలో చేరేటప్పుడు మొట్ట మొదట్లోనే Telugu type writing, shorthand నేర్చుకోండని ఉత్సాహం ఇవ్వటానికి, వాళ్లకు కావలసిన నిర్బంధాలు చాలా తగ్గించాలి. నాకు కొన్ని విషయాలు తెలిశాయి. గవర్నమెంటు సర్వీసులో ఇంకొక చోట ఉన్నవాళ్లు ఈ Telugu Shorthand నేర్చుకుని, Assembly speeches వ్రాయటానికి వచ్చేటప్పటికల్లా వాళ్లని గవర్నమెంటు ఎసెంబ్లీలోకి తీసుకోరట. కొత్తగా వచ్చిన వాళ్ళని మాత్రమే తీసుకుంటాం, వాళ్లని తీసుకోం అని చెప్పేసి అంటున్నారు. ఆ విధానం మారాలని చెప్పేసి చెబుతున్నాను. ఆవిధంగా కాని Telugu shorthand అభివృద్ధి కాదు. Hyderabad State లో తెలుగు type writer ను వాళ్లు కొంత విస్తృత పరిచారు. లక్ష్మణాచారి అనే ఆయన చాలా ప్రయత్నం చేసి, హిందీ type writer లో ఉన్న కొన్ని భాగాలను దీనికి సమన్వయపరచాలని ప్రయత్నించి ఒక మిషీను తయారుచేశారు. ఈమధ్య రామకృష్ణారావుగారు మాట్లాడుతూ అది standard machine లాగా ఉందన్నారు. అది తప్పకుండా ప్రభుత్వం తీసుకోవాలన్నారు. తీసుకుంటాం అని

Sri Vavilala Gopalakrishnayya] [29th September 1955

చెప్పలేదనుకోండి. రేపు మనకు విశాలాంధ్ర రాబోతున్నప్పుడు, దానికి కావలసిన సంసిద్ధత మనకు లేకపోయినట్లయితే, అప్పుడు చిక్కుపడతాం. నిజంగా మనం కోరినది పరిపాలనలో ఏమీ మార్పులేకుండా పాతబ్రిటిషు పరిపాలనా విధానంలో నడిచేటటువంటి ఆంధ్రరాష్ట్రమైతే ఇది ఆంధ్రరాష్ట్రమే కాదు. ఇప్పుడు Andhra University ఉంది. ఇతర Universityలు వస్తున్నాయి. అవి University లే అవుతున్నాయి కాని, విశ్వవిద్యాలయాలుగా పరిణమించడంలేదని నా నమ్మకం. మన ప్రభుత్వ విధానం క్రిందినుంచి పైవఱకూకూడా తెలుగులో జరపాలి. ఐతే కేంద్ర ప్రభుత్వంతో నడిపే కార్యకలాపమంతా దేంట్లో నడపవలసి వస్తుందని అంటారు? ఇప్పుడు ఇంగ్లీషులో నడుస్తున్నది. 15 సంవత్సరాలలోగా హిందీలోకి మారాలని అన్నారు. ఇండియాలో ఉన్న ప్రధాన భాషలలో తెలుగుకూడా ఉన్నది. ఈ తెలుగుభాషలో సకారాన్ని అభివృద్ధి పఱచడానికి కావలసిన ప్రాతిపదికలు ప్రభుత్వ కార్యకలాపాలు, విద్యావిధానం, శాసనసభ ఈమూడు సహకరించినప్పుడే అది సాధ్యపడుతుంది. ప్రతివాడు శ్రద్ధగా చదువుతాడు. పూర్వంకన్న ఈవేళటి రోజున పత్రికలు చదివేవారు చాలా ఎక్కువైనారు. దానికి కావలసిన machinery అంతా ఎక్కువవుతోంది. కాని మన తెలుగులో మాత్రం అంత రాలేదు. అరవంలో six point type కూడా వాళ్లకి ఉన్నది. అమ్ముడుపోయే పత్రికలు, చందాదార్లు ఎక్కువగా గల ప్రతికలు అక్కడ ఎక్కువ ఉన్నాయి. ఆంధ్ర ప్రభుత్వంకూడా తన విధానంలో మార్పు తేగల్గినప్పుడు ఇంతకన్న ఎక్కువ అభివృద్ధి తీసుకురావడానికి వీలవుతుంది. Type writer లో చాలా అభివృద్ధి తీసుకురావలసియున్నది. ఉద్యోగాలు ఇచ్చేటప్పుడుకూడా compulsory గా తెలుగులో ఇన్ని మార్కులు రావాలని పెట్టకపోయినట్లయితే లాభంలేదు. ఇప్పుడున్న తరంలో రాకపోవచ్చునుగాని ముందు తయారవుతున్న తరం ఏదయితే ఉందో వాళ్లతో ఇదుగో 'మీకు ఇంత telugu standard ఉంటేకాని మేము Service లోకి మిమల్ని తీసుకోము. కనుక మీరు బాగా చదవాలన్నప్పుడు' భారతం చదువుతారు. భాగవతం చదువుతారు. కన్యాశుల్కం వగైరా పుస్తకాలుకూడా చదివి వ్యవహారిక భాషలోకూడా ప్రజ్ఞ సంపాదించుతారు. ఆధునిక యుగంలో గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తిగారు తెలుగుభాష ఏ standard లో ఉండాలని చెప్పారో దాన్ని మనంకూడా—మంచివాడుక భాష—అలవర్చుకోడానికి వీలవుతుంది. ప్రభుత్వం ఒక ఇబ్బంది చెబుతుంది, సరియైన పదకర్మలు లేవని. అవన్నీ మనం తీసుకురావడానికి ప్రయత్నం చేయవలసియుంటుంది. ప్రభుత్వానికి Constitution ప్రకారం ఒక ఇబ్బంది ఉందని చెబుతారు. పైకి కేంద్ర

Sri A. Venkatarama Raju] [29th September 1955

ప్రభుత్వానికి వ్రాసేటప్పుడు ఏ భాషలో వ్రాయాలనేది దాని విషయంలో నాకు వివాదములేదు. ఎందుకంటే ఈవేళటి రోజున ఇంగ్లీషులో వ్రాస్తున్నారు. ముందు హిందీ రావచ్చును. ఉదాహరణకు బొంబాయి గవర్నమెంటు పూర్వపుపేర్లన్నీ మార్చేశారు. అక్కడ Collectors' Conference జరిగితే అక్కడ Revenue Minister చెప్పాడు. "మీరు మీ ప్రాంతీయభాషలో ప్రజలతో ఉత్తర ప్రత్యుత్తరాలన్నీకూడా నడపడం నేర్చుకోవలసిన అవసరం ఉందని" హెచ్చరిక చేశారు. అది మన మందరం గుర్తించవలసిన అవసరం ఉంది. వింధ్య ప్రదేశ్‌లో శాసనసభా విధానమంత తమ భాషలో నడుపుతున్నారు. మనం మాత్రం ఎందుకు చేయలేక పోతాం? వారికన్న దేశభక్తిలోగాని మాతృభాషా అభిమానంలోగాని వెనుకకు తగ్గేవాళ్ళంకాము. Government benches లో ఉండనివ్వండి. ఇవతల ఉండనివ్వండి. దీంట్లో మాత్రం అందరకూ గట్టి పట్టుదల ఉండబట్టే రాష్ట్రం సాధించుకోగలిగాం. దానికి తదనంతర పరిణామమైన భాషా ప్రయుక్త ప్రభుత్వ విధానం పెట్టేందుకని పూర్తిగా కృషిచేయవలసిన అవసరం ఉందని, ఇంకను ఇతర మిత్రులు మాట్లాడడం అవసరం ఉన్నది కాబట్టి, నేను ఒకణ్ణే మీ time తీసుకోకుండా ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాను.

SRI A. VENKATARAMA RAJU :—అధ్యక్షా, ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత తిరిగి మనము రెండవ ప్రభుత్వం స్థాపించినతర్వాత అయినా ఉంటే ఒక ప్రభుత్వం 18 మాసాలతో అయిపోయింది. ఈ తెలుగులోనే ప్రభుత్వ కార్యకరాపాలను నిర్వహించడం అనేది ప్రారంభిస్తారో ఏమోఅని ఆశించిన వాండ్లలో నేను ఒకడను. ఇదివరకుఉన్న 18 మాసాలలో ఆంధ్రప్రభుత్వం తెలుగులోనే కార్యకలాపాలు నెరవేర్చవలెను అని, ఇది ముఖ్యంగా జిల్లాలవరకుకూడ దీనిని తీసుకొని వెళ్ళడానికి వేగంగా ప్రయత్నం చేయాలని గత ప్రభుత్వంలో చాల సందర్భాలలో ఇది చర్చకురావడం జరిగింది. దానికోసం తీవ్రంగా పనిచేస్తున్నామనికూడ ఇప్పుడుఉన్న మంత్రులు వాగ్దానము చేస్తూవచ్చారు. అంతేకాకుండా, ఆంధ్ర రాష్ట్రసాధన సందర్భంలోగాని, లేక ఆంధ్రరాష్ట్ర ప్రసక్తి ఇదివరకు వచ్చినపుడల్లా కూడ, మనము ఉమ్మడి రాష్ట్రంలో ఉన్నపుడు, ఆంధ్రరాష్ట్రం, భాషారాష్ట్రములు రావడంతోనే, ఆ స్వభాషలోనే ఈ ప్రభుత్వ కార్యకలపాలు నిర్వహించుకోవడంద్వారా. ఆయారాష్ట్రాలలో ఉన్నటువంటి ప్రజలు, ప్రభుత్వం నిర్వహించేటటువంటి కార్యకలాపాలలో ప్రజానీకమంతా పాల్గొనవలెనంటే ఇది ఒక ప్రధానమైన సౌకర్యంఅవుతుందనికూడ మనము చెప్పుతూవచ్చాము. అయితే షుమారు రెండు సంవత్సరాలు పూర్తిఅయినప్పటికి (ఎల్లుండితో రెండు సంవత్సరాలు పూర్తి

అవుతుంది) ప్రభుత్వం తెలుగులోనే మన ప్రభుత్వ కార్యకలాపాలను నిర్వహించడానికి ఇప్పటికిచేసిన ప్రయత్నం ఏమిటో ఇప్పటివరకు ప్రభుత్వసభ్యులకే తెలిసే అవకాశంలేదు. అదే ప్రభుత్వంవారు చెప్పవలెను. నాపూచీకాదు. అయితే భారత రాజ్యాంగచట్టము, అదే ఇండియా సంవిధానము అనేపేరుతో రాజ్యాంగ చట్టమును ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయడంతో ఒకటి అందించింది. అది ఇండియా సంవిధానము అన్నారు. దానిని భారత సంవిధానమని అనుటకుకూడ మనకు అదృష్టం లేకపోయింది. ఆరకంగా...

THE HON. SRI K. VENKATA RAO :—Constitution లో "India" "భారత్" అనిఉంది.

SRI A. VENKATARAMA RAJU :—అందుచేత రోడ్డుకు తెలుగు పదం అనేది ఇదివరకు పుట్టబడలేదు. కాని "ఇండియా"కు "భారత్" అనేది పుట్టబడింది. కాబట్టి ఇండియాకు పెట్టుకోవలసిన అవసరంలేదని నా అభిప్రాయం. అందుచేత ఇంగ్లీషువాండ్లు పాలనకు వచ్చిన తరువాత పుట్టినపార్టీలు కాబట్టి వీటికి తెలుగుపదాలే ఉండకపోవచ్చును. కాని ఇంగ్లీషువాండ్లు పాలనకు రాకముందే మన దేశానికి ఒకపేరుఉంది కాబట్టి, ఆపేరుతోనే వ్రాయవచ్చునని నేను భారత దేశం గురించి చెప్తున్నాను. అందుచేత దానితో ఈ సందర్భంలో పోల్చడం అంతమంచిది కాదనుకొంటాను. బాగా పెద్దలు, బాగా అనుభవజ్ఞులు ఉన్నపుడు, అయితే ఇపుడు ఈ ప్రభుత్వంలోఉన్న మంత్రివర్గం ఇదివరకు మంత్రివర్గంలోవుంటూ వచ్చినవారు, ఆంధ్రదేశంలో చాలా అనుభవజ్ఞులు Sri Kaleswara Rao వంటి చాల వృద్ధనాయకులు ఉన్నప్పటికికూడ, ఈ పరిస్థితులలోకూడ ఈ కార్యక్రమం నిర్వహించడానికి ఇంతవరకుచేసిన ప్రయత్నాలు చాల అలసత్వంగానే ఉన్నాయని నేను పూర్తిగ అభిప్రాయపడుతూ ఉన్నాను. అయితే ఈ ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత ఈ ఆంధ్రశాసనసభకు ఈ రోజున ఇంగ్లీషు చదువుకోనటువంటి చాలాంటి సభ్యులు కొంతమంది వస్తున్నాం. అయితే వీరిని ఎదుర్కొంటున్న కష్టాలు ఏమిటో పరిశీలించడానికి ప్రభుత్వం కనీసం ఎంతవరకు ఆలోచించింది అనేది హాస్యాస్పదమైన విషయం. ముఖ్యంగా తెలుగులో ప్రశ్నలు పంపిస్తేగాని లేక తెలుగులో మన ముందుకు వచ్చేటటువంటి ఈ బడ్జెటుకు కొన్ని సవరణలు పంపిస్తే తిరుగా ఇంగ్లీషులోనే మనకు సంప్రాప్తమయ్యేటటువంటి పరిస్థితులున్నాయి. తాను పంపించింది ఏమిటో తనకే తెలియకుండా ఉండేటటువంటి చిక్కులుకూడ మనముందుకు వస్తున్నాయి. అంతేకాకుండా ముఖ్యంగా ఆంధ్రదేశంలో కొన్ని జిల్లాలలో తెలుగు

Sri A. Venkatarama Raju] [29th September 1955

తోనే జిల్లాకు సంబంధించినటువంటి కార్యకలాపాలు అన్నికూడ నిర్వహించవలసినదని ఇదివరకే ప్రభుత్వం ప్రకటన చేయడం జరిగింది. అందులో ముఖ్యంగా తూర్పు గోదావరిజిల్లా ఒకటి. ఐతే ఈవేళ తూర్పుగోదావరి జిల్లాయొక్క ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణ మనము పరిశీలించినట్లయితే, అందులో ఈ రోజుకుకూడ ఎక్కువ భాగము, 100-90 వంతులు ఇంగ్లీషులోనే జరుగుతుంది. తప్పితే తెలుగులోకి తర్జుమా కావడంకాని, తెలుగులోనే ప్రభుత్వపరిపాలనా బాధ్యత నిర్వహించబడడంగాని మన ముందు కనుపించడంలేదు. ఈ పరిస్థితులలో మనము అన్ని పరిశీలించినపుడు ఈవేళ ఆంధ్రరాష్ట్రం వచ్చినవెంటనే, ఆంధ్రప్రజానీకంతో. రాజ్యాంగ బాధ్యతలను నిర్వహించేటటువంటి ముఖ్యంగా ప్రజానీకానికి అంతాకూడా రాజ్యాంగ పరిపాలనా విధానంలో వాండ్లు పాల్గొనడానికి చేయవలసిన ప్రధాన సౌకర్యాలు, ముఖ్యంగా రాజకీయ ప్రభుత్వ కార్యకలాపాలను మాతృభాషలో నిర్వహించడం అనేది మొట్టమొదటిది ఆవుతుంది, అని చెప్పుకొన్నప్పటికికూడ, ఈవేళ దానికి ఎందుచేత ప్రాముఖ్యత ఇవ్వడంలేదు, అనేది పరిశీలించినట్లయితే వాగ్దానము చేసినంత సులువుగా ఈ వాగ్దానాలు నెరవేర్చడం అనేటటువంటిది ఈ ప్రభుత్వంయొక్క బాధ్యత కాదని చాలా స్పష్టం అయిపోతుంది. దీనికి తెలుగుతోనే కాకుండా, తరువాతవచ్చిన అనేక వాగ్దానాలను మనము పరిశీలించినపుడు తెలుగుకూడ, ఆ రకమైనటువంటి నామ మాత్రపు వాగ్దానముతప్పితే ఇది నిర్వహించడానికి చేసిన వాగ్దానము కాదనేది, ముఖ్యంగా, దీనినిబట్టి అర్థంచేసుకోవలసిన అవసరం వస్తుంది.

అందుచేతనే పదే పదే ఈ శాసనసభలో తెలుగుభాషలో ఈ ప్రభుత్వ కార్యకలాపాలను నిర్వహించవలెనని వచ్చినప్పటికికూడ ప్రభుత్వం దానికి ఏదో రకంగా సమాధానం చెప్పవలెననేటటువంటి అభిప్రాయంతో ఏమైనా తప్పితే, ఈ రకమైన పరిస్థితులు ఆంధ్రదేశంలో ఉన్నపుడు, మనము దీనిని వెంటనే ఏర్పాటు చేయడానికి ఎందుకు ప్రయత్నం చేయకూడదు అనే సుహృద్భావముగల ఆలోచన ప్రభుత్వంలో ఉన్నదని నేను విశ్వసించలేకపోతున్నాను. అంతేకాదు. తిరిగి ఇపుడు విశాలాంధ్ర సమస్య మనముందుకు చర్చకువస్తుంది. ఈ విశాలాంధ్ర అనేది భాషాప్రాతిపదికమీద, భాషారాష్ట్రాల ప్రాతిపదికమీద విశాలాంధ్రను తక్షణం ఏర్పాటుచేయాలనేది దేశం మొత్తంమీద జరుగుతూఉండే ఆందోళన మీకందరకు తెలుసును. ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఈ సమస్యమీద చేస్తున్న కృషికూడ మనకందరకు తెలుసు. ఇందులో ఈ రాజకీయపార్టీల అభిప్రాయభేదములంకూడ దానికి ఆటంకము రావడంలేదు. ఈ పరిస్థితులలో ముఖ్యంగా ఆంధ్రదేశం

వచ్చినతరువాత దీనికి ప్రధానమైనటువంటి, పునాదిఅయినటువంటి, మాతృభాష లోనే కార్యకలాపములు నిర్వహించడం అనేటటువంటి దానిని అమలు జరపడానికి మనము ప్రయత్నించినపుడు ఆంధ్రదేశంలోఉన్న ప్రజానీకం, మూడుకోట్ల ఆంధ్రులుకూడ ఈవేళ, ఈ విశాలాంధ్ర నిర్మాణంకోసం కృషిచేసేటప్పుడు. కనీసము మాతృభాషలో కార్యకలాపములను నిర్వహింపచేసి ఉన్నట్లయితే, అసలు విశాలాంధ్ర ప్రాముఖ్యతను, మొత్తం తెలంగాణాలోను, ఆంధ్రదేశములోను. ఉన్నటువంటి మొత్తం ప్రజానీకం ఎప్పటికప్పుడే వేగంగా గుర్తించడానికి ఇది దోహదం అయి ఉండేది అనేదికూడా ముఖ్యంగా కాంగ్రెసు ప్రభుత్వం గుర్తించలేక పోవడంఅనేది ఆశ్చర్యపడవలసిన విషయం. అందుచేత ఇప్పటికి ప్రభుత్వం ఆలోచించినటువంటిది ఏమిటి ? ఎంతవరకు ఆ ప్రయత్నాలుచేశారు అనేది మంత్రి గారు సమాధానం చెప్పవలెనని కోరుతూఉన్నాను. అంతేకాదు, ఈవేళ ఇక్కడ గవర్నమెంటు Press పెట్టారు. 1953 సంవత్సరం October ఒకటినుంచి, ఆంధ్రరాష్ట్రం ఉద్భవించిన తరువాత, 1954 సంవత్సరం ఇదే శాసనసభలో అనేక సందర్భాలలో, చర్చించినప్పటినుంచి క్రొత్తగా వచ్చింది. ఇపుడే ప్రెస్సును ఏర్పాటుచేసుకొన్నాం. ప్రెస్సులో ఈనాడు ఉన్న అవకాశాలు, దానికి చేసినఏర్పాటులవల్ల ఈవేళ ప్రెస్సు మనకు పూర్తిగ తెలుగులో అందించగల స్తోమతు కలుగలేదు. వేగంగా దానిని తీసుకొనిరావడానికి మేము ప్రయత్నం చేస్తామని ఇదివరకు, విద్యాశాఖామంత్రిగఉన్న పట్టాభిరామారావుగారు చెప్తూవచ్చారు. అయితే ఈవేళ ఆ విద్యాశాఖామంత్రిగారు, ఆప్రధాన మంత్రిగారులేరు. ఆ కార్యక్రమానికి సమాధానం ప్లానింగు శాఖామంత్రిగారు ఇస్తారని అనుకొంటాను. అందుచేత మన ఆంధ్రప్రభుత్వ ప్రెస్సులో చేసినటువంటి ప్రత్యేక ఏర్పాటులు ఏమిటి ? ఇప్పటికి కార్యక్రమాన్ని నిర్వహించటంకోసం ఏఏ రకాలైన మార్పులను, ప్రత్యేకమైనకృషిని చేశారు ? ఇపుడు ఎంతకాలంలో, కనీసం ఆంధ్రశాసనసభ కార్యకలాపాలను తెలుగులో అందించడానికి వీలుగా మీకు ఏమైనా ఒకపథకంఉందా ? ఫలానా తేదికి, 3 మాసాలలో, 6 మాసాలలో లేక ఒక సంవత్సరకాలంలో అని limit పెట్టి ఆ నాటికి ఇది ఇవ్వడానికి ప్రయత్నం ఏమైనాచేశారాఅంటే, మనకు తెలుస్తున్న దానినిబట్టి, ఆ రకమైనటువంటి ప్రయత్నంలో నేలేరు. ఏదో కళ్లనీళ్లు తుడిచేటటువంటి కార్యక్రమంలో, ఇట్లాంటి సందర్భంలో చర్చకు వచ్చినపుడు ఏదో సమాధానంచెప్పి బయటపడే పరిస్థితులు మాత్రమే ప్రభుత్వం ఆలోచిస్తుంది అని మనకు కనిపిస్తుంది.

Sri A. Venkatarama Raju] [29th September 1955

అందుచేత ఇదేదో ప్రతిపక్షము తీసుకొని వచ్చిందనే దృష్టితో కాకుండా, ఈవేళ ఆంధ్రదేశములో తీసుకురావలసిన ఒక ప్రధానమైన మార్పు ఇది అని గమనించవలెనని కోరుతున్నాను. అసలు ఆంధ్ర ప్రభుత్వముయొక్క కార్య కలాపములన్నియు, శాసన సభయొక్క కార్యక్రమమంతయు తెలుగులో జరిపినట్లయితే, ప్రజానీకమంతా తెలుసుకోవడానికి, వారు తగినటువంటి సలహాలు ప్రభుత్వానికి ఇవ్వడానికి ఇది దోహద మిస్తుందనేది దృష్టిలో ఉంచుకోవాలి. ముఖ్యంగా ఆంధ్రజాతిని పురోభివృద్ధికి తీసుకురావడానికినీ, ఆంధ్రజాతిని వేగంగా రాజకీయ కార్యకలాపాలలో తీసుకురావడానికినీ, ప్రభుత్వము నిర్వహించే కార్యక్రమాల్లో ప్రజలంతా తమయొక్క అభిప్రాయాలను ఇచ్చి ప్రభుత్వానికి చేయూత నివ్వాలనే టటువంటి అభిప్రాయాన్ని ప్రభుత్వానికి ఉన్నట్లయితే, ముఖ్యంగా వారి కార్య కలాపాలన్నీ తెలుగులోనే సాగించడానికి పూనుకోవడం చాలా ప్రధానమైనటువంటిదని గుర్తించమని కోరుతున్నాను. ఈ విషయంలో వారికి ఉన్నటువంటి పథకమేమిటో స్పష్టంగా తెలియజేయవలసిందని కోరుతున్నాను. లేకపోతే, కొన్ని సంవత్సరముల వరకు ఈ పనిని చేయలేము. అనైనా చెప్పండి. అసలు ప్రభుత్వమే తమంతట తామే దీనికి పూనుకోవలసి యుంటుంది. అది లేకుండా ఒక అనధికార తీర్మానం తమకు వచ్చేంతవరకు పరిస్థితి వచ్చినప్పటికినీ, దానిని దాటి వేసేటటువంటి రీతిగా ప్రభుత్వము సమాధానమిస్తున్నట్లున్నది. రెండుసంవత్సరములుగా ఈ విషయం గురించి పదే పదే చెబుతున్నప్పటికినీ, దీనియొక్క అవసరాన్ని గుర్తించినట్లు లేదు. ఇది ఎంత మాత్రం సమంజసమైనది కాదు. అసలు ఈ అనధికార తీర్మానం తీసుకురావలసిన అవసరం లేకుండగానే ప్రభుత్వమే కృషిచేయవలసియున్నది. ఆవిధంగా ఆశించినటువంటి శాసనసభ్యులు ఈనాడు దీనికొరకు అనధికార తీర్మానము తీసుకురావలసిన పరిస్థితి వచ్చింది. దీనికి ప్రభుత్వము ఇంతవరకు చేసిన కృషి యేమిటో తెలియకుండా ఉంది. కనుక గోపాలకృష్ణయ్యగారు తీసుకువచ్చిన తీర్మానమును అన్ని పార్టీల వారు బలపరచి ప్రభుత్వము ఈ కార్యక్రమాన్ని త్వరలో అమలులో పెట్టేటట్లు చూడవలసిందని కోరుచున్నాను.

**Sri A. Kaleswara Rao:** Mr. Speaker, Sir, I move

> "that after the word 'Government' occurring a second time i.e., after the words 'conduct the business of the Government' insert the words 'as early as possible,' ".

"గవర్నమెంటుయొక్క కార్యక్రమమంతా కూడా" అనేటటువంటి మాటలకు తరువాత "తెలుగులోనే చెయ్యాలి" అనేటటువంటి మాటలకు మధ్యగా "వీలైనంత త్వరగా" అనేమాటలు ఉంచాలి. అనే సవరణను నేను ఉపపాదిస్తున్నాను. ఇందులో భేదాభిప్రాయ మేమిలేదు.

ఆంధ్రరాష్ట్రం పుట్టినప్పటినుంచి మనం భారతదేశానికి ముందు నడుస్తూ ఆంధ్రులమైన మనము మన పరిపాలనా వ్యవహారమంతా తెలుగులోనే జరపాలని, అట్లాగే విద్యనంతను, ఉత్తమమైనటువంటి జ్ఞానాన్ని కూడ, తెలుగులోనే ఇవ్వాలని మనం చెప్తూతూ వచ్చాము. పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణంవల్ల ఈ ఆంధ్రరాష్ట్రము సంపాదించుకోగలిగాము. ఇంకా మూడుకోట్లజనులకు ఏకమైనటువంటి, అఖండమైనటువంటి విశాలాంధ్ర రావలెనని కూడ కోరుతున్నాము. ఇప్పుడు మనకు ఒక నిలకడైన ప్రభుత్వము వచ్చింది. ఇదివరకు ఉన్నటువంటి ఒక వోటుతో ఓడిపోయేటటువంటి ప్రభుత్వమువలె కాక, ఇప్పుడు ఒక సుస్థిరమైన, నిలకడైన ఆంధ్ర ప్రభుత్వము నెలకొల్పబడినది. కనుక, ఈ ప్రభుత్వము తమ వెనుక ఒక పెద్ద పార్టీ పెట్టుకొని బలము గలిగి యున్నది. కాబట్టి వారు చేసే కార్యక్రమానికి ఏలాంటి అభ్యంతరాలు ఉండవని మనవిచేస్తూ, మనము ఏ ఆదర్శం కొరకైతే ఆంధ్రరాష్ట్రం సంపాదించామో ఏ ఆదర్శం కొరకు విశాలాంధ్ర కోరుతున్నామో ఆ ఆదర్శాన్ని వీలైనంత త్వరలో అమలు జరుపవలసిందని కోరుతున్నాను. రాజ్యభాష ఏదైతే ఉందో దాన్నే పాఠశాలలలోను, ఇంటిలోను సహజంగా నేర్పుతారు. కాబట్టి మన రాజ్యభాష తెలుగు కావడమనేది చాలా ప్రధానమైనటువంటిది. ప్రభుత్వం ఒక భాషలో పాలన చేస్తూ ఉంటే ఇంకొక భాషలో విద్య చెప్పడం స్వభావికమైనటువంటి విషయం కాదు. అందువల్ల గోపాలకృష్ణయ్యగారు చెప్పినమాట నిజమే. నైజాము ప్రభువు తనయొక్క రాజ్యాంగ కార్యక్రమాన్ని, శాసన కార్యక్రమాన్ని, పాలన కార్యక్రమాన్ని ఎప్పుడైతే ఉర్దులో పెట్టాడో, అప్పుడు వెంటనే primary schools మొదలు కొని, M. A., Ph. D. వరకు విద్యాబోధన ఉర్దులోనే ఏర్పాటుచేసే ఉస్మానియా యూనివర్సిటీకి దాన్ని దేశీయభాషగా మార్చారు. ఉర్దూ నిజంగా అందరి ప్రజల యొక్క భాషకాదు. కాని ఇంగ్లీషులో తప్ప, జర్మన్ భాషలో తప్ప, పాశ్చాత్య భాషలలో తప్ప మనకు విజ్ఞానం రాదు అనేటటువంటి బూచిని మాత్రం కొట్టి పారేశాడు. హిందీలో అయినాసరే, తెలుగులో అయినాసరే, కన్నడములోనైనాసరే, దేంట్లోనైనాసరే ఉత్తమ జ్ఞానాన్ని బోధించేటటువంటి Chemistry, physics మొదలైనటువంటి శాస్త్రములు ఉర్దులోనే బోధింపబడుతున్నాయి. అట్లాగే, law లోను, కోర్టులన్నిటిలోను వాళ్ల రిపోర్టులన్నీ కూడ ఉర్దులోనే publish అవు

Sri A. Kaleswara Rao] [29th September 1955

తున్నాయి. ఇంగ్లీషులో reports ఉన్నట్లుగానే, ఉర్దులో చక్కగా తర్జుమా చేసుకొన్నారు. ఈ విషయములో ఆదర్శంగా ఒక నైజాము ప్రభుత్వము చేసినందుకు వారిని అభినందించవలసియున్నది. అయితే ఆ భాషనే తీసుకువచ్చి తెలుగువారిమీద, మహారాష్ట్రులమీద కూడ నెత్తిన రుద్దారు అనేదే మన ఆక్షేపణ. కనుక మన భాషలలో విజ్ఞానం యావత్తు తీసుకురావడానికి ఏది అసమర్థనీయమైనది కాదు అనేది స్పష్టంగా తెలుస్తున్నది. సమస్తమైనటువంటి శాస్త్రములు యావత్పరిపాలన ఒక భాషలో చేయవచ్చు. ఈ విషయం గురించే ప్రతి వారు బడ్జెట్ సమావేశములలోను, ఇంక అనేకసార్లు చెప్పతూ వచ్చారు. కనుక మన శాసన సభ కార్యక్రమాన్ని అట్లాగే గవర్నమెంటు వ్యవహార కార్యక్రమంతా కూడా వాళ్ల ఉత్తర ప్రత్యుత్తరాలు, అర్జీలు, వాటిమీద ఉత్తర్వులు మొదలైనటువంటివన్ని కూడ తెలుగులోనే జరపాలనే సంగతి ఇప్పుడు ప్రభుత్వానికి అన్ని పార్టీలవారు, అందరము కలిసి జ్ఞాపకము చేస్తున్నాము. గోపాలకృష్ణయ్యగారి తీర్మానంలో, వెంటనే, రేపే ప్రభుత్వము ఈ విధంగా చేయవలసిందన్నట్లుగా ఉన్నది గనక, అది సాధ్యంకాదు గనుక- వీలైనంత త్వరలో అదే సవరణను నేను తీసుకు రావలసి వచ్చింది. వాళ్లకు కొంచెము time ఇవ్వవలసి యుంటుంది. మన మంత్రులలో ఎవరికి కూడ ఇందులో భేదాభిప్రాయము లేదు. కళా వెంకట్రావుగారు ఎప్పటినుంచో ఆంధ్రుల కొరకు పని చేస్తున్నటువంటి వారు. చంద్రమౌళిగారు విశాలాంధ్ర కావాలని మహాసభలో గట్టిగా చెప్పినటువంటివారు. కనుక దీనికి అందరు అనుకూలురే. ఇక shorthand and typewriting లో కొంచెము ఇబ్బంది ఉంటుందంటున్నారు. కాని shorthand and typewriting కోసమని ఇంగ్లీషువాళ్లు ఇంగ్లీషు పెట్టకుండా మానినా? అదే విధంగా నైజాము ప్రభువు ఉర్దు పెట్టకుండా మానాడా? కనుక ఆ కారణం చెప్పితే నేను ఒప్పుకోను. తెలుగులో shorthand and type-writing గట్టి అయితే తప్ప మార్చడానికి కష్టము అనేది నేను ఒప్పుకోను. కావలసివస్తే ఇప్పుడు అనంతపురములో Police Training College ఉన్నది. అక్కడ Shorthand Bureau లో ఉన్నటువంటి Senior officer ను వేసుకొండి. అందులో ఒకతను మాతో కూడ అక్కడక్కడ తిరుగుతూ ఉండే అతను ఇక్కడ కన్పడతాడు. ఏమని అంటే, మనుష్యులను temporary గా అసెంబ్లీ reporting పనికివేస్తూ ఉంటారని చెప్పాడు. అటువంటి వాళ్లను ఇక్కడకు గవర్నమెంటు తీసుకోవచ్చుకదా? ఇప్పుడు Police Department లో వాళ్లకేమి పనిలేదు, ఇప్పుడు రాజద్రోహ మనేటువంటిదేమి లేదు. Section 120 (b) అమలు జరపడం అనేదేమి లేదు. కాబట్టి అక్కడ ఉన్నటువంటి senior officers ను వేసుకోండి. దీనికి

ప్రత్యేకంగా స్కూళ్లు పెట్టండి. కావలసినదంతా చేయండి. ఇప్పుడు తూర్పు గోద
వరి జిల్లాలో వ్యవహారమంతా తెలుగులో జరుపవలసిందని చెప్పినా, అక్కడ ఇ
జరగడం లేదని, అసంతృప్తికరంగా ఉంటుందని చెప్పుతున్నారు. ఇంకా 3,
జిల్లాలలో పెట్టి try చేయండి. మీ హాయములోనే మీరు ప్రభుత్వములో ఉం
గానే ఈ కార్యక్రమమంతా జరిగేటట్లు చేయడానికి సర్వవిధాలా కృషి చేయండి
దీనికి కొంత వ్యవధి కావలసి యుంటుంది. కాబట్టి "as early as possible"
అనేమాట ప్రవేశపెడుతున్నాను. కనక ఈ మంత్రివర్గము శ్రద్ధ తీసుకొని వీలైనం
త్వరలో దీనిని ఖచ్చితంగా అమలు పెట్టవలసిందని, వోటర్ల యొక్క భాషలోనే ప
పాలన, శాసనసభ కార్యక్రమము, కోర్టుల వ్యవహారము, యావత్తుకూడ జరుగవలసి
దని మనవి చేస్తున్నాను. ఎందుకంటే, మనకు స్వరాజ్యం వచ్చింది ప్రతి వ్యక్తి
స్వతంత్రం వచ్చింది. జర్మనీలోగాని, ఫ్రాన్సులోగాని, ఇంగ్లాండులోగాని వోట
భాషలో పరిపాలనా వ్యవహారం జరగకపోతే ఒప్పుకొంటారా? ఒప్పుకోరు. మ
మంటే ఇటీవలవరకు విదేశీయుల పరిపాలనలో ఉంటిమి. కాబట్టి, వారి భాషలో
అంతా జరుగుతూ ఉండినది. ఇప్పుడు ఆ దాస్యాన్ని వదలుకొన్నాము. కనుక ఆ భాష
మార్చుకోవాలి. ఈ విషయంలో ఎలాంటి భేదాభిప్రాయాలు లేవు కాబట్టి గోపా
కృష్ణయ్యగారు నా సవరణను అంగీకరించినట్లయితే అందరము ఏకగ్రీవముగా
తీర్మానాన్ని చేసుకొందామని కోరుతూ ఈ సవరణను ఉపపాదిస్తున్నాను.

MR. SPEAKER :—ఈ తీర్మానము మీద చాలామంది సభ్యులు యింక
మాట్లాడదలచుకున్నావారున్నారు. ఈరోజున సభ అయిదు గంటలతో ఇ
తీర్మానము మీద ఓటింగు పూర్తిచేసి వాయిదా వేయవలచుకున్నాను. అందువ
సభ్యులు అయిదేసి నిమిషాలకు పరిమితముచేసి మాట్లాడడము పూర్తి చేయవలసింది
కోరుతున్నాను.

SRI S. BRAHMAYYA :—మాననీయ అధ్యక్షా, ప్రభుత్వ కా
కలాపాలు తెలుగులో నడపవలసిందిగా శాసనసభ సిపార్సు చేయబోతున్నదనే ప్ర
పాదన యిప్పుడు మనముందు వున్నది. దానికి శ్రీ కాళేశ్వరరావుగారు "వీలయిన
త్వరలో" ననే సవరణ ప్రతిపాదించారు. వారి సవరణను నేను బలపరుస్తూ రెం
నిమిషాల సేపు మాట్లాడదలచుకున్నాను. కేంద్ర ప్రభుత్వము భారత దేశము
ప్రధానంగా 14 భాషలను గుర్తించింది. ఈ 14 భాషలలో తెలుగుభాష ఒక
మనకు ప్రత్యేకంగా ఆంధ్ర రాష్ట్రము యేర్పడింది. అయినప్పటికినీ మన ప్రభు
కార్యకలాపాలు తెలుగుభాషలో నడుపుకోటానికి మనము ముందుకు రా

Sri S. Brahmayya] [29th September 1955

పోతున్నాము. కారణమేమిటంటే రెండువందల సంవత్సరాలుగా బ్రిటిషువారు మన భారతదేశాన్ని పరిపాలించారు. వారి పరిపాలనా కాలములో ఇంగ్లీషు భాషలో ప్రవేశము వుంటేనేగాని మనకు వుద్యోగము లభించదనే ఉద్దేశ్యముతో మన భారతీయులందరు యింగ్లీషు భాషనే నేర్చుకుంటూ వచ్చారు. ఆ విధంగా యింగ్లీషు భాష నభ్యసించినవారికే ఉద్యోగాలు లభించుచూ వచ్చాయి. ఉదహారణకు మన రాజకీయ దురంధరులుగా పరిగణింపబడిన రాజాజీని తీసుకోండి. ఆయనకూడా బి.ఎ. పరీక్షలో తన మాతృభాషలో తప్పిపోయినారు. దీనికి కారణమేమిటంటే, మాతృభాష అంటే అందరికినీ లక్ష్యముగా వుండేదికాదు. ఇంగ్లీషు భాషయే ఎక్కువగా ప్రచారములోకి తీసుకొనివచ్చారు. ఇంగ్లీషు భాషలో ఉత్తీర్ణులైన వారికే ఉద్యోగము వెంటనే దొరుకుతుందని అప్పట్లో వున్న ప్రజలయొక్క ఉద్దేశ్యము. అందువల్ల యింగ్లీషు భాషనే యెక్కువగా అభ్యాసముచేస్తూ వచ్చేవారు. ఇప్పుడు మన భారతదేశానికి స్వాతంత్ర్యము లభించింది. బ్రిటిషువారు వెళ్లిపోయారు. భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విభజించటానికి అందరూ అంగీకరించారు. దానితో పాటు మనకు ఆంధ్రరాష్ట్రము ఏర్పడింది. ఇక మన ఆంధ్రులకు తెలుగు భాషా రాష్ట్రముగా ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాతగూడా మన ప్రభుత్వ కార్యకలాపాలు యింగ్లీషు భాషలోనే నడుపుకోవడం సమంజసముకాదు. పోయిన బడ్జటు సమావేశములోకూడా యీ విషయము మంత్రివర్గానికి విన్నవించుకుని వున్నాము. ఇప్పుడు మన సోదరుడు గోపాలకృష్ణయ్యగారు తెచ్చిన యీ తీర్మానము పైన కాళేశ్వరరావుగారి సవరణను ఉపపాదించడము జరిగింది. వారు చెప్పినది "అతి త్వరలోనే" అని ప్రతిపాదించారు. అంటే మా వుద్దేశ్యము," అతి త్వరలో, వీలు అయినంత త్వరలో "యీ కార్యకలాపాలు అన్నికూడా తెలుగుభాషలోనే నడపాలన్నమాట. ఇంతకుముందు ఎప్పుడో తూర్పు గోదావరి జిల్లాలో ప్రభుత్వ కార్యకలాపాలు తెలుగుభాషలో నడపవలసిందిగా ప్రభుత్వము ఆదేశించింది. కాని అక్కడ తెలుగుభాషలో కార్యకలాపాలు సక్రమంగాను, సౌలభ్యంగాను జరగలేదని కొంతమంది చెబుతూవచ్చారు. మధ్యలో కుంటుబడినట్లుగా అయింది. ఇది సరియైన పద్ధతికాదు. ఆ మరుసటి సంవత్సరమే మరొక జిల్లాలో క్రమక్రమంగా స్థానిక సంస్థలలోనూ, జిల్లాలలోనూ ప్రభుత్వ కార్యకలాపాలు తెలుగుభాషలో నడపటానికి ప్రభుత్వము ప్రయత్నించి యున్నట్లయితే యీ కార్యకలాపాలు అన్నీ యీ రోజుకు తెలుగులోనే నడపటానికి సంసిద్ధులముగా వుండేవారమే. కాని దానికి ఏ మాత్రము అవకాశము యివ్వని కారణముచేత, ఇందులో progress కన్పించలేదు. అందువల్ల యీ విధంగా ఆలస్యము జరిగింది.

29th September 1955] [Sri S. Brahmayya

మరొక విషయము. భారతదేశము రెండు ఖండాలుగా విభజించబడినప్పుడు, (West Bengal) పశ్చిమ బెంగాల్ (East Bengal) తూర్పు బెంగాల్‌గా విభజించబడింది. తూర్పు బెంగాలులో వుండే భారతదేశము పాకిస్థాన్‌లోకి వెళ్లింది. అక్కడ ప్రభుత్వ పరిపాలన అంతా ఉర్దు భాషలోనే సాగాలి అనేది అక్కడ వంగ దేశీయుల మీద ఎత్తిడి తెచ్చినప్పుడు, వారు దానికి ఒప్పుకొనక "మేము వంగ దేశస్థులము, మాది వంగభాష కాబట్టి, ప్రభుత్వ కార్యకలాపాలు ఉర్దు భాషలో జరగటానికి వీలులేదు, మాకు ఉర్దుతో నిమిత్తం లేదని వంగభాషలో జరగాలని చెప్పి ప్రభుత్వ కార్యకలాపాలు వంగ భాషలోనే జరగాలని ఆందోళన చేశారు. దాన్నిబట్టి అక్కడ ప్రాంతీయ భాషగా వున్నవారి మాతృభాషలోనే కార్యకలాపాలన్నీ జరిగితే పరిపాలన సౌలభ్యముగా వుంటుందనే విషయము ఆ ప్రభుత్వమువారు గుర్తించారు. ఇతర దేశాల విషయముగూడాచూస్తే, ఆయాదేశాలలో ఆయా భాషలలోనే కార్యకలాపాలు జరగడము లేదా? కేవలము భారతదేశములో యింతవరకు యింగ్లీషు భాషకు అలవాటు పడిన మనము యింకనూ యీ యింగ్లీషు భాషలోనే కార్యకలాపాలు జరుపుకోవాలనే ఉద్దేశ్యము ఇకమీదట ఎందుకు ఉండాలి? ఆ భాషను వీలు అయినంత త్వరలో విడిచిపెట్టి, ఆ విధానమునంతయు మార్చవలసిందిగా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాము. కాబట్టి వీలుఅయినంత త్వరలో మన ప్రభుత్వ కార్యకలాపాలు యింగ్లీషు భాషలో జరపడము తగ్గించి తెలుగుభాషలో నడపవలసిన అవసరము వున్నది. గనుక మరల వారికి విన్నవించుకొంటున్నాను. విశాలాంధ్ర ఏర్పడినట్లయితే, తెలుగు మాట్లాడే యావన్మంది యొక్క సంఖ్య భారతదేశములో హిందీ భాష మాట్లాడే వారికి తరువాత స్థానమును సంపాదించినట్లవుతుంది. హిందీ భాష వారి తరువాత యితర భాషల వారికన్న తెలుగుభాష మాట్లాడేవారే ఎక్కువమంది వున్నారు. ఈసంగతి మన ప్రభుత్వానికే కాకుండా, భారత ప్రభుత్వానికి గూడా తెలుసు. మనఆంధ్రులు ఎక్కడెక్కడ వున్నప్పటికినీ అందరుచేరి సుమారు నాలుగు కోట్ల పైగా వున్నారు. అంటే మన తెలుగు భాష మాట్లాడేవారి సంఖ్య భారత దేశములో రెండవ స్థానము ఆక్రమించుకొని వున్నది. ఈ విషయము మన మంత్రి వర్గానికి తెలియజేస్తున్నాను.

The Hon. SRI K. VENKATA RAO :—బ్రహ్మయ్యగారు హిందీ భాష మాట్లాడేవారు నాలుగు కోట్లు అని అంటున్నారు.

[29th September 1955

SRI S. BRAHMAYYA :—లేదండి. తెలుగు భాష మాట్లాడేవారే భారతదేశములో ఎక్కడవున్నప్పటికినీ నాలుగు కోట్లు పైగా వున్నారని చెప్పాను. ఈ సంగతి మంత్రిగారు గుర్తించాలి.

THE HON. SRI K. VENKATA RAO :—Census లెక్కల ప్రకారము ఆంధ్రులయొక్క సంఖ్య 3 కోట్ల 51 లక్షలే వున్నట్లు తెలుస్తున్నది. మిగిలిన 49 లక్షలు యీ మధ్య బ్రహ్మయ్యగారు కలిపారేమో నాకు తెలియదు.

SRI S. BRAHMAYYA :—సరిగా లెక్కచూస్తే నాలుగు కోట్లకు తగ్గదని మంత్రిగారికి తెలియజేస్తున్నాను. ఈ లెక్కలు సరియైనవేనని మంత్రిగారు తెలుసుకోవలసిందిగా కోరుతున్నాను. కేవలం ఆంధ్ర రాష్ట్రములో వున్నవారి సంఖ్యేకాదు. తెలంగాణాలో వున్నవారేకాదు. ఇంకను తెలుగు సరిహద్దు ప్రాంతాలలోనూ, యితర రాష్ట్రాలలోనూ వున్నవారి సంఖ్య అంతా లెక్కచూస్తే, యింకా ఎక్కువే అవుతుంది.

THE HON. SRI K. VENKATA RAO :—United Provinces లో వున్నవారి సంఖ్య 89 మందికూడా చేర్చుకుని కలుపుకొంటేగూడా 3 కోట్ల 51 లక్షలకంటే మించదు.

Sri S. BRAHMAYYA :—లేదండి. బహుశ వెంకట్రావుగారు 1950 వ సంవత్సరపు Census లెక్కలను బట్టి చెబుతున్నారేమో ననుకుంటాను. ఇప్పుడు కేవలము తెలుగు భాష మాట్లాడేవారు ఎక్కువ మంది వున్న కారణముచేతనే కేవు రాష్ట్ర నిర్మాణము జరిగేటటువంటి పద్ధతిలో, తెలుగు రాష్ట్రాలు రెండుగా ఏర్పడబోతున్నవి. ఈ విషయముగూడా మంత్రిగారు గుర్తించాలి. తెలుగు భాషయొక్క ప్రాముఖ్యత, దానియొక్క—Interruption.

ఆ విధంగా ఏర్పడబోతున్నప్పటికినీ దాన్ని గురించి fight చేస్తున్నాము. అది వేరు సంగతి

MR. SPEAKER :—మీరు అధ్యక్షులవారిని address చేస్తూ మాట్లాడాలి. సభ్యులతోనూ మంత్రితోను address చేస్తూ మాట్లాడకూడదు.

SRI S. BRAHMAYYA :—అందుచేత నేను మనవిచేసేది యేమిటంటే, మన తెలుగువారి కందరికి తెలిసేటట్లుగా ప్రభుత్వ కార్యకలాపాలు తెలుగులోనే

జరపాలి, తెలుగులోనే మాట్లాడాలి, అనే పద్ధతి యిప్పటినుంచి జరుపుకుంటే, మనకు ప్రభుత్వానికి మధ్య జరిగే వుత్తర ప్రత్యుత్తరాలు అన్నీకూడా తెలుగులోనే జరిగేటట్లు చేసుకుంటే పరిపాలనకు ఆంధ్ర ప్రజలకు అందరికి సౌకర్యముగా వుంటుందని మనవిచేస్తూ, యీ సవరణను అందరము ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతూ విరమిస్తున్నాను.

SRI K. SUBBA RAO:—అధ్యక్షా, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి తీర్మానాన్ని, కాశీశ్వరరావు పెట్టిన సవరణతో సహా నేను బలపరుస్తున్నాను. మొట్టమొదటగా భాషా రాష్ట్రము అనేది తెలుగు వారికి లభించినది. అది ఆంధ్రుల యొక్క అదృష్టము. కాని భాషా ప్రయుక్తరాష్ట్ర విభజన ముఖ్య సూత్రము ప్రజాస్వామ్య సిద్ధాంతాల ప్రకారము రాష్ట్ర పరిపాలన ప్రజల భాషలో జరిగినప్పుడే ప్రజాస్వామ్యము సుస్థిరమైనదనే కారణము చేతనే భాషాప్రయుక్త రాష్ట్ర విభజనకు పట్టుబట్టి దీనికి గాను అనేకమంది దీక్ష వహించి పనిచేసి కట్టకడపట ప్రాణార్పణ చేసిన తరువాతనే ఈ అవకాశము మనకు లభించినది. కాని ఆ అవకాశము లభించి రెండు సంవత్సరములైనా తెలుగు భాషలో రాష్ట్ర పరిపాలన జరగడము లేదు. రాష్ట్ర పరిపాలన తెలుగులోనే జరగవలసినదని తీర్మానము ఇప్పుడు రావడము దురదృష్టమే. ఎందువల్ల జరగడము లేదో కారణములను మనము గమనించాలి. ఈ కారణములను బట్టి చూస్తే బానిస భారతదేశము భావదాస్యము మీదనే గాక భాషా దాస్యము కూడా అనుభవించాము. ఈనాటికి కూడా పెద్దలందరు భావ దాస్యములోనే గాక భాషాదాస్యములో మునిగి వున్నారు. చాలామంది దేశాభిమానులు, రాష్ట్రాభిమానులు రాష్ట్రము కావాలనేవారు అందరూకూడా దేశంలో భాషాదాస్యములో పడిపోయారు. వారు భాషాదాస్యమును అంగీకరించి తగిన తెలుగు పదాలు దొరక్కుండా ఇంగ్లీషు పదాలు వాడుతూ తెలుగును కూడా ఇంగ్లీషుగా మార్చేటటువంటి అవకాశము మేము కలుగచేస్తున్నాము. రాష్ట్ర పరిపాలన యావత్తూ తెలుగులోనే జరపాలనే దానికి ముందు రాష్ట్ర శాసన సభ్యులు యావన్మంది పట్టుదలతో ఏ ఉపన్యాసములో కూడా ఇంగ్లీషు పదము అనేది ప్రయోగించకుండా ఉపన్యాసము చేసేటటువంటిది మొట్టమొదటగా నేర్చుకుంటే చాలా చక్కగా జాగ్రత్తగా ఈ పరిపాలన అంతా కూడా తెలుగు భాషలో జరుగుతుంది. రాష్ట్రమూ పరిపాలిస్తున్నటువంటి వారు తెలుగువారే కాకుండా ఇంకా ఇతర దేశములవారు కూడా ఇక్కడ వున్నారు. కాని అది వారితప్పు కాదు. ఈ దేశములో మూడు రకములైన భాషలు వున్నాయి. అవి రాజభాష, దేశభాష, మాతృభాష. మాతృభాషే దేశభాషగా గలవారు చాలామంది లేరు. అంతమాత్రముచేత దేశభాషతోనే కాకుండా, మాతృ

Sri K. Subba Rao] [29th September 1955

భాషతో పరిపాలన చేయాలని అడిగినప్పుడు నా మాతృభాష కర్ణాటకము. నేను తెలుగు భాషలో ఇంట్లో మాట్లాడను. కాని దేశభాష తల్లిభాష అంటే తల్లులకు తల్లి అయిన దేశము యొక్క భాష శ్రేష్ఠమైనదని, అవసరమైనదని, ఆచరణ యోగ్యమైనదని దానిని అందరూ అమలులో పెట్టడానికి తగిన ప్రయత్నము చేయ వలసినదని చెప్పి అందరూ కూడా ఒప్పుకొనేటటువంటి విషయమే. ఈ దేశ భాషలో ముఖ్యముగా పరిపాలన సౌకర్యాలకు అవసరమైన అనాదిగా వచ్చినది ఒక్క ఇంగ్లీషు పదాలే కాకుండా పార్శీ పదాలుకూడ ఎన్నో తెలుగులోకి దొర్లుకొని వచ్చినాయి. సాధారణముగా ఉర్దూ పదాలుకూడా వాడుతూ ఉంటారు. పల్లెటూరువారు వ్రాసేటటువంటి అర్జీల్లో ఇటువంటి ఉర్దూ పదాలు అనేకము ఎన్నో ఉంటాయి. వాటి నన్నింటినీ కూడా దూరము చేయడానికి తగినటువంటి పద జాలాన్ని, శబ్ద జాలాన్ని సృష్టించేదానికి ఏదో బ్రహ్మ సృష్టి అన్నట్లుగా ఒక సృష్టిని మనము చేసుకోవలసి ఉన్నది. తెలుగు భాషలో ఇంగ్లీషు పదాలకు తగినటువంటి తెలుగు పదములు, దిన దినము వాడేటటువంటి వాక్యాలకు కూడా తెలుగు పదాలు దొరకకుండా చాలా బాధ పడుతూంటేటటువంటి వ్యవహారము జరుగుతోంది. దీనికి గాను మంత్రిగారు మనఃపూర్వకంగా ఒక కమిటీవేసి ఇంగ్లీషు పదాలకు సరియైన తెలుగు పదాలు ఏవో సర్వజనులకు వాడుకొనే దానికి అవసరమైనటువంటి పదజాలాన్ని సమకూర్చి అచ్చొత్తించి, అందరికీ పంచిపెట్టి, ఇప్పుడు అందులో ముఖ్యముగా కార్యదర్శులుగా పనిచేసే వాళ్లకు, గుమాస్తాలకు యావన్మందికి కూడా ఆ పదజాలాన్ని పంపించే బాధ్యత వారి పైన ఉన్నది. అది త్వరితగతిగా చేసినప్పుడే ఈ పరిపాలన దేశ భాషలో జరగడానికి అవకాశము ఉంటుంది. ఇప్పుడు చాలామంది మాట్లాడుతూండేది గ్రామ్యభాష, లేక వాడుకభాష, లేక గ్రాంధిక భాష అని తెలియకుండా ఉన్నది. ఇప్పుడు కొంతమంది శాసన సభ్యులు అరసున్నలతో సహా మాట్లాడుతూంటారు. ఆ విధముగా మాట్లాడితే అది అందరికీ అర్థము కానటువంటి భాషగా తయారవుతోంది. అందువల్ల అందరికి ఆచరణ యోగ్యంగా ఉండేటటువంటి పదజాలాన్ని తయారు చేయాలి. ఒక పండితుని ఇంటికి చాకలి వచ్చినాడు. ఆయన ఆహారజకః అని అన్నాడట. అప్పుడు ఆ చాకలి వాడు అంతపేరు నాకు ఎందుకు బాబూ మీరే వుంచుకోండి అన్నాడట. ఇందులో అటువంటి ఇబ్బందులు ఉన్నాయి. అందువల్ల మన రాజ్యాంగమునకు అవసరమైన పదజాలాన్ని అందరకూ చెప్పాలి. మన కార్యదర్శులు మన ఆచరణలో వున్నటువంటిది ఫర్మానా అంటారు. లేకపోతే దరఖాస్తు అంటారు. రెడ్డి కరణములకు పంపించేటటువంటిది తాఖీదు అంటారు. తాఖీదు దరఖాస్తు అనేటటువంటి పదాలు ఎట్లా వచ్చినాయో దానికి ఏమి పదజాలములు తెలుగులో చేయాలో చూడాలి గాని దరఖాస్తు

అని, ఫర్మానా అని చెప్పకూడదు. అర్జీ అని చెప్పకూడదు. ఇటువంటి పదజాలాన్ని అంతనూ ఏరి, కూర్చి చక్కగా తెలుగు పదాలను వాటికి సమకూర్చే దానికి ఒక కమిటీని వేసి ఆ కమిటీ రిపోర్టును కార్యదర్శులకు ప్రభుత్వ అధికారులకు అందరకూ అందజేసేట్లయితే సాధ్యమైనంత తొందరలో ఈ భావదాస్యమును, భాషా దాస్యమును నిర్మూలించగలము. భావదాస్యము ఎట్లానో పోయింది. రాజ్యాంగాన్ని చేతిలోకి తీసుకున్నాము. ఇది యముక, యముకను, ప్రతి అణువు రక్తమునకు అంటుకున్నది. ఎంత తెలుగు తనము ఉన్నప్పటికి కూడా ఇంటికి స్నేహితుడు వస్తే ఇంగ్లీషు మాట్లాడితే గొప్పగా వుంటుందని మాట్లాడడము జరుగుతున్నది. ఇటువంటివి మాని ఇటువంటి వాటిని తగ్గించుకొనడానికి తగినటువంటి చక్కని పదజాలాన్ని తయారు చేసి "సాధ్యమైనంత త్వరలో" అని వారు చెప్పినట్లు 5 సంవత్సరములలో పరిపాలన అంతా తెలుగులో చేసే దానికి తగినటువంటి ప్రయత్నము చేయాలి.

పరిపాలన తెలుగులో జరపడానికి సంక్షిప్త లేఖనము, టైపురైటింగు లేదంటున్నారు. లేదనుట సరిగాదు. ఇప్పుడు ఉన్నది ఎట్లాగో ప్రభుత్వము వారు రోజు ఎంతో ధనము వ్యయము చేస్తున్నారు. కాబట్టి దీనిని కూడా దృష్టిలో పెట్టుకొని ఒక 25 మందికి తగినటువంటి భృతి ఇచ్చి నేర్పినట్లయితే నేర్చుకొనేవారు చాలామంది ఉన్నారు. ఇప్పటికే సంక్షిప్తలేఖనములో ఆరితేరి ఎటువంటి ఉపన్యాసములు అయిన కూడా చక్కగా వ్రాయగల సమర్థులు ఉన్నారు.

టైపురైటింగు మిషనులు ఇప్పటికే కొద్దిగా వున్నాయి. మన అసెంబ్లీ ఆఫీసులో కూడా కొన్ని వున్నాయి. ఎందువల్ల వాటిని ప్రోత్సహించి ఇంకా ఎక్కువగా తయారు చేయించే ప్రయత్నము ప్రభుత్వము చేయకుండా ఉన్నదో అర్థం కావడము లేదు. అక్కడక్కడ జిల్లాబోర్డు ఆఫీసులలో కూడా ఈ తెలుగు టైపు యంత్రములు ఉన్నవి. ఇప్పుడు ఉన్నవాటిని యింకా నాలుగైదు తీసుకొని ప్రభుత్వము కార్యకలాపములు జరుపుకొనుచు తరువాత ఇంకా కావలయునంటే వాటిని ఇంకా సంకుచిత పరచి చక్కగా అభివృద్ధి చేసుకొనవచ్చును. ఉన్నవాటిని మనము ఉపయోగించక కుండా, లేవు అని ఊరికే ఆరాటపడకుండా ఉన్న వాటితోనే మనము త్వరలో ఈ 5 సంవత్సరముల్లోనే సర్వ రాజ్య పరిపాలన కూడా చక్కని తెలుగు భాషలోనే జరిగే ఏర్పాటు చేయడానికి ఈ ప్రతిపాదించినటువంటి తీర్మానాన్ని, దానికి ప్రతిపాదించినటువంటి సవరణను వొప్పుకొంటారని, ఈ తీర్మానాన్ని ఏకగ్రీవంగా అందరు ఒప్పుకోవలసిందని చెప్పి మంత్రిగారు కూడా ఈ తీర్మానాన్ని ఒప్పుకొని వారు కూడా చక్కగా అభిమానముతో వ్యవహరించవలసినదని చెప్పి ప్రార్థిస్తున్నాను.

Sri T. V. RAGHAVULU:—అధ్యక్షా, ఈ రోజున గౌరవనీయులైనటు వంటి గోపాలకృష్ణయ్యగారు ప్రతిపాదించినటువంటి తీర్మానమును, శ్రీ కాశీశ్వర రావుగారు తీసుకు వచ్చిన సవరణతో పాటు నేను బలపరుస్తున్నాను. ఈ తీర్మానము పై నేను రెండు మూడు విషయములు చెప్పదలిచాను. తెలుగు భాషలో పరిపాలన జరగాలనే దానిలో ఎవరికీ ఎటువంటి వాదాలు లేవు. అయితే ఆచరణలో ప్రభుత్వము దైనందిన కార్యకలాపాలు తెలుగులో జరగడము వారికి వున్నటువంటి సాధక బాధకాలను గుర్తించి మనము కొంచెము ఆలోచించ వలయును. అందువల్ల కాశీశ్వర రావుగారు తీసుకు వచ్చిన "వీలైనంత త్వరలో" అనే సవరణ అక్షరాలా చాలా అవసరము అవుతుందని నేను భావిస్తున్నాను. కొంతమంది తీర్మానాన్ని బలపరచేవారు, కొంతమంది సవరణను బలపరచేవారు చెప్పినది ఏమిటంటే, భావదాస్యంతో పాటు భాషాదాస్యముకూడా వచ్చిందని చెబుతున్నారు. అందులో వారు ఇంగ్లీషుభాష పట్ల వెలిబుచ్చిన భావాలు కొన్ని కొన్ని వెగటుగా కూడా వున్నాయని నేను మనవి చేస్తున్నాను. భాష అనేది ఒక జాతిని సృష్టించడానికి ఏక గర్భ జనితుల మధ్య వుండేటటువంటి ప్రేమానురాగాలు ఏ విధముగా వుంటాయో భాష ఆ విధముగా పని చేస్తున్నదనే విషయాన్ని గురించి ఎవరికీ ఎటువంటి సందేహము లేదు. భాషకు కూడా ఎల్లలు అనేవి ఉన్నాయి. సాహిత్యము చాలా గొప్పది. అందులో సాహిత్యానికి ఎల్లలు అంటూలేవు. ఇంగ్లీషు భాష చారిత్రాత్మకంగా నేర్చుకోవడము జరిగినది. అంతమాత్రముచేత ఆంగ్లేయుల పట్ల మనకు నిరసన ఏదైనా వుండవచ్చును గాని, ద్వేషము వుండవచ్చును గాని, భాష పట్ల ఎటువంటి ద్వేషము పనికిరాదు. ఆంగ్లభాష నేర్చుకున్నవారి పట్లకూడా ఎటువంటి దురభిమానము అనేది పనికి రాదు. తూర్పు గోదావరి జిల్లాలో తెలుగు భాషకు మచ్చుకు ఒక ప్రయోగము చేసినట్లు కన్పించుతున్నది. అది ఎంతవరకు సంతృప్తిగా జరిగినది అనేది మంత్రిగారు చెబితే వినడానికి మేము కుతూహల పడుతున్నాము. ఎందుచేత అంటే ఇంతవరకు జరిగిన కార్యకలాపాలు ఎంత సంతృప్తికరంగా వున్నాయి అనేది ప్రజలకు పరిపాలకులకు మధ్య సన్నిహితత్వము సాధించడములోను, ప్రభుత్వము పరిపాలను సులభతరము చేయుడంలో సౌలభ్యము సాధించడములోను ఎంతవరకు వుపయోగ పడుతుందనే విషయము కూడా ప్రభుత్వమువారు కూడా గమనించడము అవసరము అని మనవి చేస్తున్నాను. కోర్టుల వ్యవహారములు పాఠశాలల్లో బోధనా వ్యవహారములు కూడా 1, 2 విషయాలు చెప్పాలి.

సాహిత్యం మనకు తెలుగులోఉన్నదని చెబుతున్నాము. మనసాహిత్యం అంతా కూడా సమాజంలో ఆ రోజున ఉండే కావ్యాలు, పురాణాలు మాదిరిగా ఉన్నవి.

29th September 1955] [Sri T. Raghavulu

ఆధునిక ప్రపంచంలో ఉండే శాస్త్రాలను మన సాహిత్యంలో చేర్చడానికి కావలసిన కృషి ఎంతవరకు జరిగింది? Shorthand ను సంక్షిప్తలేఖనం అని చెప్పుకోడంలో భావదాస్యం లేదని ఎంత చెప్పుతున్నా అందులో కూడా భావదాస్యం ఉన్నదని నేను మనవి చేస్తున్నాను. నేను ఒకప్పుడు Chemistry చదువుకోడంలో Corbon di-oxide అంటే కర్బనద్వి ఆమ్లజనితం అని చదువుకున్నాను. జనితం, జనితం అంటే వేరు. నోరు అంతా సర్కసులోవలె తిరిగితే తప్ప ఉపాధ్యాయుడు పిల్లవాడు అన లేడు. సాహిత్యాన్ని సృష్టించుకోవటం ఆధునిక ప్రపంచానికి కావలసిన సాహిత్యం ఇతర సాహిత్యాలను శాస్త్రాలను తెచ్చుకోనప్పుడు మనం కోరే విప్లవకరమైన మార్పులు, మనం అనుకొనే కోరికలు నెరవేరవు అని అనుకుంటున్నాను. సాధ్యమైనంత త్వరలో, వీలైనంత తొందరలో ప్రభుత్వంవారు ప్రజలకు సన్నిహితంగా ఉండేటందుకు ప్రజలు చేసే పనులు ప్రభుత్వంవారి పరిపాలన అర్థమయేందుకు తెలుగులోనే కార్యకలాపాలు జరగడం ఉత్తమం. అట్లా చేయడానికి ప్రభుత్వం వారు కూడా ప్రయత్నం చేస్తారని అనుకుంటున్నాను. ప్రభుత్వ పక్షంలో కూడా గవర్నమెంటు పద్ధతి సంతృప్తికరంగా లేదని నేను కర్ణాకర్ణిగా వింటున్నాను. ఆంగ్లభాషలో అలవాటు పడినవారు మనభాషలోనికి రావడానికి కష్టపడేవారు చెప్పేమాటై ఉంటుంది. పట్టుదలతో ప్రయత్నిస్తే తెలుగులో మనం పరిపాలన చేసుకోడానికి కావలసిన సాహిత్యం, పరిభాష సృష్టించుకోవచ్చును. గవర్నమెంటువారు ప్రయత్నంచేసి తప్పనిసరిగా ఈ తీర్మానం అమలు చేయడానికి ప్రయత్నాలు చేస్తారని మనవి చేస్తున్నాను. ప్రభుత్వ కార్యకలాపాలకు సంబంధించిన ఒక చిన్న సలహా మనవి చేస్తున్నాను. వ్యక్తులనుంచి రాష్ట్రాలవారిగా జిల్లాలవారిగా పోయేటటువంటివి కొన్ని రాష్ట్రాలనుంచి వ్యక్తుల వరకు పోయేటటువంటివి చాలా అరుదుగా ఉంటాయి. రాష్ట్రాలనుంచి జిల్లాల స్థాయిలో ఉద్యోగులద్వారానే పోతుంటాయి. వ్యక్తికి సరాసరి పోయే కాగితాలు ఎక్కువ ఉండవు. క్రిందనుంచి పైకి పోయే కాగితాలు అయినా తెలుగులో ప్రారంభిస్తే బాగుంటుంది అని సలహా చేస్తూ ఈ సూచన ఎంత వరకు ఆచరణ యోగ్యమో ప్రభుత్వాన్ని ఆలోచించాలని కోరుతూ సవరణ రూపంతో ఉంచి తీర్మానాన్ని బలపరుస్తూ నేను విరమిస్తున్నాను.

Sri Ch. S. R. V. P. MURTHY RAJU:—అధ్యక్షా, ఆంధ్ర రాష్ట్రం సంపాదించిన తరువాత మన మందరము ఆంధ్రంలోనే కార్యకలాపాలు నడపాలనే సిద్ధాంతంతో ప్రజలందరు మనలను ఎలెక్షన్లలో ఎన్నుకొని పంపించారు. మొదట ఆంధ్రరాష్ట్రము తీసుకువస్తాము. అన్నాము. ఇచ్చారు. తరువాత ఆంధ్ర రాష్ట్రంలో తెలుగు ప్రవేశపెడతామనే ఉద్దేశంతో ఇచ్చారు అని నా ఉద్దేశం.

ప్రజలందరూ ఆ ఉద్దేశంతో ఉన్నప్పుడు వారి ఉద్దేశాన్ని మన్నించే శక్తి ఉన్నప్పుడే మనం ఈ అసెంబ్లీలో ఉండడానికి అర్హులము. లేకపోతే మనకు ఆ అర్హత లేదు. తెలుగుభాష గురించి నేను తర్జన బర్జన చేయవలసిన పనిలేదు. నా ఉద్దేశం తీర్మానం ఒకరు తీసుకొని రాకుండానే ప్రభుత్వం ఈపాటికి తెలుగులో నడపవలసి యున్నది. ఇప్పుడు కొన్ని కారణాల వల్ల చేయలేకపోతున్నాం అంటున్నారు. Typewriters లేవు తెలుగులో పనిచేయడానికి అని అంటున్నారు. Typewriters కోసము మీరు ఎంతవరకు ప్రయత్నం చేశారని గవర్నమెంటును అడుగుతున్నాను. ఈ సందర్భంలో ప్రతిపక్షమని, గవర్నమెంటు పక్షం అనే విచక్షత లేదు. ఎవరు తీసుకు వచ్చినా ఒకటే. ఈ గవర్నమెంటులో పరిపాలన చేసే వారందరికి ఎక్కువగా ఇంగ్లీషు వచ్చును. తక్కువగా తెలుగు వచ్చును. అందుచేతనే బాధపడుతున్నారు.

THE HON. SRI K. VENKATA RAO:—మూర్తి రాజుగారు పొరపాటు పడుతున్నారు. మాకెవ్వరికి తెలుగు వచ్చినంతగా ఇంగ్లీషు రాదు. నాకు మట్టుకు రాదు. మిగిలిన వారందరూ కూడా అంతే. చంద్రమౌళిగారు వ్రాసిన అత్యద్భుతమైన రామాయణాన్ని వారు చూచి ఉంటే వారికి ఇంగ్లీషు వచ్చునో, తెలుగు వచ్చునో తెలియగలదు.

SRI CH S. R. V. P. MURTHY RAJU:—వెంకట్రావుగారు అపార్థం చేసుకొన్నారు. చివరవరకు విని ఉంటే బాగుండేది. కార్యకలాపాలు జరిపేది మంత్రులు మాత్రమే కాదు. తెలుగు తెలిస్తే నడుపుకోడానికి అడ్డుఏమి? అది మన చేతకానితనం అని చెప్పాకోవాలి. ఇందులో ఉండే రహస్యం ఏమిటంటే, మాకు తెలుగు బాగా వస్తే files తెలుగులోనే నడిపితే క్రింద ఉన్న వారందరు తెలుగులోనే నడుపుతారు. మీరు చెప్పినట్లు తప్ప మరొక విధంగా వ్రాయలేరు. ఇంగ్లీషులో వ్రాయడం ప్రారంభిస్తే మీకంటె వారు బాగా వ్రాస్తామనే అహంభావం ఉండడంవల్ల ఆఫీసర్లు మీరు వ్రాసిన వ్రాతలకు వ్యతిరేకంగా వ్రాస్తారు.

THE HON. SRI K. VENKATA RAO:—గౌరవ సభ్యులు CH. S. R. V. P. అంటూ ఇంగ్లీషులో సంతకం చేసేబదులు తెలుగులో పెట్టినట్లు సంతకం చేయడం ప్రారంభిస్తే తరువాత మేముకూడా నేర్చుకోడం మొదలుపెడతాము.

SRI CH S. R. V. P. MURTHY RAJU:—తెలుగుకు అంత విలువ ఇస్తామంటే తెలుగులోనే పెడతాము. ఇంగ్లీషుకు తప్ప విలువ యివ్వరేమోనని భయంతో ఇంగ్లీషులో పెడుతున్నాము తప్ప మరొకటి కాదు.

పార్లమెంటు విధానం తప్పకుండా అసెంబ్లీలో తెలుగులోనే మాట్లాడవలసి యున్నది. విద్యార్థులకు స్కూళ్లల్లో తెలుగు నేర్పుతున్నాము. కాని ఇంగ్లీషు పదాలే వాడుతున్నారు. ఈ పార్లమెంటు విధానానికి సరిపోయే పదాలుకోసమై కమిటీవేసి నిర్ణయించి వాటినే స్కూళ్లలో నేర్పించాలి. మనకు తెలుగు బాగా తెలిసిన మంత్రులున్నారు. తెలుగుబాగామాట్లాడే శక్తిమంతులున్నారు. ఇటువంటి సమర్థులు ఉన్నప్పుడే తెలుగు తీసికొనిరాకపోతే మరొకప్పుడు రాదు. ఇప్పటికైనా తెలుగు బాగా వచ్చుననే మంత్రులు తెలుగులో కార్యకలాపాలు చేయించే ఏర్పాట్లు చేయించి, తెలుగు ఔన్నత్యాన్ని గుర్తించి, మన అసెంబ్లీలో ప్రారంభించాలని కోరుతున్నాను. మన కార్యక్రమాలు తెలుగులో చేస్తేనే ఆంధ్రరాష్ట్రం తెలంగాణా కలవాలని కోరడంలో అర్థం ఉంటుంది. తెలుగులో నడపడం చేతకాకపోతే వారందరు మనతో కలవాలంటే ఇంగ్లీషు నేర్చుకోవాలంటామా ? మనం తెలుగు నేర్చుకుందాము. మనమందరము తెలుగుతప్ప మరొకటి వాడము అని నిర్ణయించుకొని పిటిషనులు; amendments, resolutions అన్నీ తెలుగులోనే ఇస్తుందాము. అప్పటికి వారు నేర్చుకొనకపోతే మనద్వారానైనా నేర్చుకుంటారు. అప్పుడే సగర్వంగా తెలుగులో అన్నీ నడిపించుకుంటున్నాము అని చెప్పగలుగుతాము. దీనికి కావలసిన పద్దాలు సమకూర్చడానికి ఒక కమిటీ వేయాలని కోరుతున్నాను. సవరణతో ఉన్న ఈ తీర్మానమును అందరూ ఏకగ్రీవంగా ప్యాసుచేస్తే మనకు తెలుగుమీద ఉన్న అభిమానం, రాష్ట్రాభిమానం, విశాలాంధ్ర కావాలనే అభిమానం తెలియచేసినవారం అవుతాము. అపుడే ప్రజలు మనలను ఇంటికి వెళ్లకుండా చూస్తారు. మెంబర్లందరూ సరైన పద్ధతుల్లో నడుస్తారని కోరుతున్నాను.

SRI M. VENKATA RAJU:—అధ్యక్షా, ఈ తీర్మానం ఇప్పుడు ఎసంబ్లీలో అనవసరం అని నా ఉద్దేశం. ఈ సిద్ధాంతాన్ని అంగీకరించారు. ఆంధ్రరాష్ట్రం ఇచ్చారు. దీనిని అంగీకరించి రెండు మూడు జిల్లాలలో తెలుగులోనే కార్యకలాపాలు జరగాలని మంత్రులు నిర్ణయించారు. ఇపుడు ఈ తీర్మానం ఎందుకో నాకు అర్థం కావడంలేదు. ఆంధ్రరాష్ట్రం వచ్చింది కాబట్టే నాబోటి ఇంగ్లీషురాని వారుకూడా మంత్రులుగా ఉండవచ్చుననే ధైర్యంతో అసెంబ్లీకి వచ్చాము. తెలుగులోనే ఉపన్యాసాలు ఇస్తున్నాము. వావిలాలవారి తీర్మానం అనవసరమని నా అభిప్రాయం. ఇదివరకే ఆ సిద్ధాంతాన్ని అంగీకరించాము. బ్రిటిషువాళ్లు వెళ్లిపోయిన తరువాత స్వరాజ్యం ఇవ్వాలని తీర్మానం పెడితే ఎలా ఉంటుంది? వావిలాలవారి సిద్ధాంతం అంగీకరించి రాష్ట్రం తెచ్చుకొని ఆంధ్రభాషలోనే కార్యకలాపాలు కొన్ని జిల్లాలలో సాగించడానికి ఆర్డర్లు వేశారు. భాష సంస్కరించాలట. 400 సంవత్సరాల

మహమ్మదీయుల పరిపాలనలో అనేక పదాలు తెలుగులో లీనమై పోయాయి. 400 సంవత్సరాలు మహమ్మదీయులు మనలను పరిపాలిస్తే అనేక ఉర్దూ, హిందీ పదాలు మన తెలుగులో లీనమైనాయి. ఈవేళ వాటిని తీసివేసి Sanskrit, పెడతారా? హిందీ పెడతారా? తహస్సీల్దారు తాఖీదు అనే పదాలు అట్లా వచ్చినవే. అలాగే ఇంగ్లీషులో కూడా. వంద సంవత్సరాలు బ్రిటిషువారు పరిపాలన చేసినందువల్ల అనేక పదాలు తెలుగులో కలసిపోయాయి. ఈ రోజున విశ్వ విద్యాలయాలలో ఇంగ్లీషును తీసివెయ్యాలని ప్రయత్నం చేస్తున్నారు. దానికి 20 గాని 25 సంవత్సరాలుగాని పడుతుంది. అయితే ఈనాడు Service Commission వారు B.A., ల Application లు మాత్రము తీసుకుంటారేగాని విశారద వారివి తీసుకోనరు. అది మాత్రం వినడు మన వావిలాల. యూనివర్సిటీ కోర్సులు క్రమేపి క్రమేపి తెలుగులోకి మారి పరీక్షలు తెలుగులో వచ్చినప్పుడు అట్లు జరగదు. ఇది పునాది. 10, 15 సంవత్సరాలలో విద్యావిధానం మారితే Service Commission వారు కూడా తెలుగులో అప్లికేషనులు పుచ్చుకుంటారు. తెలుగులోనే చరిత్ర వ్రాస్తారు. రేపు ఇంగ్లీషుపోయినా రాజభాష హిందికాబోతున్నది. హిందీలో అవసరంవస్తే మాట్లాడవచ్చును. ఆర్డర్లు ఇవ్వవచ్చును. ఇంగ్లీషు స్థానే Hindi మన పైన వస్తున్నది అనేది మరవకూడదు. ఎవరైనా ఆంధ్ర అసెంబ్లీలో హిందీలో మాట్లాడితే వావిలాల Censure motion evolve చేస్తాడా? ఇది ఇప్పుడు అనవసరం అంటున్నాను. ఇదివరకు అంగీకరించేము. ఆచరణలో ఉంది. ఈ తీర్మానము చర్చిస్తూ మనము ఈ అసెంబ్లీ కాలం వృధా చెయ్యకూడదు. అసెంబ్లీ సమావేశానికి చాలా డబ్బు ఖర్చు అగుచున్నది. మనకు Bata ఇస్తున్నారు. ఇటువంటి తీర్మానములను ఎందుకు తీసుకురావలెను? జాతికిలేది, జాతి క్షేమానికి అవసరమైన మంచి తీర్మానములు తీసుకొనివస్తే సంతోషమే. పెళ్లి అయిపోయి బిడ్డలు పుట్టిన తరువాత మొగుడు, పెళ్లాం కూర్చొని తందనాలాడి, తలంబ్రాలు పోసుకున్నట్లుంది, ఈ వావిలాలగారి తీర్మానము. కాబట్టి దానివల్ల ప్రయోజనంలేదని మనవిచేస్తూ శెలవు తీసుకుంటున్నాను.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, ఈ తెలుగుభాషలో మన వ్యవహారములు సాగించాలని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు తెచ్చిన తీర్మానాన్ని నా హృదయ పూర్వకముగా బలపరుస్తున్నాను. రేపు అక్టోబరు రెండవ తారీఖుకు రెండు సంవత్సరములు అగుతున్నది మనకు రాష్ట్రంవచ్చి. ఆంధ్ర దేశములో ఉన్న పెద్దలు ఆంధ్ర రాష్ట్రం వరకు అనేకమైన త్యాగాలు చేసేరు. అనేక కష్టాలు పడ్డారు. అయినా రాష్ట్రము రాలేదు. మనకు పూజ్యులు అయినట్టి శ్రీ పొట్టి

శ్రీరాములుగారు ఆంధ్ర రాష్ట్రము కొరకు తన ఆత్మను బలిచ్చిన తరువాత పూజ్యులైన భారత ప్రధాని నెహ్రూ రెండు సంవత్సరాలక్రితము స్వరాష్ట్రము ఇచ్చేరు. పరిపాలన తెలుగులోనే చెయ్యవలెనని, తెలుగులోనే మాట్లాడవలెనని మన సభ్యులందరు ఏకగ్రీవముగా ఆమోదించేరు మనకు పెద్దలు అయిన శ్రీ కాశీశ్వరరావుగారు ఆమోదించేరు. అయితే మన రాజుగారు మట్టుకు తెలుగులో ఇప్పుడే పరిపాలన జరిగితే చాలా డబ్బు ఖర్చు అగుతుందని చెప్పేరు. ఇది చాలా విచారకరమైనట్టి విషయము. కారణము ఏమిటంటే, మనము ఆంధ్ర రాష్ట్రము తెచ్చుకొన్నాము. ఆంధ్ర ప్రజలు నూటికి 99 పాళ్లు మనకు ఓట్లు ఇచ్చి పంపించేరు మన పరిపాలన తెలుగులోనే జరుగుతుందని. ఇప్పుడు అసెంబ్లీ జరుగుచున్నదంటే గ్రామాలలో ఉన్న ప్రజలు అంతా పత్రికలు చదివి మనము ఏమి చేస్తున్నామో తెలుసుకొంటున్నారు. అక్కడ చెల్లుబడి అయ్యే పత్రిక లేదానికో రుజువు. అలాంటప్పుడు యంత్రములు కొనడానికి డబ్బులేదంటే ఎట్లా? ఇప్పటికప్పుడే రెండు సంవత్సరములు అయినది మన రాష్ట్రము ఏర్పడి. అయిదవ క్లాసు చదువుకున్న వాడికి కూడా పరిపాలనా విధానము తెలిసేటట్లు ఉండాలి. ప్రజల వద్దనుండి 22 కోట్ల రూపాయలు సేకరిస్తున్నాము. ముఖ్యమైన పనికి డబ్బు లేదంటు అనవసర ఖర్చులు పెడుతున్నారు. తెలుగు తర్జుమా చేయించడానికి ఎంత ఖర్చైనా గోపాలరెడ్డిగారు చేయించాలని మనవి చేస్తున్నాను.

రేపు అక్టోబరు రెండవ తారీకున మన ఆంధ్ర రాష్ట్రావతరణ దినము వస్తున్నది. ఆదినమునాడు మన పూజ్యులు Potti Sreeramulu గారి సమాదిని మనరాజధానితో ఏర్పాటు చేసి ప్రజలందరు, గాంధిగారి సమాదిని పూజ చేసినట్లు, ఆ సమాదిని పూజ చేసేటట్లు గోపాలరెడ్డిగారి ప్రభుత్వం ఏర్పాటు చెయ్యాలని మనవి చేస్తున్నాను.

ఈ రెండవ పంచవర్ష ప్రణాళిక కాలం పూర్తి అయ్యేలోపుగా సమర్థులైన శ్రీ కళా వెంకటరావుగారు కొన్ని ఆఫీసులలో నైనా అంటే ప్రజలకు సంబంధించిన అగ్రికల్చరలు ఆఫీసు, పంచాయితీ బోర్డు ఆఫీసులలో నైనా రేపు అక్టోబరు ఒకటి నుంచి తెలుగులో తర్జుమాలుచేసే ఏర్పాటు చేయించవలెనని మనవి చేస్తున్నాను. ఇక్కడ ప్రశ్నలు వేసినా, మాట్లాడినా ఇంగ్లీషులోనే జరుగుతున్నది. నాలాంటి M.L.A. లకు ఏమీ అర్థము కాదు. ఈ విషయం అధ్యక్షులవారికి తెలిసినదే. మంత్రిగారు వ్రాసినది నాకు, నేను వ్రాసినది వారికి తెలియదు. కాబట్టి ఇంగ్లీషులో వ్రాయకుండా తెలుగులోనే మంత్రిగారు, కలెక్టర్లు వ్రాసేటట్లు చెయ్యవలెను. రాష్ట్ర పరిపాలన తెలుగులోనే జరగాలని శ్రీ గోపాలరెడ్డిగారి ప్రభుత్వానికి,

Sri P. Gunnayya] [29th September 1955

అధ్యక్షుల వారికి నా హృదయ పూర్వక వందనములను సమర్పిస్తూ నేను విరమిస్తున్నాను.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, గోపాలకృష్ణయ్య గారు తెచ్చిన తీర్మానాన్ని నేను బలపరుస్తూ మాట్లాడుతున్నాను. దానికి కాశీశ్వర రావుగారు తెచ్చిన సవరణ నామకః తెచ్చిన సవరణ. ఈ తీర్మానం గోపాల కృష్ణయ్యగారు తెచ్చారు కాబట్టి, దానికేదైనా సవరణ పెట్టాలనే ఉద్దేశ్యంతో తెచ్చిన సవరణ కాని, తీర్మానాన్ని సవరించి అందరం ఆమోదిద్దాం అనే ఉద్దేశ్యంతో పెట్టిన సవరణ కాని, ప్రతిఘటించాలనే సవరణ కాదు. ఇక్కడ మనం వేరువేరు పార్టీలుగా కూర్చున్నా నామకః కూర్చున్నాం కాని ఈ విషయంలో అందరం ఒకటే. అప్పుడప్పుడు ప్రభుత్వపార్టీలో కూడా చాలామంది ప్రభుత్వం తెచ్చిన తీర్మానాలకు కొన్ని సమయాలలో against గా మాట్లాడుతున్నారు. ఈ విషయంలో పార్టీ భేదాలు ఏమీ లేవు. ఆ సవరణలో ఏమంత పెద్ద తేడా ఏమీ లేదు. ఈ తీర్మానం అంతా ఒప్పుకున్నదే. మనం ఆంధ్రులం. మనం చెన్నరాష్ట్రంతో కలిసియున్నప్పుడు చెన్నరాష్ట్రం మొత్తంమీద Chief Ministers గా మన వాళ్లు పరిపాలించారు. ఇప్పుడిక్కడ మంత్రివర్గంలో యున్నవారు చెన్నరాష్ట్రంలో కూడా మంత్రులుగా యున్నారు. వారికి తెలుగంటే చాలా ఇష్టం. ఇప్పుడు Revenue Minister గారు foreign వెళ్లి చదివినప్పటికీ కూడా, తెలుగు పుస్తకాలంటే వారికి చాలా ఇష్టం. వారు తెలుగు గ్రంధాలు వ్రాస్తున్నారు. మిగతా మంత్రులందరికి కూడా తెలుగంటే చాలా ఇష్టం. Chief Minister గారు కూడా తెలుగుకవి. తెలుగు విద్వాంసులు కాని, తెలుగు పండితులు ఎవరువచ్చినా వారు చాలా గౌరవిస్తారు. మనం మదరాసు రాష్ట్రంతో కలిసియున్నప్పుడు, మనవారు అక్కడ Chief Minister లుగా ఉన్నా అరవలం, మనం కలసియుండుటచేత ఆంధ్రభాష ప్రభుత్వభాషగా పెట్టడానికి అవకాశంలేక మానుకున్నారు. మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చింది. మనం ఆంధ్రులమైయుండి, మనకు మన రాష్ట్రంవచ్చిన తరువాతకూడా, మన ఆంధ్రభాషలోనే పరిపాలించుకుందాం అనే అభిలాష ఉండి కూడా ఇంకా ఆలస్యం చేయడం ఏమీ సమంజసంగా లేదు 1947 సంవత్సరంలోనే Congress District Board లలో majority party గా ఉన్నప్పుడు, మా బోర్డులో మేము తీర్మానం pass చేశాం, కార్యక్రమమంతా తెలుగులో నడపాలని. మేము Telugu type writers ను తెప్పించి మా agenda, మా resolutions, minute book లు వగైరాలన్నీ కూడా తెలుగులోనే వేయించి కార్యక్రమమంతా తెలుగులోనే నడిపించాం. అప్పుడు విశాఖపట్టణం జిల్లా అంతా ఒకటిగా ఉంది

ఒకటే జిల్లాబోర్డు ఉండేది. ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాతకూడా ఈ విషయంలో ఇంకా వెనుకంజ వేయడం చాలా శోచనీయమైన విషయం. ఇకనైనా ఆలస్యం చేయకుండా తెలుగులో మన కార్యక్రమమంతా నడిపిస్తారని ఆశిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, వావిలాల గోపాల కృష్ణయ్యగారు తెచ్చిన తీర్మానం కాశీశ్వరరావుగారి సవరణతో చాలా సమంజసంగా ఉన్నదని మనవిచేస్తున్నాను. నరసింహప్పారావుగారు ఈ సవరణ కాంగ్రెస్ వాదులు ఏదో సవరణ తీసుకురావాలని తీసుకు వచ్చారు అని చెప్పారు. నేను ఆవిషయాన్ని అంగీకరించడంలేదు. ఈ సవరణ తీర్మానానికి ఒక shape ఇచ్చి, దాన్ని సక్రమమైన మార్గంలో పెట్టడానికి తీసుకువచ్చిందేకాని కాంగ్రెస్‌పార్టీ యొక్క గొప్పతనం చూపించుకోడానికి తీసుకురాలేదు. "This Assembly recommends to the Government, to conduct the business of the Government in Tejugu only" అన్నారాయన. ఎప్పటినుంచి అనే విషయం ఆయన పేర్కొనలేదు. అందుచేత కాశీశ్వరరావుగారు జాగ్రత్తగా ఆలోచించి "To conduct the business of the Government as Sarly as pocsible- వీలైనంత త్వరలో" అని దాన్ని సమర్థించి వ్రాశారు. ఈ తీర్మానం తీసుకువచ్చిన గౌరవం మేమే తీసుకోవాలని మాకేమీలేదు. ఈ విషయం ఈనాటిదికాదు. 1929 లో ఏనాడైతే భాషాప్రయుక్తరాష్ట్రాలను గురించి All India Congress తీర్మానంచేసిందో అప్పుడే ఆయా రాష్ట్రాలలోఉన్న భాషలోనే పరిపాలన జరగాలనే సిద్ధాంతం అంగీకరించబడింది. ఆంధ్రరాష్ట్రం రాకముందే East Godavari జిల్లాలో తెలుగులో గవర్నమెంటు వ్యవహారాలన్నీ జరగాలని, అది ఎంతవరకూ ఆచరణ యోగ్యంగా ఉంటుందో చూడడానికి అప్పటి ప్రభుత్వం ప్రవేశపెట్టారు. అది experimental గా ప్రభుత్వం అక్కడ ప్రారంభించింది, అందుచేత ఇదేదో క్రొత్తగా తెచ్చిన తీర్మానంకాదు. ఆంధ్రప్రాంతం మదరాసు గవర్నమెంటులో ఉన్నప్పుడే ఈ తెలుగు ప్రాంతంలో తెలుగులో పరిపాలనా వ్యవహారాలు జరపాలన్న సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ నడిపే ఉద్దేశ్యంతోనే ముందుగా ఒకజిల్లాలో ప్రవేశపెట్టారు. ఈనాడు భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పాటు చేసుకుంటున్నాం. అందువల్ల ఈ amendment ఈ తీర్మానానికి అనుకూలంగాఉండే amendment కాని, ఈ తీర్మానం ఆమోదించినంత మాత్రాన మా గౌరవమేమీ పోతుందని కాదు. కాంగ్రెసు ఈ సిద్ధాంతాన్ని 1929 సంవత్సరంలోనే ఆమోదించింది. ఆ సిద్ధాంతం ప్రకారమే దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, భాషాప్రయుక్త రాష్ట్రాలు అవసరం అనిచెప్పి, స్వాతంత్ర్యం వచ్చినతోడనే ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే

అదృష్టం మనకు కల్గింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ఇతర భాషారాష్ట్రాలు ఏర్పాటు చేయాలనే సిద్ధాంతంమీద ఫజలాలీకమిషన్‌ను ఏర్పాటుచేశారు. ఈవేళనో, రేపో ఆ report బైటకు వస్తుంది. అన్ని ప్రధానభాషలకు రాష్ట్రాలు ఏర్పాటు చెయ్యాలని ఆయా రాష్ట్రాలలో ఆ రాష్ట్రభాషను ఉపయోగించి పరిపాలన చేసుకోవాలని అప్పుడే సామాన్య ప్రజానీకానికి ప్రభుత్వ కార్యకలాపాలన్నీ బోధ పడతాయనే ఉద్దేశ్యంతోనే కాంగ్రెస్ మొదటినుంచి ఈ నిర్ణయం తీసుకుని దాన్ని ఎంత త్వరలో వీలైతే అంత త్వరలో ఆచరణలో పెట్టడానికి పూనుకుంది. ఈ తీర్మానంపట్ల ఎవరికి ఎట్టి సందేహంలేదు. అయితే కొన్ని కష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది. రేపటి ఉదయమే అన్నీ తెలుగులో ప్రారంభించాలంటే అది సాధ్యమైన పనికాదు అనేది ఇక్కడ కూర్చున్న సభ్యులకందరకూ తెలుసును. దేశంలోఉన్న ప్రజానీకానికికూడా తెలుసును. 150, 200 సంవత్సరాలుగా పరిపాలనా విధానం పరభాషలో జరుగుచున్న ఈ దేశంలో మనం క్రొత్తగా మనభాషద్వారా పరిపాలన సాగించాలంటే చాలా కష్టాలున్నాయి. ఇప్పుడు Science అనగా Physics, Chemistry ఇటువంటివి తీసుకున్నప్పుడు తెలుగుభాషలో బోధించాలంటే బోధపరచే మాస్టరుకుగాని విద్యార్థులకుగాని బోధపడదు. అందుచేత ఇది ఎంత శీఘ్రంగా వీలుపడుతుందో అంత తొందరలో ఆచరణలో పెట్టవలసిందని ఈ తీర్మానం మూలంగా ప్రభుత్వానికి చెబుతున్నాం. ప్రభుత్వంకూడా అదే ఉద్దేశ్యంతోయున్నది. ప్రతి ఆంధ్రుడు కూడా—ఆంధ్రుడే కాదు, ప్రతి రాష్ట్రవాసీకూడా—తన భాషను అభివృద్ధి చేసుకోవాలని, తద్వారా తన జాతి గౌరవం నిలబెట్టుకోవాలని ప్రయత్నంచేయడం సహజమే. ఈ తీర్మానం ఈ amendment తో అంగీకరించవలసినదని హృదయ పూర్వకంగా కోరుతున్నాను.

Sri M. NAGI REDDI :—అధ్యక్షా, ఇప్పుడు నేను వావిలాల గోపాలకృష్ణయ్యగారు తెచ్చినటువంటి తీర్మానాన్ని ఉన్నది ఉన్నట్లుగానే బలపరుస్తున్నాను. ఈ సవరణను వ్యతిరేకిస్తున్నాను. ఉమ్మడి రాష్ట్రంలో ఉన్నన్నాళ్ళూ మనకళలు, మన విజ్ఞానం, మన సారస్వతం, మనకవిత్వం ఇవన్నీకూడా అభివృద్ధి పొందాలంటే మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చిననాడే ఇది సాధ్యమవుతుందని తీవ్రమైన ఆందోళన చేయడం ఆంధ్రరాష్ట్రం సిద్ధించడం మనమందరం ఎరిగినదే. ఆంధ్రరాష్ట్రంవచ్చికూడా సంవత్సరాలు గడిచిపోతున్నాయి. ఐతే ప్రభుత్వ పక్షంలో లక్ష్మణదాసుగారు ఇతరులుకూడా ఇదేమీ క్రొత్తదికాదు. కాంగ్రెసు 1929 లోనే pass చేసింది మాకుకూడా ఇది అమలు జరపాలనే ఉన్నది, అని చెప్పవచ్చును. కాని pass చేసిన తీర్మానాలకు ఆచరణకు సాపత్యంఉన్నదా

అని మనం గమనించాలి. ఆంధ్రరాష్ట్రం వచ్చి రెండు సంవత్సరాలైనది. పరిపాలనా విధానంలో తెలుగుభాష ప్రవేశపెట్టడానికి ఏకొద్ది మార్పయినా వచ్చిందా అని ప్రశ్నిస్తున్నాను. శాసనసభా కార్యక్రమాలలో ఆ మార్పు కించతుకూడా లేదు ప్రజలు నిత్యము సంబంధంకలిగి బాధపడుతూవున్న Revenue Department, ఇంకా ఇతర department లలో కించిత్తయినా మార్పువచ్చిందా తెలుగు భాషలో ప్రజలకు అందుబాటులో ఉండేటట్లుగా చేయడానికి, అంటే ఏమీ చేయలేదు. Village officer లకు పైనుంచి వచ్చే కాగితాలన్నీ English లోనే వస్తూంటాయి. వారువ్రాసే B form కానివ్వండి, 6 నెంబరుఫారంమీద కానివ్వండి. మన మధ్యపుట్టి పెరిగిన Revenue Inspectorలు తహసీల్దారు ఐనప్పటికీ, order లన్నీ English లోనే వేస్తారు. అవి మునసబులకు తెలియవు. వాళ్లు అరు విధించినామంటే వీళ్లు 2, 3 రూపాయిలనుకొని ఏదో వ్రాసేస్తారు. ఏదో అర్డరు పడుతుంది. జమాబందీ వచ్చేటప్పటికి 12 నెంబరు account కూ, దీనికీ తేడా రావడం మళ్ళీ దిద్దుకోవడం అన్నీ జరుగుతూఉంటాయి. ఇప్పుడు Court ల విషయం తీసుకోండి. సాక్షులవాఙ్మూలాలు తెలుగులో వ్రాస్తారు. తీర్పుమాత్రం ఎందుకు English లో వ్రాయాలి? ఆ తీర్పు వాదికాని, ప్రతివాదికాని మళ్లీ ఎవరి దగ్గరకైనాపోయి private గా దానికు డబ్బిచ్చుకొని అప్పీలుకు grounds ఉన్నవో లేవో తెలుసుకోవాలి. జిల్లామునసబులకు తెలుగురాదా? జిల్లా Court లలో Judges తెలుగువాళ్ళేకదా? పోనీ High Court కు పోయేది ఇంగ్లీషులో వ్రాశారనుకోండి.

కోర్టు మునసబులకు, సాధారణంగా ఉండేటటువంటి జిల్లా మునసబులకు తెలుగురాదా? High Court కు పోతే, పై కేసులు, పై కోర్టుకు వెళ్లాయి అనుకొన్నప్పటికి కూడ జిల్లా కోర్టులలో జడ్జీ లందరు తెలుగు వాండ్లేకదా? అందువల్ల అందరికి తెలుగు వచ్చిన విషయమే కాదా? రానివారు ఒకరో ఇద్దరో ఉంటే ఉన్నారు. అలాంటి పరిస్థితులలో కనీసం వారు చేయవలసిన కార్యక్రమాలు కూడా ఎందుకు తెలుగు భాషలో నడపడానికి ఇంతవరకు కనీసమైన కృషినికూడ ప్రవేశపెట్టలేదు? ఆచరణలో కనబడటం లేదనేది మనకు స్పష్టంగా కనబడుతున్నటువంటి విషయం. అట్లాగే books, registers, forms ఇవి అన్నీ ఉన్నాయి అనుకోండి. వీటి అన్నిటిని అచ్చు వేయించేటప్పుడు కూడ ఇబ్బంది ఉంది అసలే ఆర్థికంగా లోటు ఉంది ఆంధ్ర దేశంలో. అట్లాగే స్థానిక సంస్థలు అన్నీ కూడా. వాటికి మళ్లి తెలుగురాని ప్రెసిడెంట్లు బోలెడు మంది వుంటే ఇంగ్లీషు తెలుగు రెండు వ్రాసి వేస్తారు. ఆ ఫారాలలో ఎందుకు? వాండ్లకు అర్థం అయ్యేది

ఏమి ఉంది? ఇంగ్లీషు తెలుగు ఎప్పుడైతే ఆ ఫారాలలో పెట్టారో, పేరు వ్రాయటానికి కూడ వోటు ఉండదు. అందువల్ల కనీసం అయినటువంటిది చేయటంలేదని, ఇటు నిత్యం పేద ప్రజలను, సాధారణమైన ప్రజానీకానికి అవసరమైనటువంటి కార్యక్రమాన్ని దేనిని కూడ అందుబాటులో లేకుండా చేస్తున్నారన్నది మాత్రం మనం చూస్తున్నాం. అయితే ఒకటి అనవచ్చు. కొన్ని సాంకేతిక పదాలున్నాయి. శాస్త్రి రిత్యా Science కు సంబంధించినటువంటి పదాలున్నాయి. మనకు ఇప్పుడు కనబడుతూనే ఉంది కదా. మన ఉపాధ్యక్షులైనటువంటి వాండ్లు అనేక మంది మేధావులు, తెలుగులో భాషా విజ్ఞానం సంస్కృతి అన్ని ఉన్నటువంటి అనేక పర్యాయపదములను వ్రాయగలిగినటువంటి వారు Assembly లో, బయటా ఉన్నారు. వాండ్లందరితో ఒక కమిటీ వేసి ఆ పదాలకు ఒక Encyclopedia తయారు చేయడానికి, Dictionary తయారు చేయడానికి, వీటికి ఏమైనా కృషిచేసి ఇంతవరకు ఇది చేశామనేటటువంటిది ఉందా? తహసీలుదారుగారు ఆర్డర్సు వ్రాయాలంటే ఇంగ్లీషు తప్పితే, మరొకటి వ్రాయలేరా? పంచాయితీ బోర్డు Executive Officers School Final చదువుకొన్న వాండ్లు, కర్త ఏకవచనంలో ఉంటే క్రియ వచ్చేటప్పటికి బహువచనంలో ఉంటుంది. వాండ్లు వ్రాసే ఇంగ్లీషు అంతా కూడా అంతే. అటువంటి వాండ్లు ఇంగ్లీషు తప్ప వేరు వ్రాయరు. మరి ఈ ప్రెసిడెంట్లు వేలి ముద్ర వాండ్లు కొంత మంది ఉన్నారు. సంతకం చేస్తే 40 వ నంబరు పాళీ విరిగే వాండ్లు కొంతమంది ఉన్నారు. వీండ్లందరికీ ఇంగ్లీషు రావడం అంటే, ఇది కనీసం అయిన కార్యక్రమాన్ని కూడ అమలు పరచడానికి ఏమి చేయడంలేదనేది స్పష్టంగా కనబడుతుంది. అయితే ఒకటి అంటున్నారు. ఇదివరకే చేశాం. మరి చేసేది ఏమి ఉంది అని వెంకట్రాజు గారు చెప్పారు. చేశారుగాని ఏమి అమలులోనికి వచ్చింది? రాలేదు. చేయడమే అనవసరం అని చెప్పుతున్నారు. ప్రభుత్వం ఒక కార్యక్రమం పుచ్చుకోలేదు. కాబట్టే దానికి ఒక తీర్మానం తెచ్చి కదలించవలసిన అవసరం ఏర్పడింది. దానికి కాళేశ్వరరావుగారు ఒక సవరణ పెట్టారు. ఈ సవరణ పెట్టే దానిలో ఉద్దేశం ఏమిటో నాకు అర్థం కావడంలేదు. నిన్న వారు చెప్పుతున్న ఉపన్యాసంలో ఎడమ చెయ్యికి, పుర్ర చెయ్యికి తేడా లేదన్నట్లు ఇప్పుడే కనబడుతుంది. ఎందుకని అంటే, మంత్రి వర్యులకు మనము ప్రశ్నలు వేసినప్పుడు, ఆంధ్ర దేశంలో తెలుగు ఎప్పుడు ప్రవేశ పెట్టుతారంటే, ఆలోచిస్తున్నాం అని అంటారు. ఎన్నాళ్లలో అంటే, వీలు అయినంత త్వరలో అని సమాధానాలు వస్తున్నాయి. వీలు అయినంత త్వరలో అని Kaleswara Rao గారు పెట్టడంలో అర్థం ఏమి ఉంది? మంత్రి వర్యులు చెప్పిన 'వీలు అయినంత

త్వరలో,' కాశీశ్వరరావుగారు చెప్పే 'వీలు అయినంత త్వరలో' ఈ రెంటికి తేడా ఏమి కనబడడంలేదు. అందువల్ల ఈ వీలు అయినంత త్వరలో అనేటటువంటిది ఒక ఖచ్చితమైనటువంటి నిర్ణయం కాదు. వావిలాల గోపాలకృష్ణయ్యగారు తెచ్చిన తీర్మానంలో ఏమైనా తేది నిర్ణయించారా? ఫలానా తేది అనేటటువంటిది, కాదు, వెంటనే చేయాలనేటటువంటిది, తెలుగు భాషలో నడపాలనేటటువంటి దానితోటే తీర్మానం తీసుకొని వచ్చారు. ఇప్పటికైనా ప్రభుత్వం చర్య తీసుకొని చేయాల్సిన అవసరం ఉంది. కనుక వీలు అయినంత త్వరలో అంటే, వావిలాల గోపాలక్రిష్ణయ్యగారి తీర్మానం అందరుకూడా ఏకగ్రీవంగా బలపఱచవలసిందని కోరుతున్నాను.

SRI P. VENKATASUBBAYYA :—అధ్యక్ష మహాశయా, భాషా ప్రయుక్తరాష్ట్రి పరిపాలన చేయాలన్నది తెలుగుభాషలోనే పరిపాలనా వ్యవస్థను జరపాలన్నట్టి వావిలాల గోపాలక్రిష్ణయ్యగారి తీర్మానాన్ని, కాశీశ్వరరావుగారి సవరణతో సహా నేను బలపరుస్తూ రెండు మాటలు చెప్పదలచుకొన్నాను. భాష అనేటటువంటిది ఒకమనిషియొక్క భావాన్ని, ఇంకొకరు గ్రహించేదానికి ఏర్పడినది. అనేక దేశాలలో అనేక భాషలు ఉత్పన్నమైనవి. ఇందుకుగాను భాషాభావాలను వెలిబుచ్చేదానికిగాను అనేక అక్షరామ్నాయము పుట్టినది. ఈ అక్షరామ్నాయంలో మన భాషకు అన్ని అక్షరామ్నాయములకంటే ఎక్కువ అక్షరాలు ఏర్పాటుచేసుకొన్నాము. మనవారు చేప్పింది బాగానేఉంది. నేను కవిత్వంమాత్రం చెప్పలేను. చెప్పదలచుకొన్నది రెండు మాటలలో చెప్పుతాను. ఇంగ్లీషుభాషకు 26 అక్షరాలున్నవి. అరవభాషకు 21 అక్షరాలుమాత్రమే ఉన్నవి :తరువాత ఉర్దుభాషకు 31 ఉంది. మనభాషకు 55 అక్షరాలు, అర్థానుస్వారం, పూర్ణానుస్వారం విసర్గలతో కలిపితే 55 అక్షరాలున్నాయి. సంస్కృతానికి 56 అక్షరాలున్నాయి. కనుక ఏ భాషఅయినాసరే, ఒకరి అభిప్రాయాన్ని ఇంకొకరికి తెలియజేయాలంటే ఆశబ్ద శాస్త్రవాన్ని సరిగా ఉచ్చరించేదానికి సరియైనటువంటి లిపిఉండాలేదా అనేటటువంటిది మనము ఆలోచించాలి. ఆటువంటప్పుడు మన భాష ఏశబ్దజాలమునైనా సరే, ఏ శబ్దాన్ని, అయినాసరే సరిగా ఉచ్చరించడానికి తగినటువంటి అక్షర సంపద కలిగిఉన్నటువంటిది మనభాష. ఇప్పుడు మనము పడుతూఉంటే అహోహా ఇంగ్లీషుభాష రాజకీయభాషగ ఏర్పడింది. ఈ రాజకీయభాషలో 26 అక్షరాలతోనే మన మందరము నిర్వర్తింకొంటూ ఉన్నాము. 56 అక్షరాలతో కలిగిన ఈ భాష సంపూర్ణవికాసం పొందినటువంటి భాషతో మన కార్యాలను నిర్వర్తించుకోవాలేదా అనేటటువంటిది ప్రశ్నిస్తున్నాను, కనుక మనము సమగ్రంగా నిర్వర్తించుకోడానికి

చేత అవును. ఇప్పుడు పాఠశాలలోకూడ, Historey, Geograppy ఇవి అన్నీ కూడ తెలుగులోనే చెప్పబడుతున్నాయి. సాంకేతికపదాలు ఇపుడు నేర్పుకుంటూ ఉన్నారు కనుక ఈ రాజకీయ పరిపాలనా విధానంలో ఉండేటటువంటి శబ్ద జాలానికి తగినటువంటి భాష ఇపుడు మనకు లేకపోలేదు. కనుక అది కష్టతరమైనటువంటిదికాదు. మనము చేసుకోవచ్చునకూడా ఇపుడు ఇంగ్లీషు భాషఉంది అంటే "put" "పుట్" అవుతుంది. "but" "బట్" అవుతుంది. ఎంత విలక్షణంగా ఉందో మీరు చూచుకోవచ్చు, తరువాత అరవభాష ఉందిఅంటే అది ఒక్కొక్క వర్గానికి ఒక అక్షరంఉంది. కవర్గానికి ఒక అక్షరం, టవర్గానికి ఒక అక్షరం, తవర్గానికి ఒక అక్షరం, ఒక్కొక్క వర్గానికి ఒక్కొక్క అక్షరంతో వాండ్లు కార్యనిర్వాహకం చేసుకొంటున్నారు. అక్కడ "క" ను, "గ" గ ఉచ్చారించవచ్చును. "త" ను "ద" గ ఉచ్చరించవచ్చును. తాతాచారివీధి అంటే దానిని దాదాచారి తెరువు అనికూడా చదువుకోవచ్చును. వాండ్లలాగా అటువంటి దురదృష్టము మనకు పట్టలేదు. మనకు సంపూర్ణవికాసము చెందిన భాష మనం ఉంచుకొనికూడ, దానిని రాజకీయంగా ఉపయోగించుకోలేక పోతున్నామంటే ఇది చాల దురదృష్టమని మనము అనుకోవాలి. తరువాత భాషను శాసనసభద్వారాను రాజకీయంద్వారాను మనము ప్రోత్సహించాలి. తక్కిన మార్గాలు లేవా అనేది మనము ఆలోచించుకోవాలి. ఇపుడు మనదేశంలో ఉన్నటువంటి ఉత్తమకవులు, ఉత్తమ రచయితలు కూడ ఉన్నారు. ఇటువంటి కవుల ఉత్తమ రచనలనుగాని, ఉత్తమ గ్రంథములను గాని, ప్రభుత్వం ఏల ప్రోత్సహించకూడదో నాకు అర్థము కాకుండా ఉన్నది. ఇపుడు ఆ స్థానకవిని ఒకరిని నిర్ణయంచేసింది, చాల సంతోషమే. ఆ స్థానకవిని నిర్ణయించినంతే మాత్రాన ఆ స్థానకవిగా ఉండేటటువంటివారు, ఎంతో కృషి చేస్తున్నారు. ఎంతమంది కవులకు ప్రోత్సాహం ఇస్తున్నారు? ఏమిగ్రంథములను రచించినారు అనేటటువంటిది నేను వేస్తున్నటువంటి ప్రశ్న.

కనుక ఇప్పుడు మన రాజకీయాలలో ఈ భాషను ఉపయోగించుకోవాలి అనుకొన్నప్పుడు మన దేశములో ఉన్నటువంటి భాషకూడ అంత స్పష్టంగా చాలా ముందుకు సాగిపోయేటట్లుగా చేసుకోవడమనేది చాలా ముఖ్యమైనటువంటి విషయము. కొందరి కవులను సత్కరించడం ద్వారాను, వారి గ్రంథాలను అచ్చు వేయించడం ద్వారాను ప్రోత్సహిస్తేగాని భాష అభివృద్ధిచెందదు అనేది ప్రభుత్వము గుర్తించుకోవాలని నేను మనవిచేస్తూ, కాశీశ్వరరావుగారు చెప్పినట్లుగా వీలైనంత త్వరలో ప్రభుత్వ కార్యకలాపాలను, మన మాతృభాష అయినటువంటి తెలుగులో జరిపించడానికి వీలుగా అన్ని కార్యాలు నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత ఈ ఆంధ్రభాష అనేటటువంటిది సంస్కృత భాషనుంచి దిగుమతి అయినటువంటిది. ఇప్పుడు సంస్కృతము మన భాషలో నూటికి 90 పాళ్లు ఉన్నదని మనవి చేస్తున్నాను. మనకు ఏ భాష ఏ శబ్దజాలము చెప్పడానికైనా భాష తెలియనటువంటి దురవస్థపడితే, సంస్కృత పదాలను, డు,ము,వు,లు అనే ప్రత్యయాలను చేరిస్తే, అవి మన భాషలోకి దిగుమతి అయిపోతాయి. మనకు భాషకొరకై అనేటటువంటిది ఉండదు. కాని మన భాషను సర్వాంగ సౌష్టవంగా తీర్చి దిద్దుకోవాలి. అంటె మన రాజకీయ పరిపాలనా వ్యవస్థలో ఈ భాషను త్వరలోనే అమలు పరచవలెనని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

SRI P. SATYANARAYANA :—ఉపాధ్యక్షా, పరిపాలనలో తెనుగుభాషను ప్రవేశ పెట్టే ప్రయత్నంలో ప్రభుత్వముయొక్క అలసత్వాన్ని ఇంచుమించుగా అన్ని పార్టీలవారు నేరారోపణచేస్తే, దానినుంచి తప్పించుకోలేము. పార్లమెంటులో హిందీభాష 15 సంవత్సరములలో ప్రవేశపెట్టవలెనని రాజ్యాంగ చట్టములో చేసిన నిబంధన ఎంత అవసరమో, జాతీయ దృష్ట్యా ప్రాంతీయభాషను ఆయా రాష్ట్ర శాసనసభలలోను రాష్ట్ర పరిపాలనలోను ప్రవేశ పెట్టాలనేది అంతకంటె ఎక్కువ ప్రాముఖ్యతను వహించి ఉన్నది. కాని దీనిని రాజ్యాంగబద్ధం చేయకపోవడంవల్ల కొంత నిర్లక్ష్యం జరుగుతున్నది. ఇదికూడ రాజ్యాంగబద్ధం చేసిఉన్నట్లయితే, ఇంతకంటె చక్కగాను, సత్వరంగాను పని జరుగుతూఉండేది. తూర్పుగోదావరిజిల్లాలో నామకః ప్రాంతీయభాషలో (ఆంధ్రభాషలోనే) పరిపాలనా వ్యవహారం అంతా జరుగవలెనని 2, 3 సంవత్సరముల క్రిందట ఉత్తరువులు జారీ చేసినారు. అక్కడ ఇది అమలు జరుగుతున్నదని పలువురు సభ్యులు చెప్పారు. కాని, ఈ ఆరుమాసాలనుంచి తూర్పుగోదావరిజిల్లా కలెక్టరువద్దనుంచి Planning Committee వద్దనుంచి, నీటి పారుదల కమిటీలనుంచి, కమ్యూనిటీ ప్రాజెక్టు కమిటీలనుంచి, తాశీల్దారనుంచి Revenue Department నుంచి ఇంకా ఎక్కడెక్కడనుంచో మొత్తం ఈ 6 మాసాలలో జిల్లాస్థాయిలో నాకు చేరినటువంటి ప్రభుత్వ ఉత్తర్వులు ఒక 150 కి పైగా ఉంటాయి అంటె అతిశయోక్తి ఉండదు. ఇందులో ఒకటికూడ తెలుగులోలేదు. Revenue Inspector నుంచి Fisheries కు సంబంధించిన ఒక Local Inspector నుంచి మొదలుకొని అందరిదగ్గరనుంచికూడ వచ్చిన ఉత్తరములు అన్నీ ఇంగ్లీషులోనే ఉన్నాయి. పోనీ, అక్కడ టైపుమిషీను ఇబ్బంది ఉన్నదేమో, అందువల్ల ఇంగ్లీషులో టైపుచేసి పంపారు అనుకొందామంటె, చేతితోనే వ్రాసినవి చాలా ఉన్నాయి. అందుచేత తూర్పుగోదావరి జిల్లాలోగూడ తెనుగుభాషను పరిపాలన వ్యవహారములో అమలు జరగడంలేదు,

కనుక ప్రభుత్వము శ్రద్ధతీసుకొని గట్టిగా పనిచేస్తేనేగాని ఈ విషయంలో పని జరుగదు. పరిపాలన కనీసం ప్రజలకు అర్థమయ్యేటట్లు జరిగితేగాని, ఈ ప్రజాస్వామ్యం సరిగా జరగడం చాలా కష్టము. అందుకోసమే దీన్నిగురించి ఇంత తీవ్రమైన ఆందోళన చాలా కాలంగా భారతదేశంలో అన్నిప్రాంతాలలోను జరుగుతున్నది. మొన్న గుంటూరులో High Court ప్రారంభోత్సవం చేసేటప్పుడు జడ్జీగారు ఇక్కడకువచ్చి High Court వ్యవహారాలన్ని, తెనుగులో చేసుకోవచ్చు, డిక్రీలన్నీకూడ తెలుగులోనే వ్రాసుకోవచ్చు; అది Supreme Court కు వెళ్ళే అవసరం వచ్చినప్పుడు మాత్రమే దాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకోవలసిన అవసరం వస్తుంది, అంతవరకు పరవాలేదు అని ఆయనచెప్పినట్లు నాకు జ్ఞాపకమున్నది. అందుచేత ఈ విషయంలో పైనుంచి ఎలాంటి అభ్యంతరము లేకుండా ప్రోత్సాహం వస్తున్నది. క్రిందనుంచి కావలసిన అలజడి వస్తున్నది. ఈ రెండిటినీ గమనించకుండా ఇప్పటివరకు సృష్టి జరుగుతున్నది. వారికి ఉండేటటువంటి ఇబ్బందులు రెండే కనిపిస్తున్నవి. ఈ భాషను యంత్రీకరణ చేయవలసిన విషయంలో Type machine సంతృప్తికరంగా ఇంకా పరిణమించలేదు అనేది ఒకటి. తరువాత పరిపాలనలో కీలకస్థానాలలోఉన్న Secretaries, Inspctors-General, Derectors of Departments, వీరిలో పూర్తిగా తెనుగుభాషమీద స్వాతంత్ర్యం కలిగినవారు మాకు ఇంకా దొరకలేదనేది, రెండవది. ఈ రెండు కారణాలే కనిపిస్తున్నాయి. కాని ఇదివరకు చాలామంది మాట్లాడినదాన్ని బట్టిగాని, అనేకసార్లు సభ్యులువేసిన ప్రశ్నలకు మంత్రులుఇచ్చిన సమాధానాలుబట్టిగాని చూస్తే, Type machine అనేటటువంటిది ఒక పెద్ద అభ్యంతరముగా ఏమి కన్పించలేదు. దాంట్లో ఏవో కొన్ని లోపాలుంటే ఉండవచ్చు. వ్యవహారానికి మాత్రము పూర్తిగా అడ్డంకి కలిగించేంతటి లోపభూయిష్టంగా కన్పించడంలేదు. కాని అభివృద్ధి సాధించదలచుకొంటే ఇంకా దాన్ని అభివృద్ధి చేయవచ్చును ఇంగ్లీషు దానిలోవలెనే. అందుచేత Type machine అనేది ఈ విషయంలో ఒక లెక్కలోకి తీసుకోవలసిన అవసరంలేదు. అంతేగాక ఇలాంటి ప్రజాస్వామిక ప్రాథమిక సూత్రాలకు సంబంధించి Type machine ఒక అభ్యంతరంగా ఉన్నదనేది కేవలం హాస్యాస్పదంగా ఉంటుందేమోనని వారికి సవినయంగా మనవి చేసుకొంటున్నాను. రెండవది, కీలకస్థానాలలో ఉండేటటువంటి ఉన్నత సెక్రటరీలు మొదలైనవారు ఏదో కొద్దిమంది ఉంటారు. అటువంటివారు ఒక రెండు డజన్లుకంటె ఎక్కువ ఉండరనుకొంటాను. వారికి Translators (తర్జుమాదార్లను సప్లైచేసి

Sri P. Satyanarayana] [29th September 1955

నట్లైయితే పెద్ద కష్టమేమిఉండదు. అందుచేత ఇది ఒక పెద్ద ఆటంకంగా చూచి ఆలస్యం చేయకుండా ఈ సంస్కరణను త్వరలో ప్రవేశపెడతారని నేను కోరుతున్నాను.

తరువాత ఇంకొక విషయము చెప్పవలసియున్నది. ప్రకృతి శాస్త్రములు, సాంఘిక శాస్త్రములు, ఇలాంటివాటికి తెనుగుమాటలు దొరకడం కొంచెము కష్టమే. దీన్ని గురించికూడ ఇదివరకు కొన్ని తర్జన భర్జనలు జరిగాయి. బహుశః, వుయ్యూరు కుమార రాజా గారనుకొంటాను. వీరు దీన్ని గురించి ఒక కమిటీని వేయవలసిందని, దానికి తగినటువంటి నిఘంటువును తయారు చేయవలసిందని చెప్పినారు. అందుకు ఆలోచిస్తామని బదులు చెప్పారు. కాని ఇదివరకు ఏమిచర్య తీసుకొన్నట్లు కన్పించదు. రాసాయనిక, భౌతికశాస్త్రములు ఆయా దేశపు భాషల్లో లేవు చాలామట్టుకు Latin భాషలోని మాటలను జీర్ణంచేసుకొన్నాయి. అదేవిధంగా మనంకూడా వాటిని జీర్ణంచేసుకొన్నట్లయితే, అవి అభ్యంతరంగా పెట్టుకొని ముందుకు వెళ్లకుండా ఉండడానికి ఏమి ఆస్కారంలేదు. ముఖ్యంగా సాంఘికశాస్త్రములోను, న్యాయశాస్త్రములోను ఒక చిక్కువచ్చింది. నేను ఇందాకనే విరామసమయంలో కాఫీ త్రాగుతున్నప్పుడు ప్లీడర్లుకూడ అక్కడఉండగా, వారితో ఈ భాషను న్యాయ శాఖలో ప్రవేశపెట్టడంవల్ల మీకు వచ్చేటటువంటి ఇబ్బంది ఏమిటిఅంటే, ఇప్పుడు arguments అన్నీ తెనుగు భాషలోనే జరుగుతున్నాయిగాని, ఇంగ్లీషుమాత్రం ఒక ప్రమాణభాషగా తీసుకోకపోతే ఇబ్బంది వస్తుందని చెప్పారు. ఆ ఇబ్బంది ఏమిటిఅంటే, మళ్ళీ కంగారుపడ్డారు. అసలు ఈ భాషలో పేలవంఉన్నదనా, పేదరికము ఉన్నది. అనా, లేక వ్యక్తపరచేటటువంటి వ్యక్తికి ఈ భాషాలోపము ఉన్నదనా అని ప్రశ్నించేటప్పటికి వారు కొంచెము నిదానించుకోవలసివచ్చింది. కనుక మన న్యాయశాఖ మొదలైనటువంటి విషయములలోకూడ డిక్రీలతో సహా తెనుగుభాషలోనే ప్రవేశపెట్టడం, ఉత్తర్వులు జారీచేయడంలో ఏ విధమైనటువంటి ఆలస్యము చేయడానికి వల్లకాదు. ఇక భౌతికశాస్త్రములోకూడ కొళిపట్నపు కొండయ్యగారు విశ్వరూపము అనేటటువంటి ఒక బ్రహ్మాండమైన భౌగోళిక శాస్త్రమును చక్కని, సరళమైనటువంటి తెనుగుభాషలో వ్రాసి ఆంధ్రదేశమునకు ఇచ్చారు. దానిని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రకటించారు. అందులోని తెనుగు భాష చాలా చక్కగా, సరళంగా ఉన్నది.

వారు సుమారు ఒకటి రెండు సంవత్సరాలు "అవిజ్ఞానం" అనే మాసపత్రికను నడిపారు. అందులో యీ భౌతిక శాస్త్రము లన్నింటిమీద చర్చ జరుగుతూవుండేది.

చాలా సరళమైన తెలుగు భాషలో నడుస్తూ వుండేది. అందుచేత మన పత్రిక శ్రద్ధ, జోక్యము కలుగ చేసుకోక పోవడము లోపముగాని, చూస్తే, చాలా సులభముగానే అభివృద్ధి పొందటానికి అవకాశముంటుంది.

ఇంకొక విషయము. ఇలాంటి సంస్కరణ తీసుకొనివచ్చినప్పుడు ఇంతవరకు మనకు వున్న అనుభవాన్ని బట్టి యేమితోచిందంటే, ఒక time limit పెట్టుకుంటే గాని ప్రభుత్వము చురుకుగా కదలలేదేమో ననిపిస్తూంది. 1958 వ సంవత్సరము, మార్చి 31 వ తేది నాటికి ప్రభుత్వ కార్యకలాపాలన్నీ కూడా తెలుగులోనే నడపవలెను అనేది ఏదైనా ఒక నిర్ణయము చేసుకుంటేనే తప్ప, సంతృప్తికరంగా ప్రభుత్వములో సంచలనము కలగదేమో ననిపిస్తూన్నది. కాని ఆ రకమైన తీర్మానానికి బదులు ("as early as possible") "సాధ్యమయినంత త్వరలో" అనే సవరణ మన మిత్రుడు నాగిరెడ్డిగారు చెప్పినట్లు పుర్ర చెయ్యికి ఎడమ చెయ్యికి వుండే తేడా తప్ప, అంతకంటె పెద్ద తేడా యేమీ కన్పించదు. అప్పుడు కూడా మనకు మన నిత్య వ్యవహారాలలో కొంచెము కష్టము వుంటే, దాన్ని అధిగమించటానికి సంధి సమయములో ఒక programme నిజంగా పూర్తిగా ఆంధ్రీకరణ చేయటానికి మనము ఏదో మూడు సంవత్సరాలు పాటు టైము పెట్టుకుంటే మూడు సంవత్సరాల అనంతరమందు, అన్నిచోట్లను ఆంధ్రమే వుంటుంది గాని యీ మూడు సంవత్సరాల లోపల మాత్రం ఒక Transitory Programme అంటే యీ సంధి సమయానికి అనుకూలమైనది కూడా మనకు ఉంటే మంచిదని తోస్తున్నది. దానికి సూచనగా ప్రభుత్వము తయారుచేసే యీ శాసనము రాజ్యాంగ చట్ట ప్రకారము రాబోవు 15 సంవత్సరాలవరకు ఇంగ్లీషు భాషలోనే జరుపుకుంటూవస్తేనే, దానికి ప్రాముఖ్యత వస్తుందన్నమాట. నిజమేకాని తెలుగు భాషలో దాన్ని నివరించడం, గజెట్‌లో వేస్తూండడము, యిటువంటి విధానాలు అనుసరిస్తూ వుంటేనే యీ కార్యక్రమము త్వరలో నమ్మకముగా అమలులోకి రావటానికి అనుకూలంగా వుంటుందని నేను సూచన చేస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, అన్ని పార్టీలవారు ప్రభుత్వ వ్యవహారాలన్నీ త్వరలో తెలుగలోనే జరపాలని యీ తీర్మానము సందర్భములో చెప్పినందుకు నాకు చాలా ఆనంద దాయకముగా వున్నది. అంటే అందులో అభిప్రాయ భేదాలు వుంటవి అనే విషయముకాదు, కాని యీ తీర్మానాన్ని అంగీకరించవలసి వచ్చినప్పుడు ప్రభుత్వము అమలులోకి రాకుండా కాలయాపనచేస్తూ వుంటుంది. కాబట్టి, యీ తీర్మానాలు అన్నీ అంగీకరించేటట్లయిన, త్వరలో నడిపించవలసి

వస్తుందేమో, ఎవరైనా కొంచెము వ్యతిరేకిస్తారేమోననే భయము ప్రభుత్వానికి లేక పోలేదు. అందుచేతనే శ్రీ కాశీశ్వరరావుగారి తరఫున వచ్చిన సవరణ మరి ఏ కారణముచేత లేకపోయినప్పటికినీ గూడా యీ శాసనసభ ఏకగ్రీవంగా మరొక పర్యాయము ప్రభుత్వ యంత్రాన్ని తెలుగులోనే నడిపించటానికి మరొక పర్యాయము జ్ఞాపకము చేస్తూ ప్యాసు చేయటానికే యిప్పుడు యీ సవరణను మేము అంగీకరిస్తున్నాము. శ్రీ గోపాలకృష్ణయ్యగారు కూడా దాన్ని అంగీకరించాలని మేము కోరుతున్నాము. Interruption—అది మా ఆజ్ఞ ఏమీ కాదు, కాంగ్రెసువారి యొక్క బలమును బట్టి యీ విషయంలోనైనా గోపాలకృష్ణయ్యగారిని కూడ కలుపుకొని రావలసి వుంటుంది. కాబట్టి, విధిలేక అంగీకరించవలసి వచ్చింది. అయితే మేము అందరము అంగీకరిస్తున్నామని చెప్పి, "మరల ఆలోచిస్తాము," "చూస్తాము" అని అనవసరముగా ప్రభుత్వము కాలయాపన, జాప్యము చేయకుండా మహా ఆలస్యమయితే 1964 వ సంవత్సరము దాటిపోకుండా, యీ లోపలనే ప్రభుత్వము తన సర్వశక్తులున్నూ వినియోగించి చేస్తుందని ఆశిస్తున్నాను. (Interruption).

అయిదేండ్లు దాటేలోగా యీ పని పూర్తిచేస్తే, ప్రభుత్వము నిజంగా పెద్ద ఘన కార్యము సాధించినట్లే. ఆ విధంగా చేస్తే చాలు. సంతోషిస్తాను. అయితే యీ సందర్భములో ఒక్క విషయములో మీకు జ్ఞాపకము చేయవలసి వస్తున్నది. నిన్ననో, మొన్ననో హోసూరు తెలుగు మిత్రులందరికి మనము అభివందనలు తెలియజేస్తూ వారికి స్వాగత మిచ్చాము. నిజంగా హోసూరు మన రాష్ట్రానికి ఎంత దూరమున్నది? ఎంతో మారు మూలన వున్నది. కర్నూలుకు ఎంత దూరము? రహదారి సౌకర్యాలు వారికి లేవు. పట్టణ వసతులు కావాలంటే, వారికి బెంగుళూరు వున్నది. బెంగుళూరులో రైలు ఎక్కితే అటు మద్రాసు పోవటానికి సౌకర్యాలు వున్నవి కాని, యిటు కర్నూలుకు రావటానికి ఎంతో కష్టపడవలసి వస్తుంది. ఎందువల్ల వారు మద్రాసు నుంచి విడిచిపోయి ఆంధ్ర రాష్ట్రములో చేరుతామని కోరుతున్నారో గుర్తించండి. అక్కడవున్న వారు అందరు తెలుగువారే. వారి మాతృ భాష తెలుగే కాబట్టి మనలో చేరుతామని అంటున్నారు. మనలో చేరటానికి వారు తహతహ పడుతున్నారు. తీర్మానాలు చేస్తున్నారు. వారు మనతో చెప్పుకోవటానికే వారి రాకకు కారణము అయివుంటుంది. అదేవిధంగా ఏ మారు మూలలలోనో వున్నప్పటికినీ ఆంధ్రులుగా వున్నవారు ఎవరైనా సరే ఆంధ్ర రాష్ట్రములో చేరటానికి దీనికి కారణము అయివుండవచ్చు. మన భాష, మనవిజ్ఞానము, మన అభివృద్ధి మన రాజ్యాంగ వ్యవహారాలు అన్నీ గూడ మనకు తెలుగులోనే జరగబోతాయి, త్వరలోనే

Sri P. Sundarayya] [29th September 1955

మనము అభివృద్ధి చెందటానికి వీలవుతుంది, అనే ఆతురతతో వారు ముందుకు వచ్చారు. అందుచేత ఆంధ్ర రాష్ట్రము వచ్చి యిప్పటికి రెండేళ్లు పూర్తి అయినది. ఇంక యిది ఎంత త్వరగా మనము ఆరంభించి పరిపాలన సాగిస్తే మన యందు అంత ఆశ, ఉత్సాహము, సరిహద్దు ప్రాంతాలలో వున్న ఆంధ్ర ప్రజానీకము నంతటికిని కలుగుతుంది. వారు మనలో చేరటానికి ఉత్సాహపరచటానికి, వీలుంటుంది.

ఇదిగాక యీ సందర్భములో మరొక విషయము చెబుతున్నాను. మనమందరము కూడా దాన్ని జ్ఞాపకము పెట్టుకోవాల్సి వుంది. భారత ఖండము యీనాడు పాకీస్తాన్ విభజనవల్ల చీలిపోవడం జరిగింది. అయినప్పటికినీ మన భారత దేశములో ఐక్యత మనము సదా వాంఛిస్తున్నాము. ముందు ముందు ఎప్పటికైనను సరే యీనాడు విడిపోయిన యీ రెండు భాగాలు మరల కలిసిపోతాయి అన్న ఆశతో, లేకపోతే కోర్కెలతో కలలనుకుంటూ ఉంటున్నాము. అందువల్ల యిప్పుడు మనకు మిగిలివున్న భారత ఖండములోనైనా మన ఆంధ్రులయొక్క ఐక్యత అభివృద్ధి చేసుకోవాలని అనుకుంటున్నాము. ఆ దృష్టితోనే భారత దేశములో దాదాపు సగము మంది చిన్న చిన్న ఉప భాషలతో కూడుకున్నప్పటికినీ, హిందీ భాషను మన జాతీయ భాషగా ప్రభుత్వ వ్యవహారాలలో ఒక రాష్ట్రములో వున్న ప్రజలు మరొక రాష్ట్ర ప్రజలతో వుత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోటానికి దానిని నేర్చుకోవాలని 1960 వ సంవత్సరము నాటికి ఇంగ్లీషు భాష స్థానములో హిందీ భాషనే భారత దేశములో ప్రభుత్వ పరిపాలన భాష క్రింద అంగీకరించాలని రాజ్యాంగ చట్టములో సూచించబడివుంది. అయితే అందరము హిందీ నేర్చుకోవాలి అని చెప్పినప్పుడు మనము మొదటి ఫారము నుంచి మొదలుపెట్టి నేర్చుకోవాలని ప్రభుత్వము నిర్ణయించింది. ఇది చేసినప్పుడు, హిందీ భాషను మనమందరము నేర్చుకొని, మన భారత దేశములో ఐక్యమత్యము మరింత హెచ్చుగాను, గట్టిగాను, బందోబస్తు చేసుకోవాలని అంటే, దీనికి వేరొక మార్గము ఏమిటి? ఈ రోజున హిందీ భాషను కొంతమంది అయినా వ్యతిరేకిస్తున్నది ఎందుకంటే, భాషా రాష్ట్రాలను యివ్వకుండా అనేక పేచీలు పెట్టుతూ వుంటున్నారని. ఇప్పటివరకు వచ్చిన భాషా రాష్ట్రాలలో మొదటిది ఆంధ్ర రాష్ట్రమే. ఈ విధంగా వచ్చిన భాషా రాష్ట్రాలలో పరిపాలనా వ్యవహారాలను కాని, విద్యా బోధనగాని, వారివారి మాతృ భాషలో జరపకుండా హిందీలోనే జరగాలని కొన్ని కొన్ని ఆలోచనలు రావడము వల్లనే అనుమానాలు మరింత ఎక్కువవుతున్నవి. ఈ రోజున బొంబాయి నగరములో హిందీ భాషలోనే చెప్పాలి, ఇంగ్లీషు భాష స్థానములో హిందీ భాషా బోధన చెయ్యాలి అని చెప్పినప్పుడుగదా

అభ్యంతరము వస్తున్నది? అదే విధంగా All India Services అన్నిటికీ కూడ హిందీ భాషలోనే మేము పరీక్షలు జరుపుతాము, అన్నప్పుడు దానికి మినహాయింపులున్నప్పటికినీ, అది వచ్చేటప్పటికి అనేక రాష్ట్రాలలో హిందీ భాషను మాతృ భాషగా లేనటువంటి అనేక రాష్ట్రాలలో అనేక మంది దాన్ని వ్యతిరేకించటానికి కారణము కన్పిస్తున్నది. అందుచేత యీ వ్యతిరేకత పోవాలి అంటే, యిటువంటి వ్యతిరేకత మన ఆంధ్ర రాష్ట్రములో లేదు కనుక ఆంధ్ర ప్రజలయొక్క కోర్కెలు తిరస్కరిస్తూ విశాలాంధ్ర ఏర్పడక పోయినప్పటికినీ, లేక ఒక వేళ వచ్చినప్పటికినీ, అది వచ్చిన తరువాత కూడా Osmania University ని Hindi University గా మార్చటానికి ప్రజానీకము వ్యతిరేకించింది. అది వచ్చినప్పుడు కూడా మన విశ్వవిద్యాలయాలలో హిందీ భాషా బోధనయే అమలు పెట్టవలసిందిగా సూచనలు ఏ మూలనుంచి వచ్చినప్పటికినీ. అదృష్టవశాత్తు యింతవరకు రాలేదనుకోండి. వచ్చివుంటే, వీటి అన్నిటి విషయములోనూ ప్రజలకు మరింత అనుమానాలు ఎక్కువై అసలు హిందీ భాషకు వ్యతిరేకముగా ఆందోళన చెలరేగే ప్రమాదం వుంది. ఇటువంటివి రాకుండా వుండాలని అంటే తెలుగు భాషలో మనము ప్రభుత్వ కార్యక్రలాపాలు అన్నీ జరుపుకోటానికి ఎంతో కృషి చేస్తున్నామనే సంగతి ప్రజలకు తెలియజేసినప్పుడే, ప్రజలకు వున్నటువంటి అనుమానాలు మనము పోగొట్ట గలుగుతాము. అయితే యివన్నీ జరపాలంటే, ప్రభుత్వము భాధ్యత వహించాలి. విశ్వవిద్యాలయాలలో తెలుగు భాషా బోధన భాగా సాగాలంటే, ప్రభుత్వ వ్యవహారాలన్నీ తెలుగు భాషలో జరిపినప్పుడే విశ్వవిద్యాలయాలలో తెలుగులో బోధన తయారు అవుతుంది. తెలుగులో బోధించినంత మాత్రాన, తెలుగులో ఉత్తీర్ణులైన వారు యిక్కడ ప్రభుత్వ వ్యవహారాలు ఆంగ్ల భాషలో వుంటే, వారు యిక్కడికి వుద్యోగాలకు వచ్చినప్పుడు నడిపించలేరు. అది సాధ్యముకాదు. అందుచేత వీటి అన్నింటికిగూడా పునాది ఏమిటంటే తెలుగు భాషలో మనము ముందు ప్రజలు ప్రభుత్వ వ్యవహారాలు అన్నీ జరిపితే, దానితోబాటు విశ్వవిధ్యాలయాలలోకూడా తెలుగు భాషా బోధవ జరుగుతుంది. ఆ విధంగా జరిపితేనే, మనకు వున్న వ్యవహారాలు అన్నింటినీ తెలుగులో నడుపుకో గలుగుతాము. అప్పుడు భారత దేశములో ఐక్యత కొరకు మన ఆంధ్రులందరూ కూడా హిందీ నేర్చుకోటానికి, యితరుల ప్రోత్సాహము సలహాలేకుండానే ముందంజ వేసి నేర్చుకుంటారు.

ఈ విషయములన్నీ దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంత త్వరలో మన పరిపాలనా వ్యవహారము యావత్తు తెలుగులో జరపవలసి వుంటుంది. ఆ

సందర్భంలో సంక్షిప్తలేఖనము లేదంటున్నారు. అందులో తగినంత మంది తర్ఫీదు పొందిన వారు లేకుంటే లేకపోవచ్చును. అదేమీ బ్రహ్మ విద్య కాదు. దానికి ప్రభుత్వమువారు తగిన ప్రోత్సాహము ఇస్తే ఎంతో మంది త్వరగా నేర్చుకోనడానికి వీలుంటుంది. అదే రకంగా ఈ టైపు రైటర్సును కూడా ఎక్కువగా తయారు చేసుకోవడము పెద్ద కష్టము కాదు. శ్రీ కళా వెంకట్రావుగారు ఈ టైపు అక్షరములను చదువుకోవడము కొత్తగా నేర్చుకోవలయునంటున్నారు.

THE HON. SRI K. VENKATA RAO :— నేను చెప్పలేదు.

SRI P. SUNDARAYYA :— చాలా పర్యాయములు శాసన సభలో చెప్పారు. వారికి జ్ఞాపకము లేదేమో. ఇక్కడ 40 యేండ్లు దాటిన వారమే ఎక్కువగా వున్నాము. అది నేర్చుకోవడము అంత పెద్ద కష్టము ఏమీ కాదు. మన తరువాత వచ్చే తరము వారు సులభముగా తెలుగులోనే పరిపాలన జరుపుకోవడానికి ఈ టైపు రైటర్సు పెద్ద ఇబ్బంది లేదు. ఇటువంటి ఇబ్బందులను లెఖ్ఖ చేయకుండా 1960 నాటికైనా సరే తప్పకుండా మన ప్రభుత్వ కార్యకలాపాలన్నీ కూడా తెలుగులో జరిపే దానికోసము నెమ్మది నెమ్మదిగా ఎక్కువ భాగము తెలుగులో జరుపుకోవడానికి ప్రయత్నము చేయాలని కోరుతున్నాను.

ఈ సందర్భములో తెలుగు పర్యాయపదములను గురించి వచ్చింది. తెలుగు పర్యాయపదములు వచ్చేటప్పటికి ఇదివరకు సంవత్సరముల కొలది ముస్లిముల కాలము నాటి పరిపాలన ఫలితం కానీయండి, అనేకమంది అనేక పదములను తెలుగులోనికి తెచ్చుకున్నారు. అదే రీతిగా ఇంగ్లీషులోనుండి కూడా అనేక పదాలు తెలుగులోనికి వచ్చినాయి. ప్రతివారికి కూడా ఇంగ్లీషు పదాలు అర్థము అవుతూనే ఉన్నాయి. ఆ పదాలన్నీ తీసివేసి ఈరోజు వేదకాలము నాడు వున్న సంస్కృత పదాలను తీసుకువచ్చి పెట్టమని ఎవరూ కోరరు. అందులో ఈ రోజున మన తెలుగులో అందరికీ అర్థము అయ్యేటటువంటి ఇంగ్లీషు పదాలు కానీయండి, పారశీక పదాలు కానీయండి, ఉర్దూ పదాలు కానీయండి, అరవ పదాలు కానీయండి, కన్నడ పదాలు కానీయండి, ఏ భాషలో అయినాసరే మన ప్రజలందరికీ అర్థము అయ్యేటటువంటి పదాలనుఉపయోగిస్తూ అవసరమైన వాటిని తెలుగు సంస్కృతము ఎక్కువ ప్రభావము వున్నది కాబట్టి సంస్కృతములోనుంచే తెచ్చుకుందాము. సంస్కృతములో ఆరోజుల్లో లేనటువంటి శాస్త్రాలు వచ్చాయి. అదేరకంగా రాజ్యాంగ చట్టము విషయములో కూడా మనము కొత్త కొత్త పద్ధతులలో కొత్త కొత్త విషయములను అవలంబించవలసి ఉన్నది. వాటికి సంబంధించిన పదాలు ఇంగ్లీషులో మన ప్రజలకు అలవాటు

అయితేఆ ఇంగ్లీషుపదాలు తెచ్చుకోవచ్చును. అందుచేత పర్యాయపదాలు సేకరించడము అంత కష్టమేమి కాదు. ఈ సందర్భములో శాసన సభలో ఉపాధ్యక్షులవారు చెప్పినట్లు మన ఆంధ్ర ప్రజలందరికీ అనుకూలమైనటువంటి, ఉపయోగపడేటువంటి, పదాలను తెచ్చి, పర్యాయపదములన్నీ కూడా మనము క్రోడీకరించే దానికోసము మనము ఒక కమిటీని ఏర్పాటు చేయాలని దానిని గురించి ప్రభుత్వము జాగ్రత్తగా చర్య తీసుకోవాలని కోరుతున్నాను. లేకపోతే అఖిల భారతదేశములో మొత్తం ఈ ఇంగ్లీషు పదములకు పర్యాయపదాలను పెట్టే దానికోసము వాళ్లు ఒక కమిటీని ఏర్పాటు చేశారు. దానిని అనుసరించే భారత సంవిధానము అని చెప్పి ఒకటి తయారు చేశారు. ఆ సంవిధానము మనందరిని సంధింపచేస్తుందే కాని అది తెలుగులో అర్థము కాదు. హిందీలో అర్థము కాదు. ఇంగ్లీషులో అర్థము కాదు. ఈ మూడింటి యొక్క సంకర సంవిధానము క్రింద తయారైనది తప్పితే దానివల్ల ఏమీ ఉపయోగము లేదు. దానికన్నా హిందీ నేర్చుకుంటే బాగా వుంటుంది. ఇంగ్లీషు నేర్చుకుంటే సుభ్రముగా ఉంటుంది. అది మాత్రము తెలుగు కాదు. అందుచేత ఈ పర్యాయపదాలు అని చెప్పి ఆల్ ఇండియా వాళ్లకు వదలివేస్తే మన తెలుగును హిందీగా తయారు చేస్తారు. పూర్తిగా హిందీగా తయారు చేసినా బాగుండును. అది అయినా నేర్చుకొని బాగుపడుతాము. ఆ విధముగా దానిని ఒక సంయుక్త భాషగా చేసి అందరికి అర్థము అయ్యేటట్లుగా చేసేదానికి ప్రభుత్వము తగిన చర్య తీసుకోవాలి. పభుత్వమువారు, ప్రభుత్వములో పని చేస్తున్నటువంటి ఉద్యోగులంతా సాధ్యమైనంత త్వరలో ప్రభుత్వము వ్యవహారములను తెలుగులో జరిపితే ఆంధ్ర ప్రజల యొక్క కోరికను నేరవేర్చినట్లు అవుతుంది. అందువల్ల మేము ఆ సవరణను ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నాము. ఆ సవరణను అంగీకరిస్తున్నాము అని ప్రభుత్వము సాధ్యమైనంత త్వరలో అనే పేరుతో కాలయాపన చేయకుండా 1960 సంవత్సరము జనవరి 26 వ తేదీ లోపలనైనా తప్పకుండా చర్య తీసుకోవాలని కోరుతున్నాము. ఇంకా తొందరగా చేసినాకూడా మేము సంతోషిస్తాము. ఆ రీతిగా ప్రభుత్వము కృషి చేస్తారని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri A. KALESWARA RAO :—నేను రిప్లయి చెబుతానండి.

Mr. DEPUTY SPEAKER :—మీరేమీ రిప్లయి చెప్పే అవసరము లేదు, మంత్రిగారు మాట్లాడుతారు.

SRI A. KALESWARA RAO :—ఆ ఎడమ చెయ్యి, కుడి చెయ్యి కాదు. అసలు ఇది పెడితే గాని తీర్మానమునకు అర్థము ఉండదని ఒక మాట చెబుదామనుకున్నాను. అంతకంటే రిప్లయి ఏమీలేదు.

[29th September 1955

THE HON. SRI K. VENKATA RAO :—ఊరికే మాట వరుసకు అన్నారుగాని రెండింటికి వున్న తేడా మన అనుభవములోనే ఉన్నది. అందువల్ల దానిని గురించి చర్చ అవసరము లేదు.

అధ్యక్షా, చిన్నప్పుడు నేను చదువుకున్న పద్యము ఒకటి జ్ఞాపకము వస్తున్నది. చదువుతామన్నా పూర్తిగా జ్ఞాపకము రావడములేదు. రెండు లైనులు మాత్రమే జ్ఞాపకము వస్తున్నది. అదే చెబుతాను.

"పుట్టునే భూమి యందొక అపూజ్యుడు నాకిది మాతృ భాష,

నే బుట్టిన దేశమిద్ది అని పొంగక ప్రాణము గల్గు పీనుగయ్యై.

ఇది స్కాట్ వ్రాసిన పద్యములకు అనువాదము అనుకుంటాను. కాని తెలుగులో చదువుకొన్నది మాత్రమే జ్ఞాపకము వున్నది గాని ఇంగ్లీషులో చదువుకొన్నది మరచిపోయినాను. అందువల్ల ఈ సభలోని సభ్యులుగాని, బయట ఉండే వారుగాని, బీద ప్రజానీకముగాని, పేద ప్రజానీకముగాని, ప్రజానీకముగాని అందరికీ కూడా ఒక అపూజ్యుడు, "నాకిది మాతృ భాష అని పొంగక ప్రాణము గల్గు పీనుగయ్యై," అనేది నా మాతృభాష అనే సంతోషము లేకుండా ఉత్తేజము లేకుండా, ఆనందము లేకుండా ఉండేటటువంటి వ్యక్తి ప్రపంచములోగాని, ఆంధ్ర దేశములోగాని ఎవరూ వుంటారని నేను అనుకోను. అందుచేత మన పరిపాలన తెలుగు భాషలో జరుపుకోవాలనే విషయములో కూడా ఏ విధమైనటువంటి భేదాభిప్రాయము ప్రభుత్వానికిగాని, ఇక్కడ ఈ రోజు కష్టపడి ఉపన్యాసములు చేసి అనేక వాదోపవాదాలు లేవదీసిన వారిలో గాని లేదనే నేను అనుకొంటాను. తక్కిన భాషలలో ఎక్కడయినా లోపాలు వుంటే వుండవచ్చును గాని తెలుగు భాషలో ఎక్కడా లోపాలు లేవు. ప్రపంచములో రెండే భాషలు ఉన్నాయి. 'Vowel ending' అంటే అచ్చులతోటి అంతమయ్యే శబ్దాలు వున్నటువంటి భాష పశ్చిమ రాజ్యాలలో ఇటాలియను భాష, తూర్పు రాజ్యాలలో తెలుగు భాష. అందుచేత ఈ యావదాంధ్ర దేశాన్ని పరిపాలించినటువంటి కవిరాజురాయలు కూడా వ్రాసినటువంటి "దేశభాషలందు తెలుగు లెస్స" అనే దానినికూడా చాలా గొప్పగా వర్ణించారు. అంతేకాదు తిక్కన, పోతన, ఎఱ్ఱా ప్రగడ ఇటువంటి మహాకవులు రచించిన అత్యద్భుతమైనటువంటి రచనలు ఆ చంద్ర తారార్కముగా ప్రపంచములో ఉంటున్నాయి. అటువంటి మహత్తరమైన ఈ తెలుగు భాషను మన పరిపాలనా వ్యవస్థలోకి తీసుకురావడమునకు ఏ విధమైనటువంటి కష్టము ఉంటుందని నేను

29th September 1955] [Sri K. Venkata Rao

అనుకోను. మేము చెప్పబోయే అభ్యంతరములు మొదటనుంచి అందరూకూడా చెప్పి వ్రాశారు. దానిని గురించి మనకు తర్కము అవసరములేదు. అందరూ కలసి అభ్యంతరములను తీసివేసుకోవడములోనే మన గొప్పతనము ఉన్నది. అసలు 1916లో గాంధీమహాత్ముడు భారత రాజకీయాలలో ప్రవేశించిన ప్రథమ సంవత్సరములోనే గుజరాతులో ఒక సాహిత్య మహాసభ జరిగినది. దానిలో భారత దేశములో ఉన్నటువంటి భాషలన్నింటినీ గురించి వ్రాస్తూ అందులో అన్ని భాషల వారికంటెను తెలుగు భాషవారే తెలుగులో తక్కువ ఇంగ్లీషు పదాలను ఉపయోగించుచుంటారు అని వ్రాశారు. అప్పటినుంచి కూడా మనకు ఆ సాంప్రదాయము ఉన్నది. ఆంధ్ర రాష్ట్రోద్యమము మొదలు పెట్టినప్పటినుంచి కూడా మా చిన్న నాటినుంచి కూడా తెలుగులో మాట్లాడాలనే కోరికతో, అందులో ఇంగ్లీషు మాటలను వినియోగించకుండా మాట్లాడాలనే కోరికతో, తమవంటివారు చాలా రోజులుగా ప్రయత్నం చేస్తున్నది అందరికీ తెలిసినదే. మన ఉపాధ్యక్షులవారు సాధారణముగా వారి ఉపన్యాసములు తెలుగులోనే మాట్లాడుచూ ఇంగ్లీషు పదమ్ము పడనీయకుండా చూస్తూ ఉంటారు. అంతే కాకుండా ప్రభుత్వ పరిపాలనలో కూడ Language Test ఒకటి ప్యాసు కావాలని నిర్బంధము ఉన్నది. యం. ఏ. ప్యాసు అయినా, ఎన్ని డిగ్రీలు ఉన్నా మాతృ భాషలో కూడా పరీక్ష కావాలనే బాధ మొదటనుంచీ వున్నది. కాని వచ్చిన బాధ ఏమిటంటే ఆఖరుకు ఇంగ్లండు నుంచి వచ్చిన I.C.S. దొరల మీదకూడా దీనిని ప్రవేశ పెట్టాము. అట్లా ప్రవేశ పెట్టబడడము వల్లనే ఈ పరిస్థితిలో ఉండడము జరిగినది. ఒకాయన ఈ భాషా పరీక్షలో ఒక దొరగారిని ఒక ప్రశ్న అడిగినారట. What is the Telugu for she buffalo ? అని అడిగారట. ఆయన ఏనుగు, పీనుగు అన్నాడు. It belongs to the same species అని అన్నాడట. ఆయన పరీక్షలో ఆ విధముగా దొరలకు తెలుగు వస్తుంది. అలాంటి తెలుగు పరీక్షలో ఉత్తీర్ణత చెందించి మన పరిపాలన వ్యవస్థ ఇంతవరకు సాధించడంవల్ల ఇంకా ఈ స్థితిలో ఉండడము జరిగినది. కాని మొదటనుంచి దీనిని అభివృద్ధి చేయాలని ప్రయత్నముకూడా జరుగుతున్నది. ఆ విషయము తమ అందరికీ కూడా తెలుసు. ఇప్పుడు మనము ప్యాసుచేసే Act లన్నీ కూడా మళ్లీ తెలుగులో గజెటులో publish చేస్తున్నే వుంటారు. జిల్లా గజెటులో కూడా వేస్తూ వుంటారు.

కాని ఇందాక వారు సంవిధానముగురించి చెప్పినట్లు ఈ భాష మాత్రము మనకు అర్థము అవడము కొంచెము కష్టముగానే ఉంటున్నది. దాంట్లోని మాటలు యుద్ధ కాలములో గోడలమీద అంటించే కాగితములలో ఉన్న తెలుగు మాటలవలె

ఉంటాయి. అవి తెలుగువారు చదువుకోవడానికి అర్థము కావు. అది ఇంకో దేశము వారు అయినా చదువుకోవలసిందే. కాని మన దేశములో పుట్టిన వారికి అర్థమయ్యేది కాదు. అందుచేత ఇదికూడా ఆలోచించి మన ప్రభుత్వము ఒక మంచి కవిని, ఆయన సుధర కవో, మధుర కవో తెలియదుగాని బోయి భీమన్న గారు అనే హరిజన సోదరుణ్ణి అన్ని గ్రామ్య భాషలు తెలిసినటువంటి ఒక వ్యక్తిని, ఇప్పుడు Government Translator గా వేసుకొన్నారు. అందుచేత గవర్నమెంటువారి యొక్క అనువాదములన్నీ కూడా కొంచెము జీవ కళ లోకి వస్తున్నవి. అందరు కూడా అందువల్ల ఉపయోగించుకునేటటువంటి వాడుక భాషలోను పరిపాలన విధానములో ప్రవేశపెట్టుటకు సౌలభ్యము ఆయనకూడా కలుగజేస్తారని చెప్పి నేను ఆశిస్తున్నాను. ఆ ధోరణిలో ప్రభుత్వము అప్పుడే యత్నము చేయడము మొదలు పెట్టినది.

ఇంకా అనేకమైన పదాలు మనలో దూరిపోయాయి. సుందరయ్యగారు చెప్పినట్లు ఈ వేళ దిద్దుకునేందుకు లేదు. నాగిరెడ్డిగారు రివెన్యూ రికార్డులు ఇంగ్లీషులో అచ్చువేస్తున్నారు, ఎందుకు ఇంక ఈ ఇంగ్లీషుపదాలని అన్నారు. ఎక్కువగా రివెన్యూ భాగంలోనే తెలుగును వినియోగించుచుండడం జరుగుతున్నది. అందులో వారు ఉపయోగించే భాషమాత్రం తెలుగుకాదు. దాంట్లో కుష్కి, తరి, పడుగాయివంటి పదాలున్నాయి. కుష్కి, తరి అని వీటిలో పరీక్షపెడితే సగంమంది మెంబర్లు fail అయిపోతారు. ఇంతాచేసి కుష్కీ, తరి అంటే మెరక, పల్లం. అయితే, మెరక, పల్లము అని వ్రాయక కుష్కి, తరి అంటాడు. పైగా పడుగాయి అని అంటాడు. పడుగాయిఅంటే ఏమిటో చెప్పండి ఎవరైనా ? నీళ్లకుమధ్యన ఉన్నదానిని మనం లంక అంటాము. పడుగాయి అంటే గట్టుకు నీళ్లకుమధ్యనఉన్నది. అరవవారు settlement చేస్తారు కాబట్టి అరవపదాలు మనలో దూరాయి కనుక, ఈవేళ Dictionary వెతుక్కుంటేకష్టం. అయినప్పటికి అలవాటైపోయాయి. Translation విషయంలో మన భాష ఎంత మంచిదైనా, సంస్కృత భాషజటిలమైనా, చాలా కష్టాలున్నాయి. మనకు ఇక్కడ చాలామంది డాక్టర్లున్నారు. నాగేశ్వరరావుగారు, రంగయ్యగారు వంటివారు సల్ఫాడిజయన్ అంటారు. ఆక్సీట్రా సైక్లిన్ అట, ఇష్టాలిన్లి అట, టెర్రామైసిన్ అట. వీటన్నింటిని తెలుగులో ఎట్లా వ్రాయము ? వీటన్నింటినికూడా రోడ్డు, రైలుతో బాటేకలపాలి. రబ్బరుకూడా లబ్బరైపోయింది. ఎవరిని అడిగినా రబ్బరుఅనరు. లబ్బరే అంటాడు. అందుచేత ఈ పదప్రయోగాలను మనము అలవాటు చేసుకొని మనం వ్యవహారాన్ని చేసుకోవాలి, కొంతకష్టం ఉన్నది. ఆ విషయంలో ఇంగ్లీషు జడ్జి

మెంటులు తప్పేట్లాలేవు. Acts ఇంగ్లీషులో ఉండడంవల్ల Surpreme Courtsలో Judgments లో words interpretation చేసేందుకు ఇంగ్లీషు అవసరం ఉంటుంది. ప్రొద్దున Select Committee లో చూశాముకదా! Prescribed, confirmed, made confirmed and recognised అనే దానికి తెలుగు చేయడానికి ఆరు రోజులు పడుతుంది. ఇలాంటి కష్టాలున్నాయి. ఈ కష్టాలు తప్పించుకొని దానిని అంతా సత్వరంగా చేయవలసిన ధర్మంకూడా ఉన్నదని అంగీకరిస్తున్నాను. అందుకోసం ఈ వేళ ఈ ప్రభుత్వం నడవదు. ఇది మొద్దురాయి. దానిని దొర్లించడం కష్టం. అందుచేతనే ఇవన్నీ పెడుతున్నాం అంటే — మేము ఎక్కడనుంచో రాలేదు. ఈవేళ ఈప్రక్కనే కూర్చున్నాము. రేపు ఆ ప్రక్కన కూర్చుంటాము. ఇది అంతా Intermixing affair. ప్రజాస్వామ్యంమీద నమ్మకం ఉన్నవాళ్లం గనుక వంట్లో ఓపికఉన్నంతవరకు, బుద్ధిలో ఓపికఉన్నంతవరకు, రాజ్యాంగలో ఓపికఉన్నంతవరకు ముందుకు తీసుకుపోవాలనే ఉద్దేశమేకాని, ఇది జడ పదార్థం క్రింద, unmovable road roller క్రిందపడి ఉండాలనేకోరిక ప్రభుత్వానికి లేదు. ఈ రకమైన అనుమానం ఎవరిమనస్సులోను పెట్టుకోవద్దని కోరుతున్నాను. మా అమలాపురంలో ఒక సబ్‌జడ్జి ఉండేవారు. ఆయనదగ్గర రామకృష్ణంరాజుగారి వంటి ప్లీడరు నిలబడిఉండేవారు. అందరిని "ఒరేయి" అని పిలిచేవాడు. అలాగే, ఒరేయి! వెళ్ళిపోరా ఇంటికి అనేవాడు. అదేమిటండి నేను Argument చెప్పాలి అంటే, దేనిలో చెబుతావు అనేవారు. ఇంగ్లీషులో చెబుతానంటె అయితే B. A నువ్వేకాదు, నేనుకూడా ప్యాసైనానురా, తెలుగులో Arguments చెప్పు, నీ పార్టీకి నీపని తెలుస్తుంది, అనేవారు. ఎలాగో ఎదో రు 5, 10 లు వాడిదగ్గరనుంచి పుచ్చుకోవాలంటే ఎదో కొంత వేషం, భాషఉండాలి. బ్రాహ్మణోత్తములం మాకు ఉన్న గొప్పఏమిటి?—సంస్కృతజ్ఞానం తద్దినం మంత్రం చెప్పటం. అందులో ఏమున్నది—అతిధినిరావోయి, కూర్చోవోయి, అన్నం తినవోయి, ఇది అమృతం, ఇది నెయ్యి, ఇది పప్పు—ఇదే తద్దినం మంత్రం. దాన్నే తెలుగులో ఈ ముక్కలు చెబితే రేపుప్రొద్దున ఎవరు తద్దినం పెట్టించుకుంటారు? దానికై కొంచెం నిగూఢమైన స్వభావం కలిగించుకోక తప్పదు కనుక మామూలుగా ఏదో పెద్దఅర్థాలు చెబుతుండాలి.ఎదో తిక్కనగారి భాష బాగుంటుందని దానిని ప్రయోగిస్తామంటే వీలులేదు; అధునికంగా ఉండదు. ఈ భాషాసంయుతమైన మార్గంలోనే మన రాజ్యాంగాన్ని నడిపించుకోడం తప్పదని విషయం మనవిచేస్తున్నాం. మన సోదర Agency సభ్యుడున్నాడు, Md. Tahsil. Tahsil అంటే పన్ను. తెలుగులో మహమ్మదు పన్ను

Sri K. Venkata Rao] [29th September 1955

అని translation చేస్తుంటే అసంభవంగా ఉంటుంది. ఈ రకంగా కాకుండా అందమైన భాషను తయారు చేసుకొనడానికి ప్రయత్నించాలని నేనుకూడా అంగీకరిస్తున్నాను. సుందరయ్యగారు, డిప్యూటీ స్పీకరుగారు చెప్పారు. దీనికి తగిన పదజాలం తయారు చేసుకోవాలని. తప్పకుండా చేయాలి. కొన్నిమాటలు మనం విరగకుండానే వస్తుంటాయి. Welfare State అంటే శ్రేయోరాజ్యం అని అంటున్నాము. సర్వశ్రీ అని ఒకటివిన్నాను. ఉత్తర హిందూస్థానంలో "శ్రీ" అంటే "గారు" కు బదులు పెట్టుకున్నారు. ఎవరు ఈ సర్వశ్రీ అనుకున్నాను. Messrsకు Translation సర్వశ్రీ అని వాళ్లను అడిగితే తెలిసింది. ఈ విధంగా మనకు సరిపోయే పదజాలాన్ని కలిగిన పుస్తకాలు తయారుచేసే విషయంలో ప్రధాన మంత్రిగారితో మనవిచేసి తగినచర్య తీసుకునే యత్నం తప్పకుండాచేస్తాను అచ్చ తెనుగు రామాయణం ఉన్నది. ఎప్పుడో అచ్చువేసారు. చదవాలంటే ఇప్పుడు పుట్టినవారికి చేతకాదు. నిర్వచన రామాయణమట. కార్వేటినగరం మహారాజులు కృతులు పొందారు కాబట్టి వారికి తెలుసును. నాకు ఆపేర్లుకూడా తెలియవు. ఇప్పుడు మనకు సజీవమైన భాషకావాలి. "ముష్టిచెంబుం గొని పెట్టుమయ్య అమోఘమిదే దంతిరాణ్ణృపా" అన్నారు తిరుపతికవులు. మాకు అది ఉన్నంత కాలం ఎవరూ ఏమిచేయలేరు. ఆడవాళ్లనే వాళ్లు దేశంలో ఉన్నంతకాలం మాకు ముష్టితీసేవారు ఎవరూలేరు. Brahmin, Non - Brahmin అని ఎంత చెప్పినా, దక్షిణ త్రోవ మాకు పడేది చెంబులో పడవలసిందే. మాకు తక్కువ ఎప్పుడూ జరుగదు; అటువంటి భయాలు మాకులేవు. ఈ సందర్భంలో మనమందరం అత్యద్భుతమైన ఉత్సాహంతో ఈ కార్యక్రమం సాగించాలి. తూర్పుగోదావరి గురించి reference ఇచ్చారు. మద్రాసు రాష్ట్రంలో ఉండగానే Tanjore, తూర్పుగోదావరిజిల్లాలలో ప్రాంతీయభాషలలో పరిపాలనా వ్యవహారాలు జరగాలని నిర్ణయించారు. 3 సంవత్సరాలుగా అమలులోఉన్నా ఈ పని పూర్తికాలేదు. Experimental గా చేసుకోవలసిందేతప్ప, 5, 6 రోజులుచేసి ఆ తరువాత మానేశారు. ఈ రోజున మేడప్పగారు తూర్పుగోదావరిజిల్లా కలెక్టరు. కూర్గునుంచి వచ్చారు ఆయన. తెలుగులో వ్రాయాలంటే ఏమిచేస్తారు? వాటన్నింటినుంచి సర్దుకునేమార్గం మనం చూచుకోవచ్చు. తూర్పుగోదావరిజిల్లాను argument కోసం చెప్పవలసిందేకాని తెలుగుభాషా పరిపాలన జిల్లాలో అమలులోలేదు. ఇక experimental stages దాటిపోయాయి. దానికితగిన సంరంభం ఇప్పటినుంచి కృషిచేసి ముందుకుపోవాలి. సుందరయ్యగారు చెప్పినట్లు, మనకు హిందీమీద వ్యతిరేకతలేదు. మనం తెలుగును హిందీని అభివృద్ధి చేసుకొని జాతీయభాషను రాష్ట్ర

భాషను ముందుకు తీసుకువెళ్లే వ్యవహారం చేయాలి. మాకు ఎందుకు Andhra-province, ఉద్యోగాలకోసమా ? అనేవారికి నేను ఎప్పుడూ సమాధానం చెప్పేవాణ్ణి. ఉద్యోగాలు 15, 20 మందికి ఇస్తారు. దానికి రాష్ట్రమే అక్కరలేదు. నేను మద్రాసు రాష్ట్రానికి రివెన్యూమంత్రిని. ప్రజలందరికి సమాధానం చెప్పవలసినవాణ్ణి. మలబారువాళ్ల భాష లేదు. వాళ్లఇల్లు బంగారం కాను ! Malabar Tenancy Bill వ్రాయవలసివచ్చింది. మద్రాసులో ఉన్నాను కాబట్టి అరవంలో ఏవో 10 మాటలు వచ్చాయి. Malabar Tenancy Bill వ్రాయాలంటే, జన్మి, కనందార్, కుడికనందార్, వెనుంపట్టందార్, ఉళికుడి, పుళికుడి, ఇవన్నీ ఎక్కడ ఎక్కడాయి బుర్రలోనికి ? అక్కడికి రెండుమారులు వెళ్ళి మాటలు నేర్చుకొనివచ్చాను. బిల్లు నేనే పెట్టాలేమోనని తరువాత మీ దయవల్ల రాజీనామా ఇచ్చి పోవడంవల్ల ఆ బాధ తప్పింది. అన్ని రాష్ట్రాల వారు కలిసి ఉండడంవల్ల పరిపాలన సౌలభ్యంలేదు. ఈవేళ పిటిషను పెట్టుకుంటే—వేమయ్యగారు చెప్పినట్లు స్టాంపుమీద పిటిషను పెట్టుకున్నా—జవాబు ఏమి వస్తుంది అంటే పేరా I "ఇంటూలు (XX)" కొడతాడు. 2 వ పేరాలో "The petitioner is referred to the District Collector for orders" అంటాడు. పిటిషన్ ఖర్చుతోబాటు District Collector వద్దకు వెళ్లి Petition reject అయినదని తెలుసుకోడానికి మళ్ళీ రు. 15 లు ఖర్చు చేయాలి. గవర్నమెంటు దర్జా అది. ఎక్కడనుంచో పిటిషను పెడితే గవర్నమెంటు ఇలా చేసాము ; మా ఆఫీసరు ఇలా చెప్పాలని చూపిస్తామా?—అంతా గూడంలో పెట్టారు. దాని ఫలితం ఏమిటంటే రు. 15 లు ఖర్చుచేసి కాకినాడ వెళ్లాలి. వీటన్నింటినీ మార్పులు చేసుకోవాలి. తెలుగులో వ్రాసుకోడంవల్ల ఈ వ్యవహారాలు చాలా ముందుకు పోతాయి. కనుక ప్రభుత్వ దృష్టిలో కూడా పరిపాలన ప్రాంతీయ భాషలలో తప్పకుండా జరపాలనేది ఆశయమే కాకుండా ప్రభుత్వం సంకల్పమని కూడా మనవిచేస్తున్నాను. ఈ సంకల్ప సిద్ధికోసము శాసన సభలో అన్ని రాజకీయ పార్టీలవారు తోడ్పడితే—మేము 4 సంవత్సరాలు గవర్నమెంటులో ఉంటే, పరిపాలన వ్యవహారం తెలుగులో జరిగేట్లా యత్నం చేస్తామని, కాశీశ్వరరావుగారి amendment తో తీర్మానాన్ని ఆమోదించాలని కోరుతున్నాను.

కాశీశ్వరరావుగారి అమెండుమెంటు పరిమితము చెయ్యడము లేదు. రేపు ప్రొద్దుననుంచే తెలుగులో పరిపాలన చెయ్యాలని అందులో లేదు. అది కూడా indefinite. 2000 సంవత్సరాలలో చేసినా చెయ్యవచ్చును. తీర్మానానికి వ్యతి

K. Venkata Rao] [29th September 1955

శకం చేసేవారము కాము. కాని అది దగ్గరకు తీసుకొనివచ్చే అభిప్రాయం అసలు తీర్మానాన్ని విపులీకరణంచేసి, దానికి ఎక్కువ గౌరవం ఇచ్చి అందరికి ఉపయోగ కరముగా చేసే దృష్టిలో కాశేశ్వరరావుగారు ఈ సవరణను పెట్టడం జరిగింది. కనుక మీరందరు కూడా ఏకగ్రీవముగా ఈ సవరణతో కూడిన తీర్మానాన్ని ఆమో దిస్తే ఈ తీర్మానాన్ని అంగీకరించడానికి ప్రభుత్వానికి ఏ విధమైన అభ్యంతరము లేదు అని మనవిచేస్తూ శెలవు తీసుకుంటున్నాను.

Mr. DEPUTY SPEAKER :—చర్చ సంపూర్ణముగా జరిగింది. శ్రీ కాశేశ్వరరావుగారి సవరణ మీరందరు ఒప్పుకుంటారా?

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఇప్పటికే 15 మంది గౌరవనీయ సభ్యులు ఈ తీర్మానము మీద మాట్లాడినారు. మొత్తము ఆంధ్ర దేశము అంతాకూడా సంతోషిస్తుంది. నేను మరి ఏమీ చెప్ప తలచు కొనలేదు. సవరణతో కూడా ఈ తీర్మానాన్ని అందరు అంగీకరించవలెనని కోరు చున్నాను.

రెండవ విషయము. రేపు అక్టోబరు ఒకటవ తేదీన ప్రథమముగా secretariat లో తెలుగులో ఉత్తరముల ప్రారంభించి O. P. Section లో కనీసం ఒక కాగితం అయినా వ్రాసే పద్ధతి ఏర్పాటు చెయ్యమని కోరుతూ ఎక్కువ time తీసుకోకుండా సవరణను అంగీకరిస్తున్నాను.

Mr. DEPUTY SPEAKER :—తీర్మానమును ప్రతిపాదించినవారు సవరణను ఒప్పుకొన్నారు. కనుక సవరణతో సహా తీర్మానము మీ యెదుట పెడు తున్నాను. మొదట సవరణ తీర్మానాన్ని పెడుతున్నాను.

The question is :

> "After the word 'Government' occurring for the second time, the words 'as early as possible' may be inserted".

**The motion was Carried unanimously.**

Mr. DEPUTY SPEAKER :—సవరణతో సహా ఇప్పుడు తీర్మానమును ప్రశ్నార్థ వోటుకు పెడుతున్నాను.

The question is :

"This Assembly recommends to the Government to conduct the business of the Government as early as possible in Telugu only, in so far as it is not inconsistent with the provisions of the Constitution."

The motion was carried unanimously.

MR. DEPUTY SPEAKER :—తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడినది. చాలా సంతోషం. సభ రేపు ఉదయం 11 గంటలకు వాయిదా వేయబడింది

The House then adjourned.

---

